# నివేదన

సర్వ మానవ జాతీ సగర్వంగా కలకాలం స్మరించుకో దగ్గ పవిత్ర జీవులు ప్రపంచంలో బహు విరళంగా జన్మిస్తారు. అలాంటివారే తరువాతి తరాల ప్రజల జీవితాలకు వెలుగుబాటలు దిద్దే ధ్రువతార లవుతారు. అట్టి కారణ జన్ములలో గణనీయుడు అబ్రహాం లింకన్. లింకన్ వంటి మహామతులు ఏదో ఒక దేశానికో, ఒక జాతికో చెందిన వారు కారు; ప్రపంచ మంతటికీ చెందిన ఆస్తి వారు!

స్వాతంత్ర్య సంపాదనానంతరం భారత దేశంలో నడుస్తూన్న ప్రస్తుత నిరాశా, నిస్పృహ యుత యుగంలో లింకన్‌వంటి స్థితప్రజ్ఞుల జీవితాలు భారతీయులకు కొంత వరకైనా పథి ప్రదర్శకాలు కాగలవని మేము నమ్ముతున్నాము. లింకన్ 150 వ జన్మ దినోత్సవంనాడు ఆయన పవిత్ర జీవితాన్ని ఈ రూపంలో తెలుగు బాలురకు అందియ గలుగుతున్నందుకు మేము సంతోష పడుతున్నాము.

సరళమైన శైలిలో ఈ జీవిత చరిత్ర మా కనువదించి ఇచ్చిన శ్రీ "నృసింహగురు" గారికీ, సకాలంలో ముద్రించి ఇచ్చిన ముద్రాపకులకూ మా కృతజ్ఞత!

12 ఫిబ్రవరి, 1959, ప్రకాశకులు.

విశాఖపట్టణం-3.

# అధ్యాయ వివరణ

# నాన్సీకి మగపిల్లాడు!

"నా చిన్ననాటి జీవితమంతా ఒకే ఒక వాక్యంలో వర్ణించవచ్చు. 'అతి సంక్షిప్తంగాను, సరళంగాను ఉంటే బీదల చరిత్ర' అది. ఈ వాక్యం గ్రే మహాకవి కవితలోది."

అబ్రహాం లింకన్.

డెన్నిస్ హాంక్స్ అనే తొమ్మిదేళ్ల బాలుడు లింకన్ల ఇంటి (కాబిన్) వేపు తొందరగా పరుగెత్తుతున్నాడు. ఆ చలిలో గడ్డకట్టుకు పోయిన కాలువలు దాటుకుంటూ, మంచు పేరుకు పోయిన గుట్టల్ని తప్పించుకుంటూ నాలిన్‌నదికి రెండు వేపులా ఉన్న పర్వతాల లోంచి మెలికలు తిరుగుతూపోయే కాలిదారి మీదుగా గబగబా వెళ్లి పోతున్నాడు.

అనాడు 1809 ఫిబ్రవరి 12వ తేదీ, ఆదివారం. ఇప్పుడు అమెరికన్లు ఏటేట పండుగ చేసుకునే పుణ్యదినం. చలి వణికించేస్తూన్న ఆనాటి ఉదయం టాం లింకన్‌కి, నాన్సీకి అబ్రహాంలింకన్ అనే కొడుకు పుట్టాడన్న సంగతి మాత్రమే డెన్నిస్‌కి తెలుసు.

లింకన్ల యింటికి డెన్నిస్ తరచు ఈదారిని రావడం మామూలే. డెన్నిసూ, నాన్సీ అన్నదమ్ముల బిడ్డలు. వాళ్ల పినతల్లి బెట్సీస్పారో, పినతండ్రి టాంస్పారో వాళ్లిద్దర్నీ అతిగారాబంగా పెంచారు. అందు చేత అందరికంటె ముందుగా స్పారోలే తమ పసిపాపని చూడాలని లింకన్లు అనుకోడంలో ఆశ్చర్యమేం లేదు.

కూన్ చర్మపుటోపీ తోక గాలిలో ఊగులాడేట్టు చేస్తూ డెన్నిస్ లింకన్ల పొలంలోకి పరుగెత్తుకుని వచ్చాడు. అప్పుడే వాళ్లయింటిమీది పొగ

గొట్టంలోంచి పొగ పైకిలేస్తోంది. పాపాయి ఏబ్ ఎలా ఉంటాడో చూడాలని డెన్నిస్ చాలా ఆతురతగా ఉన్నాడు. డెన్నిస్ పిల్లల విషయాలేం ఎరగడు. నాన్సీకి పుట్టిన ఈ పిల్లవానిలో తప్పక ఏదో ప్రత్యేకత ఉంటుందని మాత్రం అతని దృఢవిశ్వాసం.!

తలుపు తెరుచుకొని అతను ఒకేగదిగాఉన్న ఆ ఇంట్లో అడుగు పెట్టాడు. మొదటిసారిగా నిప్పువెలుతురులో నాన్సీ పక్కన పడు కునిఉన్న ఆ చిన్న పాపాయిని డెన్నిస్ చూశాడు. నాన్సీ బాగా అలసినట్లున్నా నవ్వుముఖంతో ఉంది. ఆమె కన్న ఆ శిశువు ఒకానొక రోజున అమెరికన్లకి అత్యంతప్రేమాస్పదుడైన అధ్యక్షుడు కాబో తున్నాడు.

అనేక సంవత్సరాల తరువాత - డెన్నిస్ హాంక్స్ వృద్ధుడైనాక మంచుకురిసే ఆనాటి ఉదయాన్నిగూర్చి ఎప్పుడూ చెబుతూ ఉండే వాడు. వృద్ధులందరిలాగే అతనూ తనకథలో కొన్ని చమత్కారాలు చొప్పించి ఉంటాడంటే ఆశ్చర్యమేం లేదు. అయితే శ్రోతలు అతను చెప్పే కథని అత్యాసక్తితో వినేవారు.

"నాన్సీ అతిసంతృప్తితో మంచెలాంటి ఒక మంచంమీద పడు కుని ఉంది. టాం లింకన్ మంచి నెగడువేశాడు. వెచ్చగాఉండేందుకు తల్లీబిడ్డల్ని ఒక ఎలుగుబంటి చర్మంతో చక్కగా కప్పాడు."

బెట్సీస్పారో తల్లీబిడ్డలికి చెయ్యవలసిన ఉపచారాలన్నీ చేస్తోంది. చిన్ని ఏబ్ ని స్నానంచేయించి ఒకసన్నని చొక్కా,దానిమీద ఒకపసుపు పచ్చని ఫ్లానెల్ పొట్టి కోటూ తొడిగింది. నాన్సీకోసం కొన్ని ఎండు బెర్రీ పళ్లు తేనెలో ఉడకబెట్టింది. ఆమె ఉండడంవల్ల అన్ని ఏర్పాట్లూ చక్కగా జరిగాయి.



పాపాయిని ఎత్తుకున్నాడు డెన్నిస్

నాన్సీ తనపాపని డెన్నిస్ చేతికిచ్చి ఎత్తుకో మంది. అతనికి పాప ముఖం గట్టిగా పిండిన బెర్రీపండు ముద్దలా కనిపించింది.

నాన్సీ అతనితో "డెన్నిస్ ! జాగ్రత్త. పాప దృష్టిలోపడ్డ మొదటి బాలుడివి నువ్వే!" అంది.

కొద్దినిమిషాల తరవాత ఏడుస్తూన్న శిశువుని తనపిన్ని, బెట్టీ స్పారోకి అందిస్తూ డెన్నిస్ అన్నాడు-"పిన్నీ! ఇదుగో తీసుకో. మీ

పాపలో గొప్పవాడయే లక్షణాలేం చెప్పలే!" డెన్నిస్ చెప్పిన జ్యోతిషం ఫలించి ఉండవలసిందే. లింకన్ల కుటుంబం, హాంక్స్‌ల కుటుంబం పేద సంసారులు. తమబిడ్డ మహాపురుషుడు కావాలని వారెన్నడూ ఆశించలేదు.

పసి ఏబ్ మొదటి ఏడాది నిశ్చింతగా ఉయ్యాలలో పడుకుని గడిపాడు. ఆపసివాడికి ఏంకావాలి? వేళకు ఆహారం, వెచ్చని పక్క తల్లిప్రేమ. ఉయ్యాలలోంచి ఆ పాపకి కనిపిస్తున్న చిత్రాలల్లా నెగడు వెలుతురు, తిరుగుతూన్న రాట్నం, ఉండి ఉండి తననీవంక నంగి తనను ముద్దులాడే తల్లి నవ్వు ముఖం. అప్పుడప్పుడు టాం లింకన్ మొరటు ముఖం, నల్లని బిరుసు వెంట్రుకలూ కూడా కనిపించి ఉండవచ్చు. నెగడుపైన మేకుకి తగిలించిన వేటతుపాకీకోసం వచ్చినప్పుడు కూడా టాం లింకన్ ఆ పాప కంటపడి ఉండవచ్చు. ఇంకొక ముఖం కూడా ఆ పాపకి తరచు కనిపిస్తూ ఉండేది రెండేళ్ళ అక్క సారా ఉండి ఉండివచ్చి తన చిట్టితమ్ముణ్ణి ప్రేమతో చూసుకునేది. ఉత్సాహంగా ఉయ్యాల ఊపేది. పాప నవ్వినప్పుడల్లా తనూ నవ్వేది. తనతో ఆడుకునేందుకూ, మాట్లాడేందుకూ తమ్ముడెప్పుడు పెద్దవాడవుతాడా అని ఉవ్విళ్లూరేది.

ఇక రెండోయేడు. అక్క చెయ్యి పట్టుకుని తప్పటడుగులు వేసుకుంటూ వెళ్లి సెలయేటి తేటనీటిలోకి తొంగిచూస్తుచూస్తూండేవాడు. ఆ సెలయేరు చిన్న గుహనుంచి ప్రవహిస్తూంది. పాచిపట్టిన రాళ్లమీదుగా పరుగులు పెడుతూపోయి, ఒకచోట భూమిలోకి దూరి మాయమైపోతుంది. గలగలమనే ఆ సెలయేటి పాట మాత్రం పైకి వినిపించేది.

పెద్దవాడయాక లింకన్ తనజన్మస్థలమైన ఈ పొలాన్నీ, దానిలో ప్రవహించే ఈ యేరునీ పూర్తిగా మరచిపోయాడు. ఈ పొలం

కెంటకీలో హాడ్జెన్‌విల్ దగ్గర నాలిన్ క్రీక్‌కి సమీపంగా ఉండేది. ఏబ్ రెండో ఏటేట ఆ కుటుంబం అక్కడినుంచి కొద్ది మైళ్ళ దూరంలో ఉన్న ఇంకొక పొలానికి తరలింది. లింకన్‌కి ఈ పొలం కొంచెంగా జ్ఞాపక ముంది. మల్డ్రాఫ్ పర్వతపునీడల్లో నాబ్ క్రీక్ లోయలోని సారవంతమైన భూమిమీద తామస్ లింకన్ ఇంకొక కొయ్యలయిల్లు కట్టాడు.

డెన్నిస్ హాంక్స్‌కి ఇక్కడి సంగతులన్నీ బాగా గుర్తున్నాయి. "చూస్తూండగానే ఏబ్ దుప్పిచర్మపు బూట్లూ, పంట్లూ, లినెన్ షర్ట్లూ, కూన్ చర్మపు టోపీ ధరించి పొలంలో ఇటూ అటూ పరుగెత్తడం మొదలెట్టాడు. ఏబ్ తల్లిని ఎప్పుడూ ఏవిధంగానూ బాధించేవాడు కాదు. సరిగా వచ్చిన తరువాత బట్టలు తొడిగించుకునేటప్పుడు తప్ప ఏబ్‌కి తల్లి గొడవ ఉండేదే కాదు. మేం చాలావరకు కాళ్లకి జోళ్లు లేకుండానే గడిపే వాళ్లం. అన్నప్రాశన అయిన మర్నాటినుంచే ఏట్లో చేపల్ని పట్టేందుకు ఏబ్ అడవుల్లోకి వెళ్తూండేవాడు. టాం లింకన్, నేనూ కుక్కలతో వేటకి బయలుదేరినప్పుడల్లా ఏబ్ కూడా వెంట వచ్చేవాడు. ఉడుతపట్లని వెతకడానికి తేనెటీగల్ని వెంబడించేవాడు. తన కుక్క పిల్లకి స్వయంగా అన్నం పెట్టేవాడు. ఇక్కడి జీవితం పిల్లలకి చాలా సరదాగా ఉండేది. అయినా ఏబ్ పెద్దవాడయ్యేవరకూ అక్కడ ఉండకపోవడం మంచిదే అయింది" ఏబ్ లింకన్ పెద్దవాడయ్యాక కూడా ఆనాటి సంగతులు కొన్ని జ్ఞాపకం ఉన్నట్టు కనిపిస్తుంది. "అన్నిటికంటె ముందు నాకు గుర్తున్నది నాబ్ క్రీక్ ప్రాంతమే! పెద్ద పెద్ద కొండలమధ్య లోయలో ఉన్న మా పొలం మూడు ఖండాలుగా ఉండేది. ఒక శనివారం మధ్యాహ్నానికల్లా పెద్ద పొలంలో పనివాళ్లు మొక్కజొన్నలు చల్లారు. అది పెద్దదైన ఏడెకరాల పొలం. నేను గుమ్మడి విత్తులు నాటాను. ఆ మర్నాడు ఆదివారం సాయంత్రం కొండల్లో పెద్దవర్షం కురిసింది. నీళ్లన్నీ లోయలో

ఒక్క చినుకుకూడా పడలేదు. కాని కొండపైనించి కిందికి ప్రవహించిన వర్షపునీటితో మేము ఇంత కష్టపడి నాటిన విత్తులన్నీ పూర్తిగా కొట్టుకు పోయాయి," అని ఆయన రాశాడు.

ఒకసారి ఇలాంటి వరద వచ్చినప్పుడు ఏబ్ ఏట్లో పడిపోయాడు. మునిగిపోయేవాడే! అదృష్టంకొద్దీ ఏబ్‌తో ఆడుకునే గొల్లాహార్ అనే కుర్రవాడు చూసి ఒకకొమ్మ ఏట్లోవేసి, ఏబ్ దాన్ని పట్టుకుంటే ఎల్లాగో బయటికి లాగాడు.

ఇక్కడ ఉండగానే ఏబ్‌కి బయటి ప్రపంచంతో పరిచయం ఏర్పడింది. వాళ్లయింటిముందునుంచే కంబర్‌లాండ్ రోడ్డు పోతుంది. ఆరోడ్డు మీదుగా చిల్లర వస్తువులు అమ్ముకునే వ్యాపారులూ, కొత్త భూములు కొనుక్కునే సంసారులూ, సంకెళ్లు వేయబడిన బానిసలూ, ఇంకా రకరకాలైన బాటసారులూ వస్తూ పోతూ ఉండేవారు. ఒకసారి ఏబ్ గుమ్మంముందునించి ఒక సిపాయి వెళ్లాడు. ఆ సైనికుడు 1812వ సంవత్సరపు యుద్ధంలోంచి విడుదలపొంది యింటికి వెళుతున్నాడు. ఆ సైనికుని చూసే చూడ్డంతో ఏబ్ హృదయం ఆనందోద్వేగంతో పొంగిపోయింది. తను స్వయంగా ఏట్లో పట్టుకొచ్చిన ఒకచేపని ఏబ్ ఆ సైనికుడికి బహుమతిగా యిచ్చి, తన ఆనందాన్ని వ్యక్తపరిచాడు. లింకన్ తనచుట్టూ ఉండే దృశ్యాల్నిచూస్తూ శబ్దాల్ని వింటూ ఆశ్చర్యపోయేవాడు. అతను అల్లరిపిల్లవాడనే పేరు పొందాడు. కాని అంత చిన్నవయస్సులోకూడా అన్నివిషయాలూ తెలుసుకోవాలనే కుతూహలం అతనికి ఉండేది.

కొంతకాలానికి జకరయా రైనే అనే ఉపాధ్యాయుడు ఆ ప్రాంతాలకి వచ్చాడు. ఒక మురికియింట్లో బడిపెట్టి పిల్లలకి చదువు చెప్పేవాడు. అక్కడ ప్రతి విద్యార్థీ గట్టిగాపైకి అరుస్తూ చదివేవాడు.



తండ్రితో, డెన్నిస్ హాంక్సుతో కూన్ల వేట

ఏబ్ ఈ అలవాటు చిన్నప్పనే తన జీవితకాలమంతా పైకి గట్టిగా చదువుతూండేవాడు

చదువు సంధ్యలంటే థామస్ లింకన్‌కి ఏమాత్రం గిట్టదు తన తండ్రి ఒకచోట స్థిరంగా ఉండక తిరిగే కూలీవాడుగా ఉండేవాడని అబ్రహాం ఒకచోట వ్రాశాడు. అక్షరాలా ఏమాత్రం విద్యాగంధం లేకుండా పెరిగాడట! అయినా థామస్ మంచిపేటగాడు; చక్కని వ్రడంగి. కష్టపడి పనిచేసినా ఫలితం దక్కని కర్షకుడు ఆయన కథచెప్తూఉంటే ఎటువంటివారైనా చెవులు నిక్కబొడుచుకుని వినేవారు. పాపం-ఎంతో తడుముకుంటూ కాని సంతకం పెట్టలేకపోయేవాడు. చదువంటే అతనికెక్కడలేని చికాకూను!

హాంక్సు, స్పారో కుటుంబాలు బీదవి. చదువు సంధ్యలులేనివి అయినప్పటికీ, ఏబ్ తల్లి నాన్సీ హాంక్స్ లింకన్ చాలా తెలివైనదనీ దయాదాక్షిణ్యాలు కలదనీ అంతా అంటారు. కొందరు ఆమెకి చదవడం వ్రాయడం కూడా తెలుసునని అంటారు. కాని అది నిజమనడానికి వీలులేదు ఏది ఎలా ఉన్నా పసిపిల్లలకి కొద్దికాలమైనా బడి చదువు చెప్పించాలని ఆమే పట్టుపట్టింది.

1816లో థామస్ లింకన్ చాలా కంగారు పడుతున్నాడనే విషయం నాన్సీ కనిపెట్టింది. అతని భూమిని ఇతరులు తమదనిచెప్పి వశపరచుకొనే పరిస్థితి మళ్లీ ఏర్పడింది. బానిసత్వాన్ని సమర్థించే రాష్ట్రంలో బానిసలులేని తనవంటి బీదరైతు పైకి రావడం కష్టమని కూడా అతడు గ్రహించాడు. ఓహియోనదికి ఉత్తరాన సారవంతమైన ఇండియానా ప్రాంతం ఉంది. ఇంకా అక్కడికెవరూ వలసపోలేదు. ఇదే మంచి అదను అనీ అక్కడ కొంతభూమి సంపాదించి మళ్లీ కొత్తగామన అదృష్టాన్ని పరీక్షించుకోవచ్చుననీ థామస్ వాదించాడు.

కొత్త దేశాన్ని పరీక్షించడానికి తనభర్త ఒంటరిగా బయలుదేరి వెళ్ళినప్పుడు నాన్సీ లింకన్ ఏమనుకుందో మనం ఊహించవలసిందే! తాను కాపరానికివచ్చిన పదేళ్లలో అప్పుడే మూడుసార్లు స్థలాలు మార్చిన తనభర్త ఎప్పటికేనా ఒకచోట స్థిరపడతాడా అని ఆమె బాధపడి ఉండాలి. సరిహద్దులలో అంతకుముందెన్నడూ కనీ వినీ ఎరుగనంత తీవ్రమైన చలి ఆయేడు వచ్చింది. ఆ కాలపువారు ఈ (1800 వ) సంవత్సరాన్ని "చలి చావుల సంవత్సరం" అనేవారు. టాం ఇండియానానుంచి తిరిగివచ్చేసరికి బాగా చలికాలం వచ్చింది. ఇద్దరు చంటి పిల్లలతో అడవుల్లో ప్రయాణం చేసేందుకు అది అతి అపాయకరమైన ఋతువు. చీకటి కొంపలో ఒంటరిగా ఉన్నప్పుడు ఈ సంగతి జ్ఞాపకమొచ్చి నాన్సీ అప్పుడప్పుడు ఏడ్చి ఉంటుంది.

కాని ఏబ్‌కి మాత్రం ఈ ప్రయాణం చాలా ఆనందాన్ని కలగజేసి ఉంటుంది. ఇంటి వెనుక ఉన్న ఎత్తైనగుట్టమీద నుంచుని అతను దూరంలోఉన్న ఇండియానాలోని మంచుకట్టిన అడవులను చూడడానికి ప్రయత్నించి ఉంటాడు. ఇండియానా అనే పేరు అతనికి ఇండియన్లని స్ఫురింపజేసేది. తప్పక అక్కడ ఎలుగుబంట్లు ఎక్కువగా ఉండి ఉంటాయి! అయితే ఏబ్‌కి భయపడవలసిన అవసరమేముంది? అతిత్వరలో తను ఎనిమిదేళ్లవాడుకాబోతున్నాడు. అప్పుడు తను కూడా పెద్దవాళ్లందరిలాగ తుపాకి తీసుకువెళ్లవచ్చు!

అక్టోబరు సూర్యుడికి అడ్డుగా కళ్లకి చేతులు అడ్డుపెట్టుకుంటూ ఏబ్ ఉత్తర దిక్కుగా చాలా దూరంలో కనిపించే నీలిచార ఆకాశంలో ఒకభాగమాఅని ఆశ్చర్యపోయాడు. లేక అది ఓహియో మహానదేమో! ఆనదిఒడ్డునేగా పంటలకుఅనువైన ఇండియానాఉన్నది!!

# తాత్కాలిక నివాసం

"ఇండియానా అప్పుడే కొత్తగా యూనియన్‌లో చేరింది. మేము ఆచే సమయంలో మా కొత్త నివాసం చేరుకున్నాం. అది చాలా భయంకర మైన స్థలం. అక్కడి అడవుల్లో ఎలుగుబంట్లూ, ఇంకా చాలా అడవి జంతువులూ ఉండేవి. అక్కడే నేను పెరిగాను."

అబ్రహాం లింకన్

టాం లింకన్ నవంబరులో తిరిగివచ్చాడు. ఓహియోనదికి ఉత్తరంగా కొన్నిమైళ్ళదూరంలో తను 160 ఎకరాలభూమి సంపాదించానని నాన్సీతోనూ పిల్లలతోనూ చెప్పాడు. ఆభూమి పీజియన్ క్రీక్ (యేరు) దగ్గరలో ఉంది. సారవంతమైన ఆ భూమినీ, లెక్కకు మిక్కుటంగా ఉన్న అక్కడి లేళ్లని అడవికోళ్ళనిగూర్చి వర్ణించడంలో అతనేం లోటుచెయ్యలేదు. అయితే మంచినీళ్ళు చాలాదూరంలో ఉన్న సెలయేటి నుంచి తెచ్చుకోవాలన్న సంగతీ, ఎలుగు బంట్లూ, తోడేళ్లూ, చిరుతపులులూ అడవిపిల్లులూ ఆ ప్రాంతం అంతటా నిండి ఉన్నాయన్న సంగతీ చెప్పలేదు. ఆ సమీపంలోని పల్లపు ప్రదేశాలవల్ల మలేరియా వ్యాపిస్తుందన్న సంగతికూడా అతనికంత ముఖ్యమైనదిగా కనిపించలేదు.

కంటకీలోవలె గాక ఇండియానాలో ప్రభుత్వం పంచిపెట్టిన భూములు సుస్థిరమైన వన్నమాట నిజమే. ఈ భూమిలో కొంతభాగం

ఫలవంతమైనదే! అయినప్పటికీ నడి శీతకాలంలో సాగుచెయ్యాని అడవి ప్రదేశానికి ఇంకా యిల్లు కట్టనైనా కట్టకుండా తన భార్యనీ పిల్లలనీ తీసుకు వెళ్లే సందర్భంలో టాం లింకన్ వంటి అస్థిరబుద్ధిగల గృహస్థు కూడ ఎంతో బాధపడి ఉండాలి.

లింకన్ కుటుంబం ఇండియానాకి బయలుదేరి వెళ్లడం కళ్లారా చూసిన డెన్నిస్ హాంక్సు వ్రాసిన వ్రాతతే మనకీ సందర్భంలో ఆధారం:

"నాన్సీ అరలలోంచి సామానంతా తీసింది. నేను వాళ్ళు తీసుకు వెళ్ళవలసిన సామానంతా రెండు గుర్రాల వీపులపైన సర్దాను. మంచాలు, బల్లలు, పీటలు ఇక్కడినుంచి వెంటమోసుకుని పోవడం కంటె అక్కడికి వెళ్ళాక కొత్తవి అతి తేలికగా టాం తయారు చెయ్య గలడు.

రెండు రోజులు ప్రయాణంచేసి లింకన్లు ఇండియానా తీరాన ఉన్న ఆండర్సన్ క్రీక్ ముఖద్వారానికి ఎదురుగా ఓహియో దక్షిణ తీరాన్ని చేరుకున్నారు. అప్పటి కప్పుడు తయారుచేసిన దూలాల పడవ ఎక్కి, వారా విశాలమైన చక్కని నదిని దాటారు. పోసీ అనే వ్యక్తి పొలంలో దిగారు. అక్కడినుంచి వాళ్ళు అడవుల్లో ప్రవేశించారు. అంతు పొంతు లేని ఆ అడవులగుండా పదహారుమైళ్ళు అతి కష్టంమీద మెల్లిగా త్రోవచేసుకుంటూ కొత్త పొలంకేసి పయనించారు.

వాళ్ళు పయనించినంత మేరా మానవుని కంటబడని కలప ఇంకా శీతకాలపు ఆకులతో దోగాడు తోంది. పాప్లారుచెట్లు, బీచ్ వృక్షాలు తమ ఆఖరి పండుటాకుల బంగారు చాయలతో సలబాపు తున్నాయి. కొన్ని మేపుల్ వృక్షాలు ఇంకా ఎర్రగానే ఉన్నాయి

శాగ్‌బార్క్ వృక్షాలు, హికరీచెట్లు పసుపుపచ్చని ఆకుల్ని వెదజల్లు తున్నాయి. అడవి భూభాగం హికరీకాయలతో నిండిపోయింది. అన్నివృక్షాలకంటె ఆలస్యంగా ఆకురాల్చే ఓక్‌వృక్షాలు గోధుమ వర్ణంతో సింగారించుకున్నాయి. ఎత్తైన సికమోర్ వృక్షాలు తళ తళ లాడే మ్రానులతో సెలయేళ్ళకి రెండు పక్కలా ఆకాశాన్నంటు తూ నిలబడి ఉన్నాయి. సస్సఫ్రాస్ వృక్షాల నిగనిగలు సస్సఫ్రాస్ టీకి పనికివచ్చే వేళ్ళు ఎక్కడ తవ్వాలో చెప్పక చెపుతున్నాయి. ఎక్కడచూసినా వాల్‌నట్ చెట్లనీ తియ్యాబంక చెట్లనీ ఏష్ చెట్లనీ ఎల్మ్‌చెట్లనీ పెనవేసుకున్న ద్రాక్షతీగెలే! వాటి పచ్చబడిన ఆకుల్లో ఊదారంగు గుత్తులు వేలాడుతున్నాయి. మానవజాతికి ముందునుంచీ పెరుగుతూన్న సుదీర్ఘవృక్షాలు అనంతాకాశంలో తలలాడిస్తున్నాయి. "ఆ విశాల ప్రపంచంలో వృక్షాలు, వృక్షాలువృక్షాలు. అంతటావృక్షాలు తప్ప వేరే ఏమీకనిపించడంలేదు."

ఈ చెట్ల నీడలలోంచి విరోధులైన ఎర్ర ఇండియన్లు సాక్షాత్కరించడంలేదు. 1816 లో దక్షిణఇండియానాలో అడవిజాతులవారు ఇంకా కయ్యానికి కాలు దువ్వలేదు. అయితే, ఏబ్ ఓహియోనదిని దాటే టప్పుడు తన తుపాకీ మందు తడిసిపోకుండా జాగ్రత్త పెట్టుకున్నాడు. చెట్లగుండా ప్రయాణంచేస్తూన్నంతసేపూ అతను నలువైపులా శ్రద్ధగా కనిపెట్టి చూస్తూనే ఉన్నాడు. తనపేరు తన తాతగారిపేరే నన్న విషయమూ, కంటకీకి తిరిగివస్తూండగా ఆయన్ని ఒక ఇండియన్ చంపాడన్న విషయమూ అతను మరచిపోలేదు.

ఏబ్ తండ్రి అనేకసార్లు ఆకథ చెప్పాడు. బహుశః ఇప్పుడు కూడా, చుట్టూ ఘోరారణ్యం వ్యాపించి ఉండగా చలిమంట కాగుతూ మళ్ళీ ఆ కథ చెప్పిఉంటాడు. ఎక్కడో దూరంలో ఒక తోడేళ్ళు ఘోరవైకెత్తి నక్షత్రాలకేసి చూస్తూ అరిచింది.

తాత్కాలిక నివాసం

మొదటి అబ్రహాం లింకన్ - అంటే ఏబ్ తాత - డానియల్ బూన్ స్నేహితుడు. అతను 1782 లో వర్జీనియానుంచి పర్వత మార్గాన కంటకీకి వలస వెళ్ళాడు. ముగ్గురు కొడుకులతోను ఇద్దరు కూతుళ్ళతోను అతను భార్యా సహితంగా కంటకీలో గ్రీన్‌నదీతీరాన స్థిరపడ్డాడు. అక్కడ ఆయనకి 2000 ఎకరాలకి పైగా భూమి సంక్రమించింది.

1786 లో ఒకరోజున ఆయన తన కొడుకులతో కలిసి పొలం లో పనిచేస్తున్నాడు. హఠాత్తుగా సమీపారణ్యం నుంచి ఒక తుపాకీ గుండు పేలింది. అబ్రహాం భూమిమీద పడిపోయాడు. కొద్దినిమిషాలలోనే చనిపోయాడు. ఈ కథ చెబుతూన్న టాం లింకన్ అప్పటికి ఎనిమిదేళ్లవాడు. తన అన్నగార్లిద్దరూ సహాయంకోసం పరిగెత్తగా చిన్న టాం కొంచెం భయపడినా ధైర్యంగా తండ్రి శవం దగ్గర నుంచున్నాడు. అతను ఒంటరిగా ఉండగా చూసి చెట్లమాటునుండి ఒక ఇండియన్ గబగబా ఆ వైపు పరుగెత్తుకుని వచ్చాడు.

ఆ ఇండియన్ తనను ఖైదుచేస్తాడా? లేక అక్కడికక్కడే తనను చంపుతాడా? ఇండియన్ మెడలోఉన్న పతకం ప్రకాశానికి టాం కళ్ళు మిరుమిట్లుగొన్నాయి. మరుక్షణంలో ఆయన కింకొక గుండు దెబ్బ వినిపించింది. ఈసారి అది గట్టుమీదినుంచి వచ్చింది సరిగా ఆ పతకానికి కిందుగా ఒక గాయంలోంచి రక్తం ప్రవహించింది. ఆ అడవిమనిషి టాం పాదాల దగ్గిర భూమిమీద పడిపోయాడు. టాం సోదరులు ఉడుతకంటిని కూడా గురిచూసి కొట్టగల సమర్థులు.

ముసలి లింకన్ చనిపోవడంతో కుటుంబం చెల్లా చెదరైపోయింది. అప్పుడేటాం దూరంలో ఉన్న ఇండియానాకి వచ్చాడు



ఆ ఎర్ర ఇండియాన్ తనని ఎత్తుకుపోతే......!

చిన్న ఏబ్ మంటకి దగ్గరగా జరిగాడు. ఇంకొక తోడేలు మొదటి తోడేలుకి జవాబుగా అరిచింది. మంట వెలుతురులో దూరంనుంచి వినవచ్చిన చిరుతపులి అరుపు విని లింకన్ అవయవాలు గజ గజ వణికాయి.

కొత్త పొలం గుర్తించడానికి టాం ఇంతకుముందు 160 ఎకరాల భూమికి నలుమూలలా పోగుపెట్టిన చెట్టుకొమ్మలు వాళ్ళకి కొండ గుర్తుల్లా పనిచేశాయి, ఏబ్, తండ్రీ త్వరలోనే ఒక సగం మూసిన కుటీరం తయారుచేశారు. అది పద్నాలుగు అడుగుల వెడల్పు, అంతే ఎత్తుతో ఒక వేటగాళ్ళ గుడారంలా తయారైంది. దాని చట్రం కొయ్యలతో చెయ్యబడి చెట్ల బెరడు కప్పుతో దక్షిణం వేపు పూర్తిగా తెరువబడిఉంది. ఆవైపు రాత్రింబగళ్ళు పెద్ద పెద్ద దుంగలతో చలిమంట మండుతూ ఉంటుంది. ఆకులు పరచిన నేల; ఆకులే పక్కలు ఆ మనుష్య నిర్మిత గుహకి ఆ ఆకులు అందాన్నిస్తున్నాయి. చెట్ల తొర్రలలో నివసించే ఉడుతలలా లింకన్లు అందులో వెచ్చగా ఉండేవారు అయితే వాన కురిసినప్పుడు మంచు పడుతూన్నప్పుడు పొగ ఎక్కువైనప్పుడు మాత్రం వాళ్ళకి చాలా ఇబ్బందిగా ఉండేది.

త్వరలోనే టాం లింకన్ మంచి ఇల్లు కట్టడం ప్రారంభించాడు. కాని చలికాలమంతా ఏబ్, సారాలు తల్లిదండ్రులతోపాటు ఒకవేపు గోడలేని ఆ గుహలోనే గడపవలసి వచ్చింది.

అదృష్టవశాత్తూ అక్కడ జంతువులకేం లోటులేదు. కావలసినంత మాంసం దొరికేది. అయితే నీటి ఇబ్బంది చాలా తీవ్రంగా ఉండేది. చాలాకాలందాకా మైలు దూరంలోఉన్న సెలయేటికి వెళ్ళి రావడం ఏబ్ పనుల్లో ఒకటై ఉండేది. కొత్త కాబిన్ కోసం చెట్లు నరకడంలోకూడా అతను సహాయపడేవాడు.

చాలా కాలం తరువాత ఎవరో ఒక పిల్లవాణ్ణి గురించి చెప్తూ ఉన్నట్టుగా చెప్పిన తన చిన్ననాటి కథలో అబ్రహాం లింకన్ ఇలా వ్రాశాడు.

"చాలా చిన్నవాడైనా 'ఏ' వయస్సుకి మించి పెద్దవాడుగా కనిపించేవాడు. అతి తర్వలోనే అతని చేతికి గొడ్డలి వచ్చింది. అది మొదలు తన ఇరవై మూడో యేడువరకూ ఏరోజూ మానకుండా ఎంతో ఉపయోగకరమైన ఆ గొడ్డలిని ఉపయోగిస్తూనే ఉన్నాడు! పొలం దున్నేరోజుల్లోనూ కోతల రోజులలోనూ మాత్రం అంత ఎక్కువగా ఉపయోగించేవాడుకాదు. ఇక్కడే 'ఏ' అతి చిన్నతనంలోనే వేటగాడయ్యాడు అయితే అతను అందులో రాణించలేదనే చెప్పాలి. (ఎనిమిదోయేడు పూర్తిగా నిండడానికి కొద్ది రోజుల ముందు తన తండ్రి లేనప్పుడు ఒక అడవికోళ్ళ గుంపు కొత్తకర్రలింటి దగ్గిరికి వచ్చింది. ఏ. లోపలనుంచునే ఒక పగులుగుండా తుపాకి పేల్చి వాటిలో ఒక దాన్ని చంపాడు. ఆ తరువాత మళ్ళీ అతనెప్పుడూ అంతకంటె పెద్ద జంతువుని వేటాడలేదు.)

ఆఖరికి మిసిసిపీ నదికీ ఓహియోనదికీ ఆ తరువాత పీజియన్ నదికీ ముస్తాబుచేస్తూ తన చిగుళ్ళతోనూ పువ్వులతోనూ ఏప్రిల్ మాసం వచ్చింది. తెల్లని పువ్వులతో అది ఆ గుహనీ, సగమేపూర్తయైన లింకన్ కాబిన్‌నీ ముంచెత్తేసింది. వైలెట్ పూల ఊదారందుతోనూ బట్టర్ కప్‌ల పూట బంగారం రంగుతోనూ అది పచ్చగడ్డిని కప్పేసింది. ధాన్యం, పళ్ళవిత్తులు సాగుచేసిన భూమిలో నాటారు. కాని పందుల్ని తినడానికి ఎలుగు బంట్లు వచ్చాయి. లింకన్ ఒకపద్యంలో ఈ విషయమే ఇలా వర్ణించాడు:

మా తండ్రి వలసవచ్చే నాటికి
ఇది సరిహద్దు ప్రాంతము!
చిరుతపులి అరపులు రాత్రినీ
భయంకర శబ్దంతో ధ్వనింపజేసేవి!
ఎలుగుబంట్లు పందులకోసం పొంచి పొంచి చూసేవి!

1817 వ సంవత్సరం ఆకురాలు కాలం వచ్చింది. లింకను కుటుంబం ఇక్కడికి వచ్చి ఇంకా సంవత్సరం నిండలేదు. ఉత్సాహవంతుడైన డెన్నిస్ హాంక్స్, థామస్ స్పారో, బెట్సీ స్పారోలుకూడా ఇదే సమయానికివచ్చి లింకన్‌ని చేరుకున్నారు. వీరి ఆగమనంతో ఏకాంతంగాఉన్న పీజియన్ ప్రాంతం కొంత సందడిగా ఉండేది. నాన్సీ లింకన్‌కి ఆమె జ్ఞాతి డెన్నిస్ హాంక్స్‌కి స్పారోలు పెంపుడు తల్లిదండులన్న సంగతి మీకు జ్ఞప్తిఉండే ఉంటుంది! ఇక్కడ ఇండియానాలో అంతా వాళ్ళని శ్రీమతి లింకన్ తల్లిదండ్రులనే పిలిచేవారు.

డెన్నిస్ పేరు పెట్టినట్టు 'సగం కప్పబడ్డ ఆ చచ్చు గుహ'లోనే స్పారోలు ఇరుక్కున్నారు. లింకన్లు అప్పటికి తమ కొత్త కాబిన్‌లో ప్రవేశించారు. దూలాలతో కట్టబడిన ఆ ఇల్లు పద్ధెనిమిది అడుగుల వెడల్పూ, ఇరవై అడుగుల పొడుగూ ఉంది. కప్పు పైనకూడా ఒక గది ఉండడం ఒక విశేషం. ఇక్కడ నాన్సీ తన రాట్నం పెట్టుకునేందుకూ, అసలైన పొయ్యిమీద వంటచేసుకునేందుకూ, కొయ్యమంచంమీద పడుకునేందుకూ తగిన స్థలం ఉంది. ఆమెకి మళ్లీ ఇక్కడ కొత్త బల్లలు, పీటలు తయారయ్యాయి. కొవ్వు రాసిన కాగితాలతో కిటికీ రంధ్రాలు మొయ్యడానికి కూడా వీలయింది. ఖాళీ స్థలాలలో వేళ్లాడుతున్న చర్మాలని రాసుకుంటూ చలిగాలులు వీచేవి. నేలపైన పరిచేందుకు ఏమీ ఉండేదికాదు. చెక్కకీ చెక్కకీ

మధ్య ఉండే ఖాళీలు అలాగే విడిచి పెట్టారు. పై కప్పు కూడా అసంపూర్ణంగా వదిలివేశారు. ఇంక ఆకాలపువారు తరచు చిన్న తనంలోనే చనిపోయేవారంటే ఆశ్చర్యం ఏముంది?

డెన్నిస్ హాంక్స్ అన్నాడు, "మేం ఎప్పుడూ ఊరికే వేటాడు తూనే ఉండేవాళ్ళం. ముఖ్యంగా పనిచెయ్యడానికి విసుగెత్తి నప్పుడల్లా వేటాడేవాళ్ళం. ఎప్పుడూ అక్కడి పని విసుగ్గా ఉండేదన్న సంగతి నేను చెప్పక్కర్లేదు."

1817-18 సంవత్సరం చలికాలంమంతా లింకన్లు తమ సగం కట్టిన ఇంట్లో గజగజలాడుతూ గడిపితే స్పారోలు సగం తెరిచివున్న గుడిసెలో చలికి పిడుచకట్టుకుపోయారు. 1818 వసంత ఋతువులో పంట వెయ్యడానికి ఆరు ఎకరాల భూమిని తయారుచేశారు. కాని రెండు కుటుంబాలవారూ ఇంకా మాంసం, పళ్లు, గింజలమీదే బతు కుతూ ఉండేవారు.

ఆ తరువాత చలికాలం వచ్చేటప్పటికి చిత్రమైన, అతి భయం కరమైన "పాలజబ్బు" వచ్చిపడింది. ఆవులతోపాటు మనుష్యులుకూడా దానికి ఎర అయారు. ఆరోగ లక్షణా లేమైతేయేం గాని చూస్తూ ఉండ గానే థామస్ స్పారో, బెట్సీ స్పారోలు అ తెరుచుకునిఉన్న గుహలో మంచం బట్టారు. నాన్సీ ఎంతో శ్రద్ధగా వాళ్ళకి సేవచేసింది. కాని కుక్కలు నక్కలలాగ వాళ్ళు ఆకుల ప్రక్కమీద ప్రాణాలు విడిచారు.

ఒకవైపు టాం లింకన్ వికృతమైన శవపేటికలు తయారుచేసి, వాళ్ళ శవాల్ని ఒక దాని పక్క ఒకటి పాతిపెట్టాడో లేదో, నాన్సీ మంచం ఎక్కింది. ముప్పైఏళ్ళ లోపున డాక్టర్ ఎవడూ లేడు. టాం ఆ డాక్టర్ని తీసుకు వచ్చేందుకు ప్రయత్నించినా ఏం లాభం ఉండేది



విచారంగా ఉన్నప్పుడల్లా......

కాదు. పాలజబ్బుకి మందిచ్చి బాగుపరచగల్గడం మనుష్యమాత్రుని వశం కాదు

ఆకురాలు కాలం రావడంతో మళ్ళీ ఒకసారి ఆకులు గలగల రాలాయి. ఆకాశం స్వచ్ఛంగా ప్రకాశించింది. మధుర సరళ హృదయమైన అబ్రహాం సారాల మాత పిల్లల్ని తన మంచం దగ్గిరికి పిలిచింది. మంచి వాళ్ళంగా ఉంటామనీ, తమలో తాము కొట్టుకోమనీ వాళ్ళచేత ఒట్టు వేయించుకుంది. అంతే! ఆమె కళ్లు మూసింది. అది తల్లిలేని ఇల్లయింది. రాజ్యం మౌనం వహించింది.

డెన్నిస్ హాంక్స్ అన్నాడు, "అయ్యయ్యో! నాన్సీ మరణం వల్ల అడవిలో ఆ చిన్న ఆకుల, పచ్చని చెక్కల కొంపలో ఎంతటి గాఢంగా దుఃఖాంధకారం అలముకుందో నే నెన్నటికీ మరచిపోలేను.

"నేనూ, ఏబ్ శవపేటికని తయారు చెయ్యడంలో టాం కి సహాయపడ్డాం. కాబిన్ కట్టడానికి తెచ్చిన దుంగల్లోనుంచి అతను ఒక దుంగ తీశాడు. దాన్ని చెక్కలుగా కొయ్యడానికి వాటిని అతక డానికి నేను సహాయపడ్డాను. టాం రంధ్రాలు చేసేటప్పుడు నేనూ, ఏబ్ చెక్కల్ని పట్టుకున్నాం. ఎప్పుడూ ఎవరికో ఒకరికి టాం శవ పేటికల్ని తయారు చేస్తూనే ఉన్నట్టు నాకు జ్ఞాపకం. అడవిలో లేళ్లు నివసించే ప్రదేశానికి దగ్గరలోనే మేం నాన్సీని పాతిపెట్టాం. అడవి జంతువుల్లో ఒక్క లేళ్ళకే ఆడవాళ్ళు భయపడకుండా ఉండేవాళ్ళు. ఏబ్ సుమారు తొమ్మిదేళ్ళవాడై ఉంటాడు. కాని తన తల్లి ఆ విధంగా మృత్యువు పాలు అవడం ఏబ్ ఎన్నటికీ మరచిపోలేడు."

అది ప్రశాంతమైన స్థలం! శిశిర ఋతువులో ఎండుటాకులు, హేమంత ఋతువులో మంచు బిందువులూ నిశ్శబ్దంగా క్రిందికి రాలుతున్నాయి. ఏబ్ ఏకాకిగా, విచారంగా ఉన్నప్పుడల్లా ఆ స్థలానికి చేరుకునేవాడు.

# మారు తల్లి

*"ఏబ్ చాలా మంచి పిల్లవాడు .... నా కెప్పుడూ ఎదురు చెప్ప లేదు........ప్రతివాళ్ళనీ, ప్రతి జంతువునీ దయగా చూసేవాడు........ అతని అభిప్రాయాలూ, నా అభిప్రాయాలూ - నాకున్న ఆ కొద్ది అభి ప్రాయాలూ-ఒకే విధంగా ఉన్నట్లు కనిపించేది. నిజానికి మా ఇద్దరిదీ ఒకే ధోరణి!"*

సారా బుష్ లింకన్

నాన్సీ లింకన్ చనిపోయిన తరువాత ఒక సంవత్సరం పాటు పన్నెండేళ్ల సారా తన తండ్రికీ, పదేళ్ళ ఏబ్ కీ, డెన్నిస్ హాంక్స్‌కి వంట చేసి పెట్టింది. పీజియన్ క్రీక్ దగ్గిర ఆ పొలంలో సగం కట్టీ కట్ట కుండా వదిలి పెట్టిన ఆ కాబిన్‌లో జీవితం దుర్భరంగా ఉండేది.

స్పారోలకీ, నాన్సీకి శాస్త్రీయంగా అంత్యక్రియలు జరగలేదని టాంకి చాలా బాధగాఉంది. కంటకీ రాష్ట్రానికి చెందిన హార్డిన్ కౌంటీ నుంచి ఎల్ కిన్ అనే మతాచార్యుడు రావడంతో అతని విచారం కొంత ఉపశమించింది. 'లేళ్లదారి' దగ్గిరఉన్న మట్టి పోగుల నుద్దేశించి మంత్రాలు చదవడానికి ఆ పార్సన్ ఒప్పుకున్నాడు. అతను మృతుల ఆత్మశాంతి కోసం మంత్రాలు చదువుతూండగా ఏబ్, సారా, డెన్నిస్, టామూ అవనతమస్తకులై నుంచున్నారు. బూడిదకి బూడిద! మట్టికి మట్టి!!

మన ప్రేమపాత్రుల వియోగాన్ని మంత్రాలు మరిపింపజేస్తా యనేదికల్ల, వాళ్లకి ఉత్సాహాన్ని కలగజేసేందుకు, వారి యెడల

సాను భూతి కనబర్చేందుకు నాన్సీ ఇక లేదు; ఏకులు తయారుచేసి నూలు వడికి నేసే నాన్సీ ఇక లేదు; సబ్బులూ కొవ్వువత్తులూ పానీయాలూ తయారుచేసే నాన్సీ ఇక లేదు. కుటుంబ మంతా చాలా అస్త వ్యస్తంగానూ, అపరిశుభ్రంగానూ తయారైంది.

మళ్ళీ శిశిరఋతువుతో నాన్సీ సంవత్సరీకాలు వచ్చాయి. ఏకాకితనంతో విసుగెత్తిపోయి టాం లింకన్ కంటకీకి తిరిగి ప్రయాణ మయాడు. అతను లేనప్పుడు ముగ్గురు పిల్లలూ ఇంకా ఏకాకులుగా అయిపోయారు. చీకటి రాత్రివేళ చెట్లమీంచి చలి గాలులు రివ్వున వీచేటప్పుడూ, శిశిరఋతువులో ఆకులు గలగల రాలి నప్పుడూ, రాలుటాకులు ఇంటికప్పు సందుల్ని దూసుకుని ధ్వని చేసినప్పుడూ వాళ్ళకి చాలా భయంవేసేది. చిరుతపులి ఇంటికప్పు చీల్చుకుని ఇంట్లోకి వస్తూందేమోనని హడలిపోయేవాళ్ళు, అడవి పిల్లులు అప్పుడప్పుడు అలా వచ్చేవి.

ఒక్క నిమిషం కూడా ఆలసించకుండా టాం లింకన్ ఎలిజబెత్ టౌను లోని సారా బుష్ జాన్‌స్టన్ ఇంటికి వెళ్ళాడు. నాన్సీ హాంక్స్‌ని పెళ్ళాడకముందు అతను ఈమెని ప్రేమించాడు. సారా భర్త డేనియల్ జాన్‌స్టన్ ఆమెని ముగ్గురుపిల్లలతో వదిలి చనిపోయాడు. ఆమె పిల్లలు ఎలిజబెత్, మాటిల్డా, జాన్లు కూడా టాం పిల్లలలాగే పసికూనలు. వాళ్ళ అవసరం వీళ్ళ అవసరంకూడ ఇంచు మించు ఒక లాంటివే!

ఒక సాక్షి కథనం ప్రకారం టాం సారాతో అన్నాడు "ఇదిగో మిస్ జాన్‌స్టన్! నాకు భార్య లేదు; నీకుభర్త లేడు. నిన్ను పెళ్ళాడే ఉద్దేశంతోనే నేనిక్కడికి వచ్చాను. చిన్న పిల్లగా ఉన్నప్పటినుంచీ నువ్వు నాకు తెలుసు. చిన్నపిల్లవాణ్ణిగా ఉన్నప్పటినుంచీ నేను నీకూ

తెలుసు. నీకు ఇష్టమైతే వెంటనే పెళ్ళి చేసుకుందాం"! దానికి సారా ఈ విధంగా జవాబు చెప్పిందని ఆ సాక్షి అంటాడు:

"టామీ! నువ్వు నాకు బాగా తెలుసు. నిన్ను పెళ్ళాడడానికినాకేం అభ్యంతరంలేదు. నాకిక్కడ కొన్ని అప్పులున్నాయి. అవి ముందు తీర్చందే నేను వెంటనే ఎలా పెళ్ళి చేసుకోగలను?"

టాం లింకన్ ఎంతమాత్రం నిరుత్సాహ పడలేదు. అతను వెంటనే ఆమె అప్పులన్నీ తీర్చేశాడు. ఆ మరునాడే డిసెంబరు 2,1819 న వాళ్లు పెళ్ళిచేసుకున్నారు.

పీజియన్ క్రీక్ లోని క్యాబిన్ ముందు ఒక నాలుగు గుర్రాల వేగనువచ్చి ఆగేటప్పటికి ఏబ్, సారా, డెన్నిస్ల ఆశ్చర్యానికి అంతు లేక పోయింది. వేగన్ నిండా-ఈకల తలగడాలు, రకరకాల డ్రాయర్లు, లినెన్ రాట్నం, సబ్బు తయారుచేసే పని ముట్లు, వంట సామాన్లూ, ప్యూటర్ డిష్లూ, ఉన్నాయి. నవ్వుముఖంతో కలకల లాడుతూన్న కొత్తతల్లీ, ఒక క్రొత్త సోదరుడూ ఇద్దరు క్రొత్త చెల్లెళ్ళూకూడ ఆ వేగన్ మీంచి దిగారు.

సారా బుష్ లింకన్ తప్పక అసాధారణ స్త్రీ అయిఉండాలి లేకపోతే ఆమె వెంటనే వెనుదిరిగి ఇంటికి వెళ్ళిపోయిఉండేది. ఆమె చక్కని సదుపాయకరమైన పరిశుభ్రమైన స్వగృహం వదలి ఇక్కడికి వచ్చింది. ఇక్కడచూస్తే కిటికీలూ తలుపులూ లేని, అపరిశుభ్రమైన కొంప, దుంగలు కోసి తయారుచేసిన కర్రసామాను, గడ్డి చాపలు, మంచె మంచాలు ఎదురయాయి. ఏబ్, సారా, డెన్నిస్ మడ్డికారు కుంటూ ఉన్నారు.

డెన్నిస్ అన్నాడు, "ఆమె వచ్చేటప్పటికి మే మంతా చాలా అసహ్యంగానూ, అపరిశుభ్రంగానూ ఉన్నాం. ఆమె మొట్టమొదట రాగానే చేసిన పని టాం వడ్రంగి పని చేసుకునే ఒకబల్లని గుమ్మం అవతల గోలెం దగ్గర వెయ్యమని నాకు ఆజ్ఞాపించడం. తరవాత ఏబ్‌నీ, తనకొడుకు జాన్‌జాన్‌స్టన్‌నీ, నన్నూ సెలయేటికిపంపి నీళ్లుతెచ్చి ఆ గోలెం నింపమంది. ఆమె ఆ గోలెం దగ్గిర ఒక దొప్పలో సబ్బు, నీళ్ళు పోసుకునేందుకు ఇంకొక దొప్ప పెట్టి మాతో త్వరగా స్నానం చేసి భోజనానికి రమ్మంది. సైరే పిన్ని ఎక్కడుంటే అక్కడే పది మంది ఉన్నంత సందడిగా ఉండేది!"

త్వరలోనే ఏబ్, అతని అక్కయ్యా అందమైన, ప్రేమమయి అయిన తమ సవతి తల్లితో ఎంతో ఇష్టంగా ఉండసాగారు. లింకన్ తన జీవితకాలమంతా ఆమెని తన "మాతృదేవి" గా అతి ప్రేమ పూర్వకంగా సంస్మరించేవాడు. తన మంచితనంతోకూడిన నేర్పరి తనంతో ఆమె తన కొత్త సంతానాన్ని సంభాళించుకొంది. ఆమె కాబిన్‌ని కడిగి పరిశుభ్ర పరిచింది. టాంతోచెప్పి బల్ల చెక్కల నేలని బాగుచేయించింది. ద్వారబంధానికి కట్టిన చెదలు తినేసిన ఎలుగు బంటి చర్మం సారాకి ఎంతమాత్రం నచ్చలేదు. గాలి దూరకుండా చేసే బల్ల చెక్కలతో తలుపులూ, చర్మపు కీళ్లూ చేయించమని ఆమె పట్టు పట్టింది. టాం ఇంకా కొన్ని మంచె మంచాలు తయారు చేశాడు. సారా పాత పరుపు సంచీలని కొత్త గడ్డితో నింపి వాటి మైన ఈకల పరుపులు పరచి మంచి పక్కలు పరిచింది. పై అంతస్థు లోని పిల్లల పక్కలుకూడా ఇదే విధంగా ఏర్పరచింది. సున్నంకొని గోడలకి, పై కప్పుకి వెల్లవేయించింది. కలలో కూడా అనుకోని విధంగా నలభై యైదు డాలర్ల ఖరీదుచేసే అద్భుతమైన బీరువా కంట కీలో కొనితెచ్చి కాబిన్‌లో ఒక వైపున పెట్టించింది. ఏబ్ ఇవన్నీ చూసి చాలా సంతోషంగా ఉండేవాడు.

ఈ కొత్త అమ్మ ఏబ్ కి అన్ని విషయాల్లోనూ మంచి ప్రోత్సాహ మిచ్చేది. దయకీ, సాహసానికీ, సౌందర్యానికీ ఆమె ఆకరంగా కని పించేది. సారా మనమరా లొకామె ఆమెని వర్ణిస్తూఅంది "ఆమెఎప్ర ఇండియన్ యువతిలాగ నిటార్గా ఉండేది. బాగా ఎర్రగా ఉండేది అందమైనది. ఎప్పుడూ మాట్లాడుతూ ఉండేది. అభిమానం గల ఆడది. తల నెరిసే వరకూ ఉంగరాల జుట్టు ఉండేది." ఎప్పుడో తీసిన ఆమె ఫోటో చాలా ఆకర్షణీయంగా ఉంది, ఆమె వృద్ధముఖంలో కూడా అందం ప్రతిబింబిస్తూ ఉంది. ఆమె ఇల్లు అతి పరిశుభ్రంగా ఉంచేది. తన సమష్టి కుటుంబాన్ని ప్రేమతోను, సహనశక్తితోను, కలసికట్టు తనంతోనూ పెంచేది. ఆమె, ఏబ్ తరచు హాస్య ప్రసంగాలతో నవ్వుకుంటూ ఉండేవారు!

1819 డిసెంబరు 25న తేదీన వచ్చిన ఆయేటి క్రిస్మస్ మంచి మజాగాను అద్భుతంగాను ఉండి ఉండాలి. ఆ రోజున సారా స్వయంగా అడవికోడి మాంసం, లేడి మాంసం ఆకలితో ఉన్న పిల్ల లకి వండి పెట్టింది. పెద్ద భోజనపుబల్ల దగ్గర కూర్చున్న టాం లింకన్ అందరూ తలలు వాల్చుకొని కూచుని ఉండగా, తన మామూలు సంక్షిప్త ప్రార్థనలో ధన్యవాదాలూ తెలుపుతూ మరి కొన్ని వాక్యాల్నికూడా చేర్చి ఉంటాడు. అతి పరిశుభ్రమైన ఇంట్లో ఆ బల్ల క్రిస్టమస్ విందు పదార్థాలతో నిండి ఉంది. వాళ్ళిప్పుడు తల్లిలేని పిల్లలు కారు. తల్లిప్రేమ వెలుగులో కలకల లాడే ముఖాలతో ఆమె చుట్టూ మూగారు.

# సరిహద్దు పల్లెచదువు

"పేరుకి కొన్ని స్కూళ్ళు లేక పోలేదు; కాని ఉపాధ్యాయుడుగా పని చెయ్యడానికి వేరే యోగ్యతల అవసరం ఉండేదికాదు; చదవడం వ్రాయడం, కూడిక హెచ్చవేత, భాగారం వస్తే చాలు చదువు మీద ఆసక్తి కలిగించేదేమీ అక్కడ ఉండేదికాదు.

అబ్రహాం లింకన్.

దక్షిణ ఇండియానాలో కాళ్ళకి చెప్పులు లేకుండా గడిపిన ఏబ్ లింకన్ బాల్యంతో పరిచయంగల ప్రతివారికీ అతని విషయంలో రెండు సంగతులు గుర్తుంటాయి: అతను ధరించే బక్ చర్మపు పంట్లం అతని పొడుగుపాటి కాళ్ళకి ఎప్పుడూ చాలక, అధమపక్షం ఆరు అంగుళాలవరకూ అతని మోకాళ్ల దిగువ భాగాన్ని కనిపింప జేసేది రెండోది: అతను ఎప్పుడుచూసినా చేతిలో ఏదో ఒక పుస్తకం పట్టుకుని కనిపించటం!

అంటే ఏబ్ భౌతికంగానూ, మానసికంగానూ అభివృద్ధి పొందు తున్నాడన్నమాట. అతను పదేళ్ళు దాటేటప్పటికి ఆ చుట్టు పక్కల ఉండే పెద్దవాళ్ళందరికంటే గొడ్డలి పని బాగా చెయ్యగల ఆజాను బాహుడైన యువకుడుగా తయారయాడు. మానసికంగా గొప్ప మేధావిగాకాకపోయినా, చాలా మైళ్ళ దూరంవరకూగల పిల్లలంద రిలో మంచి మాటకారిగా, మంచి తెలివైనవాడుగా ప్రసిద్ధికెక్కాడు. అతను ఎత్తైన స్థలంమీదనుంచుని మత గురువులనీ, రాజకీయ వేత్త

లనీ అనుకరిస్తూ చేతులు త్రిప్పుకుంటూ ఉపన్యాసాలిస్తూండగా చూసి చిన్నవాళ్ళూ పెద్దవాళ్ళూ కూడా ముచ్చటపడేవాళ్ళు అటువంటి సందర్భాల్లో అతను తనశ్రోతల్ని కడుపులుబ్బేట్లా నవ్వించేవాడు. ఇంతేకాదు, అతను చర్చిలో విన్న ఉపన్యాస భాగాల్ని, పుస్తకాల్లో చదివిన పేజీలకి పేజీల్ని శ్రోతలకు వినిపించగల జ్ఞాపకశక్తి, నేర్పూ కూడా అతనిలో ఉండేవి.

అతను కొంచెం బిడియం కలవాడు; మంచి చొరవ కలవాడు కూడాను. వేళాకోళాలాడడంలోను, తమాషాలు చెయ్యడంలోను బహునేర్పరి. గంభీరమైన ఆలోచనా శక్తి కలవాడు. ఒకొక్కప్పుడు విచారంగా కూడా ఉండేవాడు. స్వభావసిద్ధంగా సాధువు అయితే, రెచ్చకొడితే కయ్యానికీ కాలు దువ్వేరకమే!

తన జీవితం పొడుగునా, అధ్యక్షపదవి నధిరోహించిన తరువాతకూడా లింకన్ తనకి సక్రమ విద్యాశిక్షణలేని లోటునిగూర్చి చాలా విచారించేవాడు. స్వయం కృషివల్ల నేర్చుకున్న విద్య విషయంలో ఎప్పుడూ గర్వపడలేదు. అవిద్య అజ్ఞానాల వాతావరణం నుండి ఏకాకిగాను, నిస్సహాయుడుగాను ఉంటూనే, అబ్రహాం లింకన్ కేవలం స్వప్రయోజకత్వంవల్ల సమస్త విద్యాసౌకర్యాలూ కల అనేక వేలమందికంటె ఎక్కువ జ్ఞానాన్ని సంపాదించాడు.

లింకన్ స్వయంగా చెప్పినట్లు అతను బడికి ఎప్పుడో గాని వెళ్ళేవాడుగాడు. ఐదుగురు గురువులవద్ద ఆతను విద్యాభ్యాసం చేశాడు. కంటకీలో ఇద్దరి దగ్గిర, ఇండియానాలో ముగ్గురిదగ్గిర. కాని అతని విద్యాభ్యాస కాలమంతా కలిసి ఒక సంవత్సరం కూడాఉండదు.

ఇండియానాలో క్రాఫర్డ్, డోర్సీ, స్వీనీ అనే ముగ్గురూ అతని గురువులు. వాళ్ళదగ్గర అతను చదివిన పుస్తకాలు వెబ్‌స్టర్ రచించిన బ్లూబాక్ స్పెల్లర్, పైక్ రచించిన అరిథ్‌మెటిక్, బైబిలూ.



చేతిలో పుస్తకం మాత్రం విచిచిపెట్టడు !

సరిహద్దులలోని ఈ "చండాల స్కూళ్ళ"న్నీ ఒకేమాదిరిగా ఉండే . ప్రతివిద్యార్థి సాధారణంగా తమతమ పొలాల్లో పండిన కూర లో, ధాన్యమో బడిజీతంగా చెల్లించేవాడు. ఒకొక్కప్పుడు కూన్ చర్మంకూడా ఇచ్చేవాళ్ళు. బడిఅంతాకలిసి ఒకకర్ర యింటిలో ఇమిడేది. కిటికీ కన్నాలకి కట్టిన కొవ్వురాసిన కాగితాలనుండి కొంచెం వెలుతురు లోపలికి వచ్చేది. దూలాలుకోసి తయారుచేసిన బెంచీలు ఎంత మాత్రం సదుపాయకరంగా ఉండేవికావు. ఉపాధ్యాయుణ్ణీ, ముందు వరసలో ఉన్న విద్యార్థుల్నీ చలిమంటలో మండే దుంగలు మాడ్చేస్తున్నా వెనుక బెంచీలమీది విద్యార్థులు భరించరాని చలికి గజగజ వణకేవారు. చలికి బిగుసుకుపోయిన వేళ్ళతో ఈక కలాలు పట్టుకోడం అసాధ్యమైపోయేది.

ఒకప్పుడు లింకన్ నాలుగున్నర మైళ్ళ దూరంలో ఉన్న స్కూలుకి రోజూ వెళ్ళివచ్చేవాడు. శీతోష్ణస్థితి సరిగా ఉన్న రోజుల్లో చాలా సరదాగానే నడిచి ఉంటాడు. అడవి దారి పొడుగునా ఓక్ వృక్షాలమీదికీ, హికరీ చెట్లమీదికీ ఎగబ్రాకే ఉడతలనీ, తెల్లతోకలతో చెట్లగుంపా పరుగెత్తుకుపోయే తేళ్ళనీ చూస్తూ, ఎంతో ఆనందం అనుభవించేవాడు కాని చలికాలంలో అతను తరుచు వర్షంలోనో కరగిన మంచులోనో తడిసి ముద్దయి ఇంటికి జేరుకునేవాడు. డెన్నిస్ హాంక్స్ ఆ రోజుల్నిగూర్చి వ్రాస్తూ అన్నాడు! "...... లేడిచర్మపు జోళ్ళు మంచులోనూ వర్షంలోనూ ఏం పని చేసేవికావు." తుపాను గాలిలో ఆ తొమ్మిది మైళ్ళ ప్రయాణంచేసేటప్పుడు తడిపాదాలు ఎంతటి ప్రాణ సంకటంగా ఉండేవో మనం ఊహించవలసిందే!

అయినప్పటికీ, ఏబ్‌కి స్కూలంటే ఎంతో సరదాగా ఉండేది. ప్రతి అమూల్య దినాన్నీ అత వెంతో జాగ్రత్తగా ఉపయోగించు

కొనేవాడు. అతని తోడివిద్యార్థి నాథేనియల్ గ్రిగ్స్బీ, ఏబ్ స్కూలుకి అందరికంటె ఎప్పుడూ ముందు వచ్చేవాడనీ, తన క్లాసులో ఎప్పుడూ ప్రథముడుగా ఉండేవాడనీ, అతి త్వరలో ఇతర విద్యార్థులనందరినీ దాటిపోయేవాడనీ చెప్పాడు. అతను స్కూలంతటిలో వర్ణక్రమం చెప్పటంలో చాలా గట్టివాడు. ఒకసారి ఒక విద్యార్థిని డిఫైడ్ అనే మాటకి వర్ణక్రమం తెలియక తిక మక పడుతూంటే అతను ఆమెకి తమాషాగా సహాయ పడ్డాడు. "ఎఫ్" అనే అక్షరం చెప్పిన తరవాత ఆమె సందేహిస్తూండగా అతను ఎవరికీ తెలియకుండా తనకంటివైపు చూపించి సంజ్ఞచేసి తరువాత "ఐ" అనే అక్షరం అని ఆమెకి గుర్తుచేశాడు

కంటకి లాగే ఇండియానా కూడా "బ్లాబ్ స్కూల్" సంప్రదాయాన్ని అనుసరించి శిక్షణ నిచ్చేది. రక రకాల వయస్సుగల బాల బాలికలు తమ తమ పాఠాలన్నీ గట్టిగా పైకి చదువుతూంటే స్కూలు దూరంలో ఉండేవాళ్ళకి ఒక పెద్ద తేనెపట్టులా అనిపించేది. అది ఒక రాజకీయ సభలో గందరగోళంలాగా ఉండేది. ఉపాధ్యాయులు ఒక పెద్ద హికరీ బెత్తంతో విద్యార్థులికి పాఠాలు ఎక్కించేవారు. చదువురాని మొద్దుల్ని ఒక మూలగా హాస్యగాడి టోపీలు ధరింపజేసి నుంచోపెట్టేవారు. అప్పు డప్పుడు ఉపాధ్యాయుడు తన అధికారం స్థాపించుకోడం కోసం పెద్ద పెద్ద గెడేకారీలతో కుస్తీకూడా పట్టవలసి వచ్చేది. అటువంటి విపరీత వాతావరణంలో ఎవరికైనా ఎలా చదువు అబ్బిందా అన్నది చాలా ఆశ్చర్యకరమైన విషయం.

శ్రీ క్రాఫర్డ్ విద్యార్థులకి మంచి నడత నేర్పడానికి ఒక విద్యార్థిని బయటినుండి ఎవరో కొత్తవ్యక్తి వచ్చినట్లుగా రమ్మనమనేవాడు. అతను ఆ విధ్యార్థిని వరుసగా ఇతర విద్యార్థులందరికీ



'క్లాబ్ స్కూల్' పద్ధతిలో చదువుడు

పరిచయంచేసేవాడు. శ్రీ డోర్సీ స్కూల్‌లో ఏబ్ చక్కగా వ్రాయడం, బాగా చదవడం నేర్చుకున్నాడు. లింకన్ స్వంత దస్తూరీలో మనకి మొట్ట మొదట లభించేది ఈ కింది పద్యం:

అబ్రహాం లింకన్ అతని చెయ్యీ కలం పాళం!
గొప్పవాడు కాక తప్పదు; ఎప్పుడో అది తెలియదు.

డోర్సీ స్కూల్లోనూ స్వీనీ స్కూల్లోనూ, అతను జీవహింసని ఖండిస్తూ వ్యాసాలు వ్రాశాడు- ఇది మొరటుగా ఉండే సరిహద్దువాసులకి చాలా ఆశ్చర్యకరంగా ఉండేది. అందుచేతే అతను నోరు వాయీలేని మూగజీవాల పక్షానచేసిన వాదాలు అతని తోడివిద్యార్థుల్లో చాలామంది ఎన్నటికీ మరచిపోలేదు, జీవితాంతం వరకూ కవిత్వం మీద ఆసక్తి కలవాడయిన లింకన్ తను చివర చదువుకున్న రెండు స్కూళ్లలోనూ పద్య రచనలో నేర్పు సంపాదించేందుకు ప్రయత్నించాడు. ఆ తరవాతకూడా చాలా కాలం ఈ సాధన సాగించాడు. అయితే తత్ఫలితంగా అతను షేక్స్పియర్‌తోకాని, ఆఖరికి లాంగ్‌ఫెలోతోగాని కవితారచనలో పోటీ పడ గలిగాడని మనం అనుకో నక్కరలేదు.

అతని పాత కాపీ పుస్తకంలో ఈకరుణాపూరితమైన పంక్తులు మనకి దొరికాయి;

కాలం శూన్యమైన గాలి లాంటిది
రోజులు ఊరికే దొర్లి పోతున్నాయి
ఎర్ర ఇండియన్ బాణాల్లా,
తోక చుక్కల్లా దూసుకు పోతున్నాయి
ఈ క్షణం ఇప్పుడిక్కడే ఉన్నది
అప్పుడే ఎక్కడికో జారిపోయింది
అవి మనవని అనుకోలేం
అప్పటికే అవి గతక్షణాలు!

లింకన్ పూర్వ పరిచితులు చాలామంది అతను చాలా సోమరిగా ఉండేవాడనీ, పనికంటె డబ్బూ, తిండీ అతనికి ముఖ్యంగా ఉండేవనీ చెప్పారు. లింకన్‌ని ఎప్పుడూ గొప్పగా మెచ్చుకుంటూ ఉండే డెన్నిస్ హాంక్స్ కూడా "...ఏబ్ చాలా సోమరిపోతు..." అంటూనే, "ఎప్పుడూ ఏదో వ్రాస్తూనో, గీస్తూనో ఉండేవాడు; కవిత్వం వ్రాస్తూ ఉండేవాడు," అని ఒప్పుకున్నాడు. ఏబ్ తన పొరుగు వ్యవసాయదారునితో తన తండ్రి తనకి పని చెయ్యడం మాత్రమే నేర్పాడనీ, కాని పనిపైన ఇష్టం కలిగించలేదనీ అన్నాడు.

నిజానికి యువలింకన్ పొడుగైన హికరీ మొక్కలా శారీరకంగానూ, మానసికంగానూ కూడా ఎదిగాడు. ఆ పెరుగుదలకి కావలసిన శక్తిని అతను సమకూర్చుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది! నిజానికి అతను పని చేస్తున్నాడనే చెప్పాలి. ఎనిమిదవ యేటి నుంచీ అతను నిర్విరామంగా చేస్తూన్న శారీరక పరిశ్రమకితోడు ఇప్పుడు తనను విద్యావంతునిగా చేసుకోడానికికూడా తంటాలు పడుతున్నాడు. ఆనాటి కఠ్ర కొంపలలో ఉండే విద్యావిహీనుల దృష్టిలో చదవడం, వ్రాయడం పని చేయడం కింద లెక్కకి రావు. దక్షిణ ఇండియానాలోని యువకు లందరిలోకీ మానసికంగా అత్యంతోత్సాహవంతుడైన ఏబ్ లింకన్ తాము ఊహించలేని ఒక ఉజ్వల భవిష్యత్తు కోసం తనను తాను తయారు చేసుకుంటున్నాడనే విషయం వాళ్ళు ఊహించలేకపోయారు. స్వయంగా లింకన్‌కే ఈ విషయం తెలియదు.

టాం లింకన్ విచిత్ర స్వభావం కల తన కుమారుణ్ణి చూసుకుని మురిసినట్టూ, మూతి ముడుచుకున్నట్టూ కూడా కనిపిస్తాడు. చెట్లు పడగొట్టి దుంగలు కోసి, కంచెలు కట్టవలసిన తండ్రికి ఏబ్ ఒక సమస్యగా పరిణమించాడంటే ఆశ్చర్యం లేదు. ఏబ్ చెట్టు కొమ్మమీది

కెక్కి హాస్యం వ్యంగ్యం నటిస్తూ కనిపించే సరికి పెద్దవాళ్లూ, పిల్లలూ కూడా తమ తమ పనులు మానేసి వినోదంగా చూస్తూ నుంచునే వాళ్ళు. లింకన్ పొడుగైన చేతులు గాలిలో ఇటూ అటూ ఊగి పోయేవి. కిరాణాకొట్టు దగ్గిరా, కమ్మరి కార్ఖానా దగ్గిరా, పిండి మిల్లు దగ్గిరా లింకన్ చుట్టూ పదిమంది మూగేవారు. అన్నిటి కంటె ఎక్కువగా అతను పుస్తకాలు చదువుతూ కనిపించేవాడు. బల్ల దగ్గర కూచునీ చదివేవాడు. దున్నుతూన్నప్పుడూ చదివేవాడు. నెగడు దగ్గిరా చదివేవాడు. సంతకమైనా సరిగ్గా పెట్టలేని టాం లింకన్‌కి ఇంత ఎక్కువగా చదవడంవల్ల ఏం లాభం కలుగుతుందో అర్థమయేది కాదు.

కొంతమంది లింకన్ తండ్రి పిల్లవాణ్ణి దయగా చూసేవాడనీ, అతని చదువు సంధ్యల విషయంలో ఎప్పుడూ అడ్డు వచ్చేవాడు కాడనీ అంటారు. టాం లింకన్‌నీ, ఏబ్‌నీ సమానంగా అభిమానంతో చూసే డెన్నిస్ హాంక్స్ మాత్రం, కొత్తవాళ్ళు వచ్చినప్పుడు పెంకె తనంగా ప్రవర్తించినందుకు టాం లింకన్ అప్పుడప్పుడు ఏబ్‌ని కొట్టేవాడని ఒప్పుకున్నాడు.

కాని తండ్రి కఠినంగా ప్రవర్తించినా, సవతి తల్లి సారాబుష్ లింకన్ చదువు విషయంలో అతన్ని బాగా ప్రోత్సాహ పరిచేది. అతని హాస్యాన్ని కూడా బాగా ఆనందించేది.

ఒకసారి లింకన్ బురద కాళ్ళతో ఉన్న ఒక చిన్న కుర్రవాణ్ణి తల క్రిందులుగా పట్టుకుని వెల్లవేసిన క్యాబిన్ పైకప్పు మీద నడిపించాడు! పాదాల గుర్తులు చూసి కోపపడడానికి బదులు సారా కడుపు చెక్కలయేట్టు నవ్వింది. అల్లరి చేసినా మూర్ఖత్వం ఎరగని ఏబ్ వెంటనే ఒక బకెట్‌లో సున్నం కలిపి ఆ గుర్తుల మీద వెల్ల



తల క్రిందులుగా ఇంటి కప్పుమీద నడిపించాడు.....

వేసేశాడు. నిజానికి, సారా అన్నట్లు వాళ్ళిద్దరి మనస్సులూ కలిసి పనిచేసేవి. అతను అర్ధరాత్రి వరకూ చదువుతూ కూచున్నాడని కాని, భోజనం వేళ పుస్తకంతో తయారయాడని కాని ఆమె అతన్ని ఎప్పుడూ కేకలు వెయ్యలేదు. అచ్చు అక్షరాల గారడీ దారుల వెంట సుదూర జ్ఞాన సీమలకి పయనించే యువ లింకన్‌ని ఎవరు అడ్డుకో గలరు?

డెన్నిస్ హాంక్స్‌కి బాగా జ్ఞాపకం. "పన్నెండు సంవత్సరాలు దాటాక ఏదో ఒక పుస్తకం చేతిలో లేకుండా ఏబ్‌ని నే నెప్పుడూ చూసిన గుర్తులేదు. అతను తన చొక్కాలో పుస్తకం దాచుకుని పంట్లాం జేబులనిండా ధాన్యపు కంకులు కుక్కుకొని పొలం దున్నేందుకో, చెట్లు పడగొట్టడానికో వెళ్ళేవాడు. మధ్యాహ్నం వేళ ఒక చెట్టు క్రింద జేరి చదువుకుంటూ ఫలహారం చేసేవాడు. రాత్రి యింటికి వచ్చాక వీపు గోడ కానుకుని, కాళ్ళు మెట్టుమీద పెట్టుకుని పడుకుని చదువుకునేవాడు.

ఈ రెండు అలవాట్లూ లింకన్‌ జీవిత పర్యంతం అలాగే ఉండేవి. చదవడం, చదువుకునే టప్పుడు వీపు ఆన్చి పడుకోవడం. అతను చదివిన మొదటి పుస్తకాలు ఈసప్ నీతి కథలు, రాబిన్‌సన్ కూసో, పిలిగ్రిమ్స్ ప్రోగ్రెస్, పార్సన్ వీమ్సు రచించిన వాషింగ్ టన్. వీటిలో అనేక పేజీలు కంఠస్థ మయేవరకూ అతను వీటిని చదివాడన్నది బహుశః నిజమే అయి ఉండవచ్చు. ఒకసారి అతను ఎవరి దగ్గిరనుంచో ఎరువు తెచ్చిన వాషింగ్‌టన్ ప్రతి ఒకటి ఇంటి వెనక గోడల సందులోంచి వర్షపు జల్లు రావడంవల్ల తడిసి పాడైపోయింది. ఆ పుస్తకం వెలకి బదులుగా లింకన్ వరుసగా రెండు మూడు రోజులు గడ్డి మోపులు మోశాడన్నది విచిత్రంగా కనిపించి నప్పటికీ, అది నిజమని చెప్పడానికి అనేక ఆధారాలున్నాయి.

వీమ్సు రచించిన వాషింగ్‌టన్ జీవిత చరిత్రని చాలా మంది విమర్శించారు. బాల వాషింగ్‌టన్ తన చిన్న కత్తితో చెర్రీ చెట్టుని నరికి అబద్ధ మాడడం ఇష్టంలేక తన తండ్రి దగ్గిర అపరాధాన్ని ఒప్పుకున్న ఘట్టాన్ని ఈ విమర్శకులు తీవ్రంగా ఖండించారు. కాని ఏబ్ శీలాన్ని పరిపుష్టం చెయ్యడానికి ఆ పుస్తకం ఎంతగా ఉపయోగించిందో వీళ్ళు ఎరగరు.

అనేక విషయాల్లో లింకన్ తన జీవితాన్ని వాషింగ్‌టన్ జీవితాన్ని చూసి వికసింప జేసుకున్నాడు. వీమ్సు పేర్కొన్న పై కథ అబద్ధమని మనం కొట్టి పారేసినా, మన ఇద్దరు సుప్రసిద్ధ అధ్యక్షుల మధ్య అనేక పోలికలు ఉన్నాయి.

ఇద్దరూ ఇంగ్లీషువాళ్లే! ఇద్దరూ పొడుగుపాటి వాళ్లే (వాషింగ్‌టన్ ఆరడుగుల ఒక అంగుళం, లింకన్ అతనికంటె మూడంగుళాలు పొడుగు); యౌవనంలో ఇద్దరూ వస్తాదులే; ఇద్దరూ సర్వేయింగ్ నేర్చుకున్నవారే; అలాగే ఇద్దరూ అమెరికా సంయుక్త రాష్ట్రాలకి అధ్యక్షులుగా ఎన్నికైనవారే! ఇద్దరూ అసాధారణ గుణవంతులుగా ఉండడం కూడా ఇక్కడ గమనించతగ్గది. నేడు వికసిస్తూన్న అనేకమంది బాలకుల మనస్సులు వాషింగ్‌టన్ లింకన్ల జీవిత చరిత్రలచే ప్రభావిత మవుతున్నాయి. ఆ బాలకుల్లో కొందరు ముందు ముందు అధ్యక్షులు కావచ్చును కూడా.

లింకన్ కాలంలో చట్టరీత్యా బాలకు లంతా ఇరవై యొక్క సంవత్సరం వచ్చినదాకా తమ తండ్రుల అధీనంలో పని చెయ్యాలి. ఆన్ని సంవత్సరాలూ టాం లింకన్ తన కొడుకుపై తన అధికారాన్ని ఏ మాత్రం సడలించలేదు. ఏబ్ సంపాదించిన దంతా తండ్రి పర్సమయేది. అప్పుడప్పుడు పందుల్ని చంపేందుకు రోజుకి ముప్పై

సెంట్ల కూలిపై ఏబ్‌ని అతని తండ్రి ఇరుగు పొరుగు వారికి అప్పగించే వాడు. పందిని చంపడమనేది చాలా దారుణమైన పని. ఏబ్ లింకన్ ఈ పనిని బాగా నిర్వహించేవాడనే అంటారు· కాని అడవి జంతువుల్ని హింసించడం ఇష్టంలేక వేటమాని, మూగ జీవాలని హింసించడం మహా పాపమని వ్యాసాలు వ్రాసిన ఒక బాలుడికి పందుల్ని చంపడం ఇష్టమైన పని అని మన మనుకోడానికి వీల్లేదు.

అయితే జంతువుల్నీ, పశుల్నీ పెంచడంలోను, తేనెటీగల్ని మేపడంలోను, దుంగల్ని దొర్లించడంలోను, బెల్లం బట్టీల పనిలోను ఇంకా ఇరుగు పొరుగు వారితో కలిసి చేసే పనులన్నిటిలోనూ కలిగే ఆనందమే, పందులని చంపడంలో కూడా ఏబ్ తప్పక పొంది ఉంటాడు. ఇటువంటి సందర్భాల్లో కథలు చెప్పడానికీ, వేళాకోళాలాడడానికీ, ఉపన్యాసా లివ్వడానికీ, పరుగెత్తడానికీ, కుస్తీ పట్టడానికి అతనికి వీలు చిక్కేది. సరిహద్దు వాసుల హాస్యాలు బండతనంగా ఉండేవి. వేళాకోళాలు, ఛలోక్తులు కఠోరంగా ఉండేవి. ఇంక తాగ్రుడు చెప్పనే అక్కర్లేదు. కాని త్రాగుడు అలవాటులేని, అశ్లీల శబ్దాలని ఉపయోగించని యువ లింకన్‌ని వాళ్ళు బలేవాడు అనుకొనేవారు. అతని జ్ఞాన భండారం వృద్ధి చెందుతూంది. అతను అప్పటివారి కనుగుణమైన పద్ధతిలో చక్కని కథలు చెప్పి వాళ్ళని తెగ నవ్వించే వాడు. ఈ గోష్ఠుల్లో ఏబ్‌కి ఆనందంగా కాలం గడిచేది.

కాని అచిరకాలంలోనే, అతని మనస్సు ఇరుగు పొరుగు వాళ్ళలో చాలామందిని దాటి పుస్తకాలకోసం, వార్తా పత్రికలు చదివే అవకాశంకోసం అతన్ని ఇంటినుండి చాలా దూరం తీసుకు పోయేది. అతని రాజకీయాభిరుచులు మొదట్లో డెమొక్రాట్ల పక్షానికి అనుకూలంగా ఉంటూ, ఆఖరికి విగ్గుల వేపుకి మొగాయి. 1850 మధ్యలో, కొత్త రిపబ్లికన్ పార్టీలో చేరేవరకూ ఏబ్ పాతికేళ్ళకి

పైగా విగ్గుగానే ఉన్నాడు. ఈ కొత్త రిపబ్లికన్ పార్టీ ద్వారానే అతను ఆఖరికి శ్వేతభవనం జేరుకోగలిగాడు.

ఈ మధ్యకాలంలోనే అతను సంపాదించిన రెండు పుస్తకాలు అప్పుడే వికసిస్తూన్న లింకన్ మనస్సులో సుస్థిరసంచలనాన్ని కలుగజేశాయి. అవి "రివైజ్డ్ లాస్ ఆఫ్ ఇండియానా", "ది కొలంబియన్ క్లాస్ బుక్" అనేవి. ఆ రెండిటినీ అతను అతి శ్రద్ధగా మళ్ళీ మళ్ళీ చదివాడు.

మొదటి పుస్తకం అతని భవిష్య జీవితంలో వృత్తిగా ఏర్పడ్డ న్యాయశాస్త్రంమీద ఆసక్తిని కలగజేయడమేగాక స్వాతంత్ర్యప్రకటన పత్రింమీద దాని రచయితయైన తామస్ జెఫర్సన్ యెడల లింకన్‌కి గౌరవభావాన్ని కలగజేసింది. అంతేకాదు; రాజ్యాంగ విధానంలో చేసిన మొదటి పది సవరణలవంటి అనేక ముఖ్య పత్రాల పట్ల అతని ఆసక్తిని ఎక్కువచేసింది. ఈ గ్రంథంద్వారా పాత వాయవ్య ప్రాంతపు రాష్ట్రాలన్నిటిలోను (ఇండియానాతోసహా) బానిసత్వం శాశ్వతంగా న్యాయ విరుద్ధమైన దన్న విషయం అతను తెలుసుకున్నాడు. ఈ విధంగా, "మానవులంతా సమానంగా సృష్టించబడ్డారు; సృష్టికర్త ద్వారా వారికి కొన్ని జన్మహక్కులు సంక్రమించాయి; వాటిలో ప్రధానమైనవి జీవనం, స్వాతంత్ర్యం, సౌఖ్యాన్వేషణ." అనే గొప్ప సిద్ధాంతాన్నిగూర్చి ఆలోచించే అవకాశం లింకన్‌కి కలిగింది.

రెండవ పుస్తకం, "ది కొలంబియన్ క్లాస్ బుక్" అతని లోకాన్ని సంయుక్తరాష్ట్రాలనేగాక పాశ్చాత్య ప్రపంచాన్నిగూడా అధిగమించేటట్లు విస్తృత పరచింది. అప్పుడే అతను సమస్త ప్రపంచానికి సంబంధించిన భూగోళజ్ఞానాన్నీ చారిత్రకజ్ఞానాన్నీ సంపాదిం

చాడు. మనం నివసించే భూమిని/సూర్చి యేగాక ఈపుస్తకం ఏబ్ కిఅనేక అద్భుత విషయాల్ని బోధించింది. మనకి ఎంతో దూరంలో మండుతూన్న పెద్ద సూర్యుని చుట్టూ తిరుగుతూన్న అనేక గ్రిహాలలో మన భూమి ఒకటనీ, ఈ సూర్యుడుకూడా మనం నక్షత్రాలని పిలిచే అనేక కోట్ల సూర్యులలో ఒకటనీ అతను తెలుసుకున్నాడు. బాలకుడైన లింకన్ స్వచ్ఛమైన రాత్రిళ్ళు తన తలపైనున్న నల్లని ఆకాశంలో ఈ తళ తళలాడే దీపాల్ని ఎన్నోసార్లుచూసి ఆశ్చర్య పోయేవాడు. ఇప్పుడీ పుస్తకం చదవడం వల్ల అతనికి పీటివిషయం తేటతెల్లమైంది.

ఒకానొక సాయంకాలం సూర్యుడు పడమటికొండ చాటుకి దిగిపోతూండగా తూర్పు దిక్కున పూర్ణ చంద్రిడు ఉదయించే వేళ ఏబ్, కేటీరోబీ అనే ఒక పొరుగింటి అమ్మాయీ ఒకరి పక్క ఒకరు తమ కాళ్ళు కింద నీళ్లలో ఆడిస్తూ కూచున్నారు. సూర్యుడు నిజంగా క్రిందికి వెళ్లడంలేదనీ, అలాగే చంద్రుడు పైకి రావడంలేదనీ అతను కేటీకి బోధించాడు! అసలు జరిగేదేమంటే, బొంగరం తనముల్లుమీద తిరిగినట్టు భూమి తిరుగుతూంటే ఈగ్రహాలు ఉదయిస్తూన్నట్లు అస్తమిస్తూన్నట్టు కనిపిస్తోందంతే! కేటీ, ఏబ్‌లు ఒకరినొకరి ప్రేమించుకోలేదు. వాళ్ళు ఊరికే స్నేహితులు మాత్రిమే. కాని కేటీ తన జీవితాంతంవరకు ఆ అద్భుతమైన, సరళమైన జ్యోతిషపాఠాన్ని మరచి పోలేదు. ఆ నిస్తబ్ధమైన సాయంసమయాన దక్షిణ ఇండియానా చెట్ల చాటునించి పెద్ద బంగారపు గుమ్మిడిపండులా చంద్రుడు ఉదయిస్తూండగా చూస్తూ చెరువుగట్టుమీద తాము కూర్చుని ఉన్నప్పుడు సాదాగా పొడుగ్గా ఉన్న ఏబ్ లింకన్ ఆమెకి ఎంతో మేధావిగా కనిపించాడు.

# మిస్సిసిపీలో పడవలో

*"నేను కూలిపనిచేసేవాడిననీ, రైలు పట్టాలు కోసేవాడిననీ, పడవమీద పనిచేసే వాడిననీ చెప్పుకోడానికి సిగ్గు పడడంలేదు. ఏ బీదవాని కొడుకైనా ఇవన్నీ చెయ్యవలసిందే!"*

అబ్రహాం లింకన్

పడవలన్నా, నదులమీద పడవలు నడపడమన్నా లింకన్‌కి జీవితాంతంవరకూ సరదాగా ఉండేది. ఏబ్ పుట్టుకకు కొన్ని సంవత్సరాలముందు అతని తండ్రి టాం లింకన్ ఒక పడవని నిర్మించి ఓహాయో, మిస్సిసిపీ నదుల మీదుగా న్యూ ఆర్లియన్స్‌కి సామాను వేసుకు వెళ్ళాడు. ధాన్యం, గోధుమలు, పంది మాంసపు పెట్టెలు, పందులు మొదలైన బరువైన సామాను తీసుకు వెళ్ళేందుకు ఆ రోజుల్లో సరిహద్దులోని పెద్ద పెద్ద నదులే రహదారులుగా ఉండేవి. మిస్సిసిపీ మహాలోయలో ఉత్పత్తి అయిన పంటలకి న్యూ ఆర్లియన్స్ రేవొకటే పెద్ద మార్కెట్టుగా ఉండేది.

నదిమీద మొదటి యాత్ర చేయడానికి ముందు ఆ సాహస యాత్రికి తయారయేందుకు ఒకచోట పనిచేశాడు. పదహారో యేట, అతను ఆరడుగులు పైగా ఎదిగిన తరువాత జేమ్సు టేలర్ ఒక చిన్న బల్లకట్టు నిర్మించి, ఆండర్సన్ నది ముఖద్వారంలో దాన్ని నడిపేందుకు అతన్ని నియమించాడు. ఆ ముఖద్వారంలోనే ఆండర్సన్ నది ఓహాయోలో కలుస్తుంది. ఇక్కడ ఆతనికి రోజు

ముప్పైయేడు సెంట్లు దొరికేది. యువకులు చేసే పన్నులన్నిటిలోకీ ఇది చాలాకష్టమైన బండపని. అప్పుడప్పుడు ప్రయాణీకుల్ని స్టీమర్ల దాకా తీసుకు వెళ్ళినందుకు పైన కొద్దిగా చిల్లరకూడా దొరికేది. ఇటువంటి సందర్భాల్లోనే ఒకసారి అతను ఇద్దరు ప్రయాణీకుల్ని పెద్ద పడవదగ్గిరికి సమయానికి తీసుకువెళ్ళినందుకు వాళ్ళు రెండు వెండి అరడాలర్లు అతని చేతిలో పెట్టారు. "నా వంటి బీద బాలుడు ఒక రోజులోపుగా ఒక డాలరు సంపాదించ గలిగాడనేది నేనే నమ్మ లేక పోయాను" అని ఏబ్ వ్రాశాడు.

పదిహేడోయేట లింకన్ ఆరడుగుల రెండంగుళాల పొడుగుండేవాడు. పంథొమ్మిదో యేడు వచ్చేటప్పటికి సన్నగా కండపుష్టి గల అరడుగుల నాలుగంగుళాల ఆజానుబాహువుగా తయారయాడు. నిర్మల హృదయుడు, విశ్వాసపాత్రుడు, కులాసా పురుషుడుగా ఉండి పొరుగు వారందరిచేతా మన్ననలు పొందేవాడు. ఇండియానాలో ఆ ప్రాంతంలోని సరిహద్దు వాసు లందరికంటె గట్టిగా చేతి కర్రతో దెబ్బకొట్టగల బలశాలిగా కూడా ప్రసిద్ధికెక్కాడు. జేమ్సు జెన్ట్రి ఏబ్‌కి జీవితాని కంతటికీ ఒకసారే లభించే ఒక సదవకాశాన్ని కలగ జెయ్యడంలో ఏం ఆశ్చర్యంలేదు.

జెన్ట్రి ఆ ప్రాంతంలోకల్లా ధనవంతులలో ఒకడు. జెన్ట్రి విల్లీలో అతని కొక చిల్లర దుకాణం ఉంది. లింకన్ అక్కడ పనీ పాటా లేకుండా ఉండే సోమరులతో వేళాకోళాలాడుతూ వాళ్ళకి కథలు చెపుతూండేవాడు. జెన్ట్రికి వెయ్యి ఎకరాలకి పైగా భూమి కూడా ఉంది. ఏబ్, తన కొడుకైన ఎల్లెన్ కలసి ఒక పడవను నిర్మించి దాన్ని న్యూ ఆర్లియన్స్‌కి నడపాలని జెన్ట్రి అన్నప్పుడు ఏబ్ ఎగిరి గంతేశాడు. పడవకి ముందు వేపు గడ వేయడం ఏబ్ చేయవలసిన

పని. ఈ పనికి అతనికి నెలకి ఎనిమిది డాలర్ల జీతమూ, భోజనం, ఇతర ఖర్చులూ, యివ్వడానికి ఏర్పాటయింది.

నదీ ప్రయాణానికి ఉపయోగపడే అన్ని రకాల పడవలలోకి బల్లపరుపు పడవలు చాలా విక్రృతమైనవి. ఓహియో తీరంలో ఎక్కడ పడితే అక్కడ లెక్కలేనన్ని చెట్లున్నాయి. అంతూ పొంతూ లేని ఆ చెట్ల కలపను నలుపలకల దూలాలుగాను, మందపాటి చెక్కలుగాను కోసి ఈ పడవల్ని తయారు చేస్తారు. ఇవి ఇరవై నుంచి ఎనభై అడుగుల పొడుగు వరకూ ఉంటాయి. సాధారణంగా దీన్ని నిర్మించేందుకు అడుగు ఒక్కంటికి, ఒక డాలరు చొప్పున అది ఎన్ని అడుగుల పొడుగుంటే అన్ని డాలర్లు ఖర్చవుతుంది. దుంగల ఇల్లు, కోట, నీళ్ళమీద తేలిపోయే పశువుల దొడ్డి, పల్లెటూరి కిరానా కొట్టు కలిస్తే ఈ పడవ అవుతుందని చెప్పచ్చు. దోచుకునే ఇండియన్ల తుపాకీ గుండ్లనుండి ఎప్పుడూ తిరుగుతూండే నదిదొంగల నుండి పడవ వాళ్ళని రక్షించే ఉద్దేశ్యంతో వీటి పక్క భాగాలు చాలా ఎత్తుగా కడతారు. అతి బరువుగానూ, మొద్దు కొనలతో కూడినవి గానూ, నడపడానికి పనికిరానివి గానూ ఉండి, ఇవి ప్రవాహానికి ఎదురుగా ప్రయాణం చెయ్యడానికి ఎంత మాత్రం వీలుగా ఉండవు. అయితే సామాను మోసేందుకు చాలా వీలుగానూ, ఖర్చు లేనివి గానూ ఉంటాయి. నీటివాలున న్యూ ఆర్లియన్సు రేవుకి ధాన్యం, విస్కీ, పశులు, జంతువులు మొదలైన బరువైన సామాను వేసుకుని వెళ్ళడానికి ఇవి చాలా వీలుగా ఉంటాయి.

ఇటువంటి పడవ తయారు చేయడానికి లింకన్ ఆట్టే కష్టపడి ఉండడు. అతను ఇంతకు ముందు తన తండ్రికి చిన్న చిన్న పడవలు చెయ్యడంలో సహాయ పడ్డాడు. చెట్లు నరికే గొడ్డలినీ, దుంగలు కొట్టే గొడ్డలినీ, పెద్ద సుత్తినీ, రంపాన్నీ, ఉలినీ, ఉపయోగించడం



పడవ నడపడంలో ప్రథమ పాఠం

అతనికి బాగా తెలుసు. చెట్లని కొట్టడం, కలపని నలుపలకలుగా కొయ్యడం వంటి కఠిన పరిశ్రమకి తగిన శారీరక బలం అతనికి కావలసినంత ఉంది.

నిస్సందేహంగా జేమ్సు జెన్ట్రీ లింకన్‌కి ఈ పని అప్పగించేటప్పుడు ఈ అర్హతలన్నీ జాగ్రత్తగా పరిశీలించే ఉంటాడు. పడవ నిర్మాణం గానీ, నదీ ప్రయాణం గానీ బలహీనులు చేయగల పనులు కావు. ఈ విశాల నదీ మార్గాలలో జీవితం కఠినమైనదీ, కఠోరమైనదీ, గందరగోళమైనదీ. 1828 ఏప్రిల్‌లో ఏబ్, అతని స్నేహితుడు ఎల్లెన్ జెన్ట్రీ ఈ ప్రయాణానికి తయారయే నాటికి కళ్ళు పీకి, ముక్కలు కోసే కీల్ పడవ వాళ్ళ రాజైన తాగుబోతు, గర్విష్ఠి అయిన మైక్ ఫింక్ లేడన్నది నిజమే! కాని మైక్ వంటి రౌడీలు నది మీద అనేకమంది తిరుగుతూనే ఉన్నారు. ప్రయాణీకుల్ని వాడిలాగే సవాల్ చేస్తూనే ఉన్నారు.

"బయటికి వచ్చి నాతో యుద్ధం చేసేందుకు ఎవరికీ గుండెలు లేవు! హేఁ, నేను కోపం మీదున్న సింహాన్ని; సగం గుర్రం, సగం మనిషి, ఓస్, పిరికి పందలు! బయటికి రండి, వీర మరణం పొందండి. ఎవరితోనేనా సరే, యుద్ధానికి తయారుగా ఉన్నాను. నేను నాలుగు ఇంజన్లని ఆపేశాను. కాని ఒకటి చేతి పట్టుజారి తప్పించుకు పోయింది. పరుగెత్తడంలో, ఎగరడంలో, ఈదడంలో నాకు ఎవరూ సాటి లేరు. ఎంతో పొగాకు నములుతాను. అయినా, ఆట్టే ఉమ్మెయ్యను ఈ ప్రాంతాల్లోకి అందరి కంటె ఎక్కువ తాగుతాను, అయినా అందరి కంటె ఎక్కువ తెలివిగా ఉంటాను" అనేవాడు రౌడీ.

లింకన్‌కి ఎప్పుడో కాని కోపం రాదు. కాని జేమ్సు జెన్ట్రీకి బాగా తెలుసు - నదీ ప్రయాణంలో ఏదేనా కష్టం వస్తే పడవనీ, పడ

వలో సామానునీ రక్షించేందుకు అతని కొడుకు ఎల్లెన్‌కి మంచి సహాయకుడు ఉన్నాడని. ఓహియో నది మీద ఇల్లినాయిస్ తీరంలోని పశువల దోపిడి గాళ్ళనీ, కూనీకోరుల్ని తప్పించుకో గలిగితే మిగిలిన చిన్న చిన్న దొంగల ముఠాల్ని తప్పించుకుని వాళ్ళు సురక్షితంగా న్యూ ఆర్లియన్స్ చేరుకోవచ్చు.

నిరుటి ఎండు ఓక్ ఆకుల తివాచీ లోంచి రకరకాల కుక్కగొడుగులు తల లెత్తుతున్నాయి. ఎండు కొమ్మల పైన ఎర్ర మొగ్గలు కొత్త రంగులు వేస్తున్నాయి. ఏబ్, ఎల్లెన్లు కొత్త పడవని ప్రయాణానికి ఆయత్త పరిచారు కొత్తగా కోసిన కలప వాసన ఇంకా వస్తూనే ఉంది. న్యూ ఆర్లియన్స్‌లో జేమ్సు జెన్ట్రీ అమ్మ దలచుకున్న ధాన్యం, పందులు, పంది మాంసం, పంది తొడలు మొదలైన సామానంతా పడవమీద ఎక్కించారు. తరువాత ఏబ్, ఎల్లెన్‌లు జెన్ట్రీ రేవు నుంచి నదివాలున యాత్ర ప్రారంభించారు.

ఇక్కడ వెడల్పుగా ఉన్న ఓహియో నది నిశ్శబ్దంగా ప్రవహిస్తుంది. శీతకాలంలో నదీగర్భం పచ్చని ఆకులతో నిండి ఉంటుంది. వసంత ప్రారంభంలో కలప కట్లతో నిండిపోతుంది. ఈ ఋతువులో పైన ఆకాశంలో అడవి బాతులూ, హంసలూ ఉత్తర ధ్రువ నివాస భూములకు గుంపులు గుంపులుగా ఎగిరిపోతూ కనిపిస్తాయి. ప్రపంచంలో ఏ అడవి పక్షీ అరవని విధంగా ఈ బాతులు చాలా భయంకరంగా అరుస్తూ పోతాయి.

కింగ్ ఫిషర్లు ప్రతి చిన్న గుంటలోను ఆహారం వెతుక్కుంటున్నాయి. తాంబేళ్లు దుంగల మీద ఎండ కాచుకుంటున్నాయి. అనేక సరస్సుల నుండి ఈ మహా నదీ ప్రవాహంలోకి నీరు ఊరికే వచ్చి పడుతోంది. తెల్లవారింది మొదలు రాత్రివరకూ ఎండనక

వానసక మంచుని లెక్కపెట్టకుండా ఏబ్, ఎల్లెనలు ప్రవాహం వాలుస ప్రయాణం చేశారు. పడవకి ఒక చివరగా వేసిన ఒక కప్పు కింద రాత్రిళ్ళు పడుకోడానికి ప్రయత్నించేవారు. వాళ్ళు సురక్షితంగా కేప్-ఇన్-రాక్‌ని దాటి బురద నీటిలో కూడిన మిస్సిసిపీలో ప్రవేశించారు.

1811 నుంచి, అంటే ఏబ్ రెండేళ్ళవాడైనప్పటి నుంచి, మిస్సిసిపీలో స్టీమ్ బోట్లు వెడుతూనే ఉన్నాయి 1817 లో పొగలు వదిలే ఈ యంత్రపుపడవలు పెద్ద నదులకోసం ఎనిమిది తయారు చేశారు. తరువాత రెండేళ్ళలోనూ ఇంకొక అరవై తయారయ్యాయి. అందుచేత పడవలు, నావలు, బోట్లు, బల్లకట్లు, చిన్న ఓడలే, కాక ఏబ్, ఎల్లెన్లు కొన్ని చక్కటి పక్క చక్రాల స్టీమ్‌బోట్లు తమ పొడుగైన పొగ గొట్టాలనుంచి ఏప్రిల్ ఆకాశంలోకి పొగ మేఘాల్ని వదులుతూ వెళ్ళడం చూశారు. లింకన్, జెన్ట్రీలు ఇంకా కొన్ని సంవత్సరాలక్రితమే తమబోటుతో ప్రయాణంచేసిఉంటే వెస్టర్న్ ఇంజినీర్ అనే సంయుక్త రాష్ట్ర సైన్యపు భయంకరమైన స్టీమ్‌బోట్‌ని చూసిఉండేవాళ్ళు. నల్లని పెద్ద పెద్ద చారలతో ఒక రాక్షసుడిలాఉండి పెద్దకూతకూస్తూ ఆవిరి వదిలిపెట్టే ఆ బోటు యుద్ధ సన్నద్ధులైన ఇండియనని హడలగొట్టేది. అటువంటి భయంకర దృశ్యాల నెదుర్కొనకపోయినా, మనయువకులు ఈ యాత్రలో అనేక కష్టాల్ని ఎదుర్కొనవలసి వచ్చింది.

ఆ కాలపు ప్రచురణ "ద నావిగేటర్" పశ్చిమప్రాంతం నదులలోని అనేక వందల నావికులు చదివేవారు. దానిలో పడవ ప్రయాణాలలో కలిగే అపాయాల్నిగూర్చి బాగా వివరించబడిఉంది. మిస్సిసిపీకి రెండు వైపుల ఉండే ఎత్తైన మట్టిగట్లు గట్ట పక్కగాపోయే పడవల మీద కూలిపడేవి. కలప తెప్పలకుగుద్దుకుని పడవ కింది భాగం పగిలి

పోవడంకూడా ఉండేది. "నిజమైన లంకలకంటె కలప లంకలుచాలాఅ పాయకరమైనవి"అని ఆపుస్తకంలోవివరించబడిఉంది.ప్రవాహవేగంలో పడి కొట్టుకుపోయేటప్పుడు అప్పుడప్పుడు పడవలు నదిలో అక్కడక్కడ ఎదురయే దుంగలకింద తుక్కుచెత్తలక్రింద దూరిపోయేవి.

ఎప్పుడూ ఏదో పుస్తకమో వార్తా పత్రికో చదువుతూ ఉండే లింకన్ మొదటిగడ వేస్తూ కూడా చదివేవాడా? ఆయేడు ఆండ్రూ జాక్సన్, క్విన్సీ ఆడమ్స్‌ల మధ్య అధ్యక్షపదవికోసం చెలరేగిన. రాజకీయ పోరాటాన్ని గూర్చి అతను ఎల్లెన్ జెన్ట్రీతో చర్చించాడా? మిస్సిసిపీ లోయలోని సిరి సంపదలనిగూర్చి ఏబ్ ఆలోచించి ఉంటాడా? లేక ఉత్తరప్రాంతాన్నీ మానవవాసం లేని పశ్చిమప్రాంతాన్నీ, పారిశ్రామిక దక్షిణప్రాంతాన్నీ, చుట్టుకొనిఉన్న పర్వతాల్నితడిపే విశాల జలరాశినిగూర్చి ఆలోచించి ఉంటాడా? బానిసలచే పని చేయించే తోటల యజమానుల ఇచ్ఛారాజ్యమైన దక్షిణప్రాంతానికి అతనిప్పుడు వెడుతున్నాడు-ఆ ప్రాంతం స్వతంత్రతా ప్రాతిపదికపై నిర్మితమైన జాతి శాంతికి భంగకరంగా ఉందన్న సంగతిని ఈ పాటికి అతను గ్రహించి ఉంటాడా? బహుశః పూర్తి అర్థంలో గ్రహించి ఉండడు. అయితే ఏబ్ లింకన్ ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూనే ఉన్నాడు. అతని ఆలోచనలన్నీ దీర్ఘమైన, అతిదీర్ఘమైన ఆలోచనలే! ఈ ప్రయాణంలో అతని హృదయంలో ముమ్మరంగా లేచే భావవాహినిని మనం తెలుసుకోడం కష్టం. ప్రతి యువకుడూ మిస్సిసిపీనదిలో యాత్రకి ఉవ్విళ్ళూరుతూ అనేక స్వప్నసౌధాల్ని నిర్మించుకుంటాడు. అతను కోరేది కేవలం సాహసిక అనుభవాలే అయితే,అవి ఎంతో దూరంలో లేవు.

పడవ నిర్దిష్టస్థలానికి కొద్దిదూరంలో ఉండగా ఒక నాటిరాత్రి ఏబ్, ఎల్లెన్లు దాన్ని శ్రీమతి డచెనీ అనే ఆమె తోట సమీపంలో కట్టారు.

ఆ రాత్రి సంఘటననిగూర్చి స్వయంగా లింకన్, "పడవలోని సామాను బరువునుబట్టి షుగర్ కోస్ట్ దగ్గర పడవని మెల్లిగా నడపవలసివచ్చింది" అని పిమ్మట చెప్పాడు. రాత్రి తమ చోటులో వాళ్ళు పడుకునిఉండగా ఏడుగురు నీగ్రోలు వచ్చి వాళ్ళమీద పడ్డారు. పడవని దోచుకుని పడవమీది వాళ్ళని చంపే ఉద్దేశ్యంతోనే వాళ్ళు వచ్చారు. ఆ దొమ్మీలో ఏబ్, ఎల్లెన్లు గాయపడ్డా, హికరీ కొమ్మల సహాయంతో వాళ్ళు నీగ్రోలని తరిమివేసి కొంత దూరందాకా వెంటాడి వదిలారు. ఆ వెనువెంటనే పడవని నడిపి నదిలోపలికి వెళ్ళి తెల్లవారేవరకు ప్రయాణంచేశారు. లింకన్‌కి ఈ సమయంలో కంటిమీద తగిలిన గాయపుమచ్చ జీవితపర్యంతం ఉంది. కాని లింకన్ హృదయంలో ద్వేషం లేదు. అందరు నీగ్రోలూ దోపిడిగాళ్ళూ, హంతకులూ అనే దురభిప్రాయంకూడా అతనికి ఎన్నడూ ఏర్పడలేదు. అనేకమంది తెల్లవాళ్ళు ఇండియన్లూ కూడా భయంకరమైన పడవ దొంగల పాత్రను నిర్వహించిన సంగతి అతనికి తెలుసు. ముప్ఫైఐదేళ్ళ తరవాత అబ్రహాం లింకన్ రాజ్యాంగానికి పదమూడవ సవరణ ప్రాతిపదికగా విమోచనా ఘోషణ పత్రంమీద సంతకం పెట్టాడు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో బానిసగా ఉండే ప్రతి నీగ్రో ఈ సవరణవలన విముక్తి పొందాడు.

అప్పుడే కొత్తగా దక్షిణ ఇండియానానుంచి వచ్చిన ఏబ్, ఎల్లెన్లకి న్యూ ఆర్లియన్స్ రేవు అద్భుతమైన కొత్త ప్రపంచంగా కనిపించింది. మైళ్ళ పొడుగున రేవులో పడవలు వరసగా నిలబడి ఉన్నాయి. ఓడలు ఠీవిగా నదిలో ప్రయాణం చెయ్యడానికి బయలుదేరుతున్నాయి. బంగారు చక్రాలు చెవుల్ని వ్రేలాడుతూండగా విదేశ నావికులు పైకి ఎక్కుతున్నారు ఊళ్లో ఇళ్లన్నీ ఇంద్రధనుస్సుల్లాగ రంగు రంగులతో మెరుస్తున్నాయి. ఇనుపఊచల పందిళ్ళపైకి సువాసనలు వెదజల్లుతూ పువ్వులతోనున్న ద్రాక్షతీగలు ప్రాకుతున్నాయి.

పోవడంకూడా ఉండేది. "నిజమైన లంకలకంటె కలప లంకలుచాలాఅపాయకరమైనవి"అని ఆపుస్తకంలోవివరించబడిఉంది.ప్రవాహవేగంలో పడి కొట్టుకుపోయేటప్పుడు అప్పుడప్పుడు పడవలు నదిలో అక్కడక్కడ ఎదురయే దుంగలకింద తుక్కుచెత్తలక్రింద దూరిపోయేవి.

ఎప్పుడూ ఏదో పుస్తకమో వార్తా పత్రికో చదువుతూ ఉండే లింకన్ మొదటిగడ వేస్తూ కూడా చదివేవాడా? ఆయేడు ఆండ్రూ జాక్సన్, క్విన్సీ ఆడమ్స్‌ల మధ్య అధ్యక్షపదవికోసం చెలరేగిన. రాజకీయ పోరాటాన్ని గూర్చి అతను ఎల్లెన్ జెన్ట్రీతో చర్చించాడా? మిస్సిసిపీ లోయలోని సిరి సంపదలనిగూర్చి ఏబ్ ఆలోచించి ఉంటాడా? లేక ఉత్తరప్రాంతాన్నీ మానవవాసం లేని పశ్చిమప్రాంతాన్నీ, పారిశ్రామిక దక్షిణప్రాంతాన్నీ, చుట్టుకొనిఉన్న పర్వతాల్నితడిపే విశాల జలరాశినిగూర్చి ఆలోచించి ఉంటాడా? బానిసలచే పని చేయించే తోటల యజమానుల ఇచ్ఛారాజ్యమైన దక్షిణప్రాంతానికి అతనిప్పుడు వెడుతున్నాడు-ఆ ప్రాంతం స్వతంత్రతా ప్రాతిపదికపై నిర్మితమైన జాతి శాంతికి భంగకరంగా ఉందన్న సంగతిని ఈ పాటికి అతను గ్రహించి ఉంటాడా?. బహుశః పూర్తి అర్థంలో గ్రహించి ఉండడు. అయితే ఏబ్ లింకన్ ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూనే ఉన్నాడు. అతని ఆలోచనలన్నీ దీర్ఘమైన, అతిదీర్ఘమైన ఆలోచనలే! ఈ ప్రయాణంలో అతని హృదయంలో ముమ్మరంగా లేచే భావవాహినిని మనం తెలుసుకోడం కష్టం. ప్రతి యువకుడూ మిస్సిసిపీనదిలో యాత్రకి ఉవ్విళ్ళూరుతూ అనేక స్వప్నసౌధాల్ని నిర్మించుకుంటాడు. అతను కోరేది కేవలం సాహసిక అనుభవాలే అయితే,అవి ఎంతో దూరంలో లేవు.

పడవ నిర్దిష్టస్థలానికి కొద్దిదూరంలో ఉండగా ఒక నాటిరాత్రి ఏబ్, ఎల్లెన్లు దాన్ని శ్రీమతి డచెనీ అనే ఆమె తోట సమీపంలో కట్టారు.

ఆ రాత్రి సంఘటననిగూర్చి స్వయంగా లింకన్, "పడవలోని సామాను బరువునుబట్టి సుగర్ కోస్ట్ దగ్గర పడవని మెల్లిగా నడప వలసివచ్చింది" అని పిమ్మట చెప్పాడు. రాత్రి తమ చోటులో వాళ్ళు పడుకునిఉండగా ఏడుగురు నీగ్రోలు వచ్చి వాళ్ళమీద పడ్డారు. పడవని దోచుకుని పడవమీది వాళ్ళని చంపే ఉద్దేశ్యంతోనే వాళ్ళు వచ్చారు. ఆ దొమ్మిలో ఏబ్, ఎల్లెన్లు గాయపడ్డా, హికరీ కొమ్మల సహాయంతో వాళ్ళు నీగ్రోలని తరిమివేసి కొంత దూరందాకా వెంటాడి వదిలారు. ఆ వెనువెంటనే పడవని నడిపి నదిలోపలికివెళ్ళి తెల్లవారేవరకు ప్రయాణంచేశారు. లింకన్‌కి ఈ సమయంలోకంటి మీద తగిలిన గాయపుమచ్చ జీవితపర్యంతం ఉంది. కాని లింకన్ హృదయంలో ద్వేషంలేదు. అందరు నీగ్రోలూ దోపిడిగాళ్ళూ, హంత కులూ అనే దురభిప్రాయంకూడా అతనికి ఎన్నడూ ఏర్పడలేదు. అనేకమంది తెల్లవాళ్ళు ఇండియన్లూ కూడా భయంకరమైన పడవ దొంగల పాత్రను నిర్వహించిన సంగతి అతనికి తెలుసు. ముప్పైఫైయై దేళ్ళ తరవాత అబ్రిహాం లింకన్ రాజ్యాంగానికి పదమూడవ సవరణ ప్రాతిపదికగా విమోచనా ఘోషణ పత్రింమీద సంతకం పెట్టాడు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో బానిసగా ఉండే ప్రతి నీగ్రో ఈ సవరణవలన విముక్తిపొందాడు.

అప్పుడే కొత్తగా దక్షిణ ఇండియానానుంచి వచ్చిన ఏబ్, ఎల్లెన్లకి న్యూ ఆర్లియన్స్ రేవు అద్భుతమైన కొత్త ప్రపంచంగా కని పించింది. మైళ్ళ పొడుగున రేవులో పడవలు వరసగా నిలబడి ఉన్నాయి. ఓడలు ఠీవిగా నదిలో ప్రయాణం చెయ్యడానికి బయలు దేరుతున్నాయి. బంగారు చక్రాలు చెవుల్ని వ్రేలాడుతూండగా విదేశ నావికులుపైకి ఎక్కుతున్నారు ఊళ్లోఇళ్లన్నీ ఇంద్రధనుస్సుల్లాగ రంగు రంగులతో మెరుస్తున్నాయి. ఇనుపఊచల పందిళ్ళపైకి సువా సనలు వెదజల్లుతూ పువ్వులతోనున్న ద్రాక్షతీగలు ప్రాకుతున్నాయి.

వీధుల్లో రకరకాలవేషాలలో రకరకాల భాషల వ్యక్తులు సంచరిస్తు న్నారు. క్రియోలులు, ఫ్రెంచివారు, స్పెయిను దేశీయులు, మెక్సికన్లూ శానిసలూ మొదలైన అనేక జాతీయులు, అచ్చ తెలుపునుండి కారు, నలుపువరకూ రకరకాల రంగులలో ఇటూ అటూ తిరుగుతున్నారు. పీజియన్ క్రీక్‌నుంచి వచ్చిన ఈ సరిహద్దు యువకులకి ఇక్కడ అతి విచిత్రమైన వాసనలు, దృశ్యాలు, శబ్దాలు అనుభవంలోకి వచ్చాయి. చర్చి గంటలు ఇరుకు సందులలోకి గణగణ ధ్వనులను ప్రసరింప జేస్తున్నాయి. పెటికి విలాసపురుషుల పాటలు, సరుకులు అమ్ము కునేవారి అరుపులూ తోడై వింతకోలాహలాన్ని కలగజేస్తున్నాయి.

అతి త్వరలోనే ఏబ్, ఎల్లెన్ల వ్యాపారం ముగిసింది. వాళ్ళు ఇంటికి తిరిగివెళ్ళే సమయం వచ్చింది. 1828 లో నిర్మించబడిన ఒక రెండంతస్తుల స్టీమరుమీద తిరుగు ప్రయాణం ఏర్పరచుకున్నారు. తళ తళలాడే స్తంభాల గిల్టురేకులమధ్య ప్రయాణం చాలా గొప్ప గానే ఉంది. స్టీమరు గట్టునుంచి క్రమంగా నీటిలోనికి వచ్చింది. జూదర గాళ్ళు పడవ సారాలలో అటూ ఇటూ తిరుగుతున్నారు. ప్రధాననావి కుడు ఈ ఓడ రాజ్యానికి చక్రవర్తి. యువలింకన్ ఈ సంగతి తెలుసు కోడంతో అతని మెదడులో కొత్త ఆలోచన మొలకెత్తింది.

రెండు నెలల యాత్ర ముగించి తిరిగి దక్షిణ ఇండియానా చేరుకోగానే ఏబ్ తన ప్రసిద్ధ స్నేహితుడైన విలియమ్ వుడ్‌ని ఒక సహాయం చెయ్యమని కోరాడు.

వుడ్ కథనం ప్రకారం. "ఒక రోజున ఏబ్ మా ఇంటికి వచ్చి సంకోచిస్తూ మొహమాటంతో ఒక పక్కగా ఒదిగి నుంచున్నాడు. అతను ఏదో చెప్పాలను కుంటున్నాడని నాకు తెలుసు. 'ఏబ్! నువ్వు చెప్ప దలచుకున్నదేదో చెప్పు' అన్నాను నేను. అతనన్నాడు' 'మామా!

నన్ను రేవుకి తీసుకునివెళ్ళి ఎవరికేనా శిఫారుసుచేసి ఏదైనా పడవ మీద పని ఇప్పిస్తావా'? ఏబ్! నీ వయస్సు చాలదు-ఇంకా నీకు 21 వ యేడు రాలేదు' అన్నాను నేను. ఏబ్, 'అదినాకుతెలుసు. ఇప్పటి నుంచీ నేను పనినేర్చుకోవాలనిఉంది," అన్నాడు.

కాని పిల్లవాని బాగు కోరినవాడవడంవల్ల అతని స్నేహితుడు అందుకు ఒప్పుకోలేదు అందుచే లింకన్ ఎన్నడూ నావికుడు కాలేదు.

అసంతృప్తితో, అప్పుడప్పుడు కలహిస్తూకూడా, మొదటికంటె ఎక్కువగా చదువుతూ, చెప్పిన పనులుచేస్తూ అశాంతితో, చంచల బుద్ధితో, నిరుత్సాహంతో ఏబ్ లింకన్ నవ్వుతూఉండేవాడు. ఎప్పుడూ ఆలోచనామగ్నుడుగా ఉండేవాడు. కథలు చెబుతూ నవ్వించేవాడు. శారీరక బలం ప్రదర్శిస్తూ ఎన్నో ఫీట్లు చేసేవాడు. వికృతమైన వ్యంగ్య కవిత్వం రాసేవాడు. గ్రిగ్స్బీ కుటుంబంతో అతనికి చాలా వైమనస్యం ఉన్నట్టు కనిపిస్తుంది. తన అక్కగారి భర్త ఆరన్ గ్రిగ్స్బీ అతఅక్కగర్భవతిఅయిన సమయంలో శ్రద్ధతీసుకోక తన అమెని చంపాడని అతని నమ్మకం. దక్షిణ ఇండియానాలో సగం సాగుచేసిన చిన్న పొలంలో తన తండ్రికి ఒక పాలేరులాగ కాకుండా స్వతంత్ర సహాయకుడుగా ఉండే సమయం అతిత్వరలో వస్తూన్నదన్న విషయం ఏబ్కి తెలును. అతను తన స్వాతంత్ర్యంకోసం, తన ఇరవై యొకటో ఏటికోసం నిరీక్షించాడు

అందుచేతే, తమ కుటుంబం మరొకసారి మకాం ఎత్తేసి కొత్త సరిహద్దులోకి-సిరిసంపదలతో తులతూగే మధ్య ఇల్లినాయిస్ పచ్చిక బయళ్ళకి పయనించబోతోందని తెలుసుకొని అంతగా విచారించలేదు.

# ఇల్లినాయిస్ సరిహద్దులో

"ఇరవైయొకటో ఏట నేను ఇల్లినాయిస్ వచ్చాను"

అబ్రహాం లింకన్

ఆ సంఘంలో అసంతృప్తితోనూ, అశాంతితోనూ బాధపడే వాడు యువకుడైన ఏబ్ లింకన్ ఒకడే కాదు. పీజియన్ క్రీక్ లో మళ్ళీ పాలరోగం వ్యాపించింది. ఒకే ఒకవారంలో డెన్నిస్ హాంక్స్ ఆవులు నాలుగూ, దూడలు ఏడూ చనిపోయాయి. పదైరెండోయేట కూడా అసఫలుడుగాఉన్న తామస్ లింకన్ మొదట ఇండియానా వచ్చి నపుడు ఏస్థితిలో ఉండేవాడో ఇప్పుడు అదే స్థితిలోఉన్నాడు. మధ్య ఇల్లినాయిస్‌లోని వాబష్‌నది ప్రాంతంలోని సారవంతమైన భూమిని గూర్చి ఆశాజనకమైన వదంతులు అతను విన్నాడు.

లింకన్లూ, హాంకులూ, హాలుస్సు, జాన్‌స్టన్లూ ఇండియానాని వదలి పెట్టడానికి గల కారణాల్ని జ్ఞాపకంచేసుకుంటూ డెన్నిస్ హాంక్సు అన్నాడు-"అవును, నాకు బాగా గుర్తుంది. మొట్టమొదట జాన్ హాంక్సు విసుగెత్తిపోయి ఇల్లినాయిస్ వెళ్ళాడు. అతనే మమ్మల్నందరినీ రమ్మనిరాశాడు. మాకోసం భూములుకూడా అతనే ఏర్పాటు చేశాడు.

"స్థలం మార్చడానికి టాం ఎప్పుడూ తయారే. ఇండియానాలో భూమికొన్న అప్పుకూడా అతను పూర్తిగా తీర్చలేదు......

ధాన్యం పందులూ అమ్మేసి, సామానంతా ఎడ్ల బళ్ళ మీదికి ఎక్కించాడు. మేమంతా-లింకన్లూ హాంక్సులూ జాన్‌స్టన్లూ అంతా కట్ట గట్టుకుని బయలుదేరాం. మేం ఇజ్రాయిల్ జాతికి సంబంధించిన ముతాలాకలిసే ఉండేవాళ్ళం. మమ్మల్ని విడతీయడం బ్రహ్మతరంకాదు. టాం దృష్టి ఎంతసేపూ ముందు తనకి సంక్రమించబోయే భూమి మీదే ఉండేది."

వాబష్‌కి సుదూర తీరంలో ఉంది - బంగారుపండే భూమి ఇల్లినాయిస్ ! ఇటువంటి అనేక జాతుల వ్యక్తుల్నే ఈ శ్యామల సస్యస్థలాలు ఎన్నిసార్లో ఆకర్షించినయి. టాం లింకన్ తనపొలాన్ని వచ్చినకాడికి తెగనమ్మేశాడు. స్నేహితులవద్ద బంధువులవద్ద సెలవు తీసుకున్నాడు. గృహసామగ్రితోను, స్త్రీలు పిల్లలతోను నిండిన బళ్ళు ముందుకి సాగుతూన్న ఎడ్ల వెనక మెల్లిగా దొర్లసాగాయి. డెన్నిస్ హాంక్స్ కథనం ప్రకారం ఏబ్ ఒక బండితో లాడు. అతను కొరడాతో ఎడ్లని కొట్టినప్పుళ్లా అందరినీ పొట్టలుబ్బేట్లు నవ్వించే హాస్యోక్తులు విసిరేవాడు. తరచు యువ లింకన్ మనస్సు గంభీరవిష యాలపైకిపోయి ఉండాలి. ఏరాష్ట్రం యూనియన్ చట్టాన్నితోసి రాజనడానికి వీల్లేదంటూ సెనేటులో ఈ మధ్యే డేనియల్ వెబ్‌స్టర్ ఇచ్చిన ఉపన్యాసంమీదికి అతని దృష్టి పోయి ఉంటుంది. ఆ ఉపన్యాసంలో ఒక పంక్తి లింకన్ హృదయంలో ఎప్పుడూ ప్రతి ధ్వనించేది "...స్వాతంత్ర్యం యూనియన్. ఇప్పుడూ ఇకముందెప్పుడూ విడదీయరానివి; ఒకటిగానే ఉండేవి".

దట్టంగా మంచు కురిసిన అడవుల్లో సాగిన ఈ యాత్రలో మొత్తం పదముగ్గురు వ్యక్తులున్నారు. టాం, సారాబుష్, జాన్‌స్టన్ లింకన్, అబ్రహాం, సారాకొడుకు, జాన్ జాన్‌స్టన్. డెన్నిస్ హాంక్స్ పెళ్ళాడిన సారాకూతురు ఎలిజబెత్, వాళ్ళ నలుగురు పిల్లలు; సారా



అడవిదారులవెంట గూడుబళ్లలో ప్రయాణం

రెండవకూతురు మాటిల్డా, ఆమెభర్త స్క్వైర్ హాల్, వాళ్ళ చిన్న కొడుకు. లింకన్ తరువాత అన్నట్టు అది చాలా కష్టమైన విసుగు కలిగించేటంత మెల్లిగా సాగిన ప్రయాణం.

వాళ్ళందరూ మెల్లిగా వాబష్ నదీ తీరంలో ఇండియానా రాష్ట్రంలో కల్ల పెద్ద పట్టణమైన విన్‌సెన్నెస్ వైపు ఉత్తరంగా ముందుకి సాగారు. అక్కడ వాళ్ళు నదినిదాటి ఇల్లినాయిస్ వచ్చిక బయళ్ళలోనుంచి, మంచుతో కలిసిన బురదలో బళ్ళచక్రాలు లోతుగా దిగిపోతూండగా ప్రయాణం చేశారు. డెన్నిస్ హాంక్సుకి జ్ఞాపకం ఉంది, "మేము అక్కడికి చేరుకోడానికి రెండు వారాలు పట్టింది. అడవుల్లో దారి చేసుకుంటూ, నదులు దాటుకుంటూ, ఇనుప గున పాలతో బళ్ళని బురదలోంచి పైకి ఎత్తుకుంటూ, మధ్య మధ్య మకాములు చేసుకుంటూ ప్రయణం చేశాం."

జననివాసం లేని ఈ బంజర్లలో సెలయేళ్ళు అనేకం ఇష్టం వచ్చినట్టు ప్రవహిస్తున్నాయి. ఈ మార్గంలో ఎక్కడా దేనికీ వంతెనలు లేవు. వీటిని దాటేటప్పుడు ఎడ్లు అడుగడుక్కీ మంచులో, బురదలో దిగబడేవి. ఈ ప్రయాణంలో ఏబ్ వెంట ఒక చిన్న కుక్క ఉంది! కాని ఒకసారి వాళ్ళంతా ఒక యేరుదాటి అవతలిగట్టున ఉండగా, ఏబ్ వెనుతిరిగి కుక్కపిల్లకోసం చూశాడు. పాపం అది మంచు నీటిలో ఈది అవతలిగట్టుకి రాలేక మొరుగుతూ జాలిగా అతనికేసి చూస్తోంది. ఏబ్ ఆవిషయాన్ని గుర్తించి తరవాత అన్నాడు- "ఆకుక్కపిల్లని అలా ఆస్థితితో వదిలివెయ్యడానికి నా మనస్సు ఒప్పుకోలేదు. బూట్లూ మేజోళ్ళూ విప్పి నేను వెంటనే అవతలిగట్టుకి ఈదుకుని వెళ్ళి జయప్రదంగా కుక్కపిల్లని చంకలో పెట్టుకుని తిరిగి వచ్చాను. అది విశ్వాసంతోను, కృతజ్ఞతతోను ఎగిరిపడుతూ తోక ఆడించడంచూస్తే నేను పడ్డ శ్రమకి తగిన ప్రతిఫలం నాకు ముట్టిందనిపించింది.

1830 మార్చి మొదట్లో ఒకరోజున, లింకన్‌కి ఇరవై ఏడు ఏళ్లు వచ్చిన కొద్ది రోజుల తరువాత వాళ్ళు తమ గమ్యస్థానం-డెకాటర్ కి పదిమైళ్ళ దూరంలో, అడవికీ పచ్చిక బయలుకీ సంధి స్థలంలో, సంగమన్ నదికి ఉత్తర దిశలోనున్న స్థలానికి-చేరుకున్నారు.

వాళ్ళలో మగవాళ్ళు ఐదుగురు మామూలు కట్టెల కొంప కట్టడానికి వెంటనే నడుం కట్టారు. అది తయారు కాగానే వాళ్ళు పదముగ్గురూ, దూలం తొట్టిలో రాకూన్ల కుటుంబంలాగ అందులో ఇరుక్కుని ఉండి, వసంత ఋతువు, ఎండాకాలం, వానాకాలం, అతి భయంకరమైన 1830-31 సం॥పు శీతకాలం కూడా గడిపేశారు

సుత్తీ, గొడ్డలీ ఎత్తగలిగే వయస్సు నుంచీ ఏబ్ దూలాలు పగల కొట్టడం మొదలెట్టాడన్న సంగతి మనం ఇంతకి ముందే తెలుసు కున్నాం. అయితే ఇక్కడికి వచ్చిన తరువాతే అతను అసలైన "దూలాలు పగల కొట్టేవాడు" గా ప్రసిద్ధి కెక్కాడు. అతను ముందు ముందు అధ్యక్షుడు అవడానికి కూడా ఇది సహాయపడింది. యువ లింకన్ మేకన్ కౌంటీలో మొదటిసారి సాగుచేసిన పది ఎకరాల పొలానికి కంచె వేసేందుకు కావలసిన కలప దూలాలను పగల గొట్ట డమే కాక, తన తల్లికి జ్ఞాతియైన జాన్ హాంక్స్‌తో కలిసి సుమారు 4000 దూలాల్ని ఇతరుల ఇళ్ళకోసం కొట్టిపెట్టాడు.

1830 వసంత ఋతువులో అతను కొత్త పచ్చిక భూమిని శుభ్రపరచి దున్నాడు. పెద్ద పెద్ద వేళ్లూ, తుంగ గడ్డితో నిండిన ఆ బంజరు భూమిలో తన బరువైన పెద్ద నాగలిని నడిపాడు. అతని పరిశ్రమకి ఫలితంగా జూలై నాలుగో తేదీకే మిసమిసలాడే పచ్చని వరి మోకాలు లోతు ఎదిగింది. సెప్టెంబర్ కల్లా కంకులు వేసింది. పండిపోయింది. కాని వర్షాకాలంలో కుటుంబంలో రోగాలు, జ్వరం



దూలాలు పగలగొట్టడంలో మొనగాడు.

వ్యాపించాయి. చలికాలం చాలా తీవ్రంగా ఉండే సూచనలు కని పించాయి.

1830 క్రిష్టమస్ నాటికి మంచు పడడం మొదలు పెట్టింది. గాలి చాలా తీవ్రంగా ఉంది. పచ్చిక బయలంతా పెద్ద మంచు తుపానుతో ఊగి పోయింది. ఆ కర్ర యిళ్ళకి కొన్ని వందల గజాల దూరంలో చిక్కుకున్న వాళ్ళు కూడా త్రోవ తప్పిపోయి దట్టమైన పొగమంచులో పడుముళ్ళాడారు. గడ్డ కట్టుకుపోయి మరణించారు. మళ్ళీ వసంత ఋతువు వరకూ వారి మృత శరీరాలు దట్టమైన మంచు కుప్పల కింద ఉండి పోయాయి.

అనేక దినాల వరకూ ఈ శ్వేత ప్రళయం అన్ని రోడ్లనీ, మార్గాలనీ కప్పేస్తూ, ఇల్లినాయిస్ సరిహద్దుని కంపింప జేసింది. మెరక స్థలాల్లో ఈ మంచు మూడు అడుగుల ఎత్తూ, పల్లాలలో ఇంటి కప్పు ఎత్తు వరకూ లేచింది. ధర్మామీటర్ లో పాదరసం సున్నాకి కింద పన్నెండు మీద నిలిచింది తరవాత కొద్ది రోజులు వర్షం కురిసి గడ్డ కట్టుకుపోయింది. పల్లపు గుంటలు అపాయకరమైన మంచు పూతలతో తళ తళ లాడుతున్నాయి ఆఖరికి వానలు ఆగిపోవడంతో గాఢమైన చలి ఆవహించింది.

రక్షణలేని గుర్రాలూ, ఆవులూ మంచు గడ్డలతో డీకొని నాశన మైపోయాయి. తెల్ల తోకల లేళ్ళ గుంపు లెన్నో ఈ విధంగా నశించాయి. ఈ అనాథ ప్రేతాల విందులతో తోడేళ్ళు చాలా కాలం గడిపాయి. తరువాత తోడేళ్ళ వంతు వచ్చింది. అవి కూడా మంచులో గడ్డ కట్టుకుపోయాయి. తొమ్మిది వారాల వరకూ లింకన్ ఇంట్లోని వాళ్ళు లోగడ నిలవ చేసుకున్న ధాన్యంతోనూ, కరగిన మంచు నీటితోనూ గడిపారు వాళ్ళు ఏదోవిధంగా బ్రతికి బయట పడ్డారు. కాని వాళ్ళ ఇంటికి బయట ఎక్కడ చూసినా శవాలే!

ఇల్లినాయిస్‌లో ఇక ముందెప్పుడూ జంతువులు పెరగవేమో! "మహా హిమ సంవత్సరం"లో అవి నశించిపోయాయి.

ఆఖరికి మళ్ళీ సూర్య దర్శనమైంది. మహా హిమపురాలు కరుగసాగాయి. అధి వ్యాధులకు ఆకరమైన లింకన్ యింటి నించి లేచి వెళ్ళిపోవడానికే అంతా నిశ్చయించుకున్నారు. టాం లింకనూ, సారా లింకన్ తమ స్థిరవాసమైన కోల్ కౌంటీ చేరుకున్నారు. చట్ట రీత్యా ఏబ్ తన తండ్రికి చెయ్యవలసిన సేవ కంటె ఎక్కువ సేవే చేశాడు. ఇప్పుడు ఇక స్వతంత్రుడుగా బ్రతుక దలచాడు. అతనికి కావలసినదల్లా పని!

ఏబ్‌కి మంచి అవకాశం చిక్కింది. డెన్టన్ ఆఫట్ కలలుగనే చొరవగల వ్యాపారి, త్రాగుబోతు, ప్రగల్భుడు. అతను ఏబ్‌నీ, జాన్ జాన్‌స్టన్‌నీ, జాన్ హాంక్సునీ ఒక పడవ నిండా సామానుతో న్యూ ఆర్లియన్స్ పంపడానికి నిశ్చయించుకున్నాడు. మంచు కురవడం నిలిచిపోగానే వచ్చి స్ప్రింగ్ ఫీల్డ్‌లో తనను కలుసుకోమని ఆఫట్ వాళ్ళతో చెప్పాడు.

లింకన్‌కి గుర్తుంది: "1831 మార్చి మొదటి తేదీని మేం బయలుదేరాం. అప్పటికి దేశంలో పెద్ద వరద వచ్చి ప్రయాణం అసాధ్యమైపోయింది." అందుచేత మన యువకులు ఒక డింగీ కొని పొంగిపోతూన్న సంగమన్ నది వాలు వెంట బయలుదేరారు. ఆ విధంగా లింకన్ సంగమన్ కౌంటీలో మొట్ట మొదటిసారి అడుగు పెట్టాడు.

స్ప్రింగ్ ఫీల్డు హోటల్లో వాళ్ళు తమ సాహసిక వ్యాపారిని కలుసుకున్నారు. అతను నిశ్చింతగా సారాని సేవించడంతో నిమగ్నుడై యున్నాడు. అయితే వాగ్దానం ప్రకారం అతను ఫ్లాట్ బోటుని ఏర్పాటు చెయ్యలేదు. ఏబ్, జాన్‌స్టన్లు న్యూ ఆర్లియన్స్‌కి సామాను

తీసుకొని వెళ్ళాలంటే పడవని నడపడమే గాక ఆ పడవని కూడా స్వతంత్రంగా తయారు చేసుకోవాలి. "ఇందుకోసం నెలకి ఒక్కొక్కరికి 12 డాలర్ల చొప్పున ఆఫట్ దగ్గిర వాళ్ళు పనికి కుదిరారు; చెట్లు నరికి కలప తెచ్చుకుని పాత సంగమన్ టౌన్‌లో సంగమన్ నది దగ్గర వాళ్ళు పడవ తయారు చెయ్యాలి." లింకన్ మంచి వడ్రంగి పని తెలిసినవాడూ, మంచి వంట పని తెలిసిన వాడూలాగ కనిపిస్తాడు. ఒక నెలంతా కష్టపడి ఎనభై అడుగుల పొడుగూ, పద్దెనిమిది అడుగుల వెడల్పూ గల పడవ తయారుచేశారు. ధాన్యం, పంది మాంసపు ప్యాకెట్లు పడవ మీదికి ఎక్కించారు. అతి కష్టంమీద-నదీ ప్రయాణానికి ఎంత మాత్రం ఒప్పుకోని పెద్ద బలిసిన ముప్ఫై పందుల్ని పైకి ఎక్కించారు. ఇదంతా జరిగేందుకు కొంత కాలంపట్టింది. ఈ లోపుగా వరద తీసేసింది. రట్‌లెడ్జి మిర్‌డాం.దగ్గిరికి వచ్చి పడవ మొట్టని కొట్టుకుని నిలిచి పోవడంతో వాళ్లు పడ్డ శ్రమంతా వృథా అయిపోయింది.

ఇది న్యూసాలెం అనే గ్రామం దగ్గిర జరిగింది. ఇక్కడే లింకన్ యెకాయెకిని ఆరు సంవత్సరాలు గడిపాడు. బరువుతో నిండిన పడవ డాంమీద అతి అపాయకరంగా ఊగులాడుతూ ఉండగా చూచేందుకు నదీతీరం దగ్గిర పోగయిన ఆ ఊరి వాళ్ళంతా ఏబ్‌ని చూసి చాలా ఆశ్చర్యపోయారు. పొడుగైన, చతురస్రంగా పెరిగిన, ఇరవై రెండేళ్ళు అడవుల్లో పెరిగిన ఒక పిల్లవాడు పరిస్థితిని చక్కబరచుకుంటున్నాడు. పైకి ఎగదీసిన నీలపు పంట్లాం, చారల షర్టూ, ఒక విచిత్రమైన హేట్ ధరించిన అతను నీళ్ళల్లో కాళ్ళకి జోళ్ళు లేకుండా ఇటూ అటూ తిరుగుతున్నాడు. ఒక వేపున నీళ్ళు లోపలికి ఎక్కడం వల్ల రెండవ వైపు డాం పైకి తేలిపోయిఉన్న పడవని అతను పరీక్షిస్తున్నాడు.

ఈ ఘటనని జ్ఞాపకం చేసుకుంటూ జాన్ హాంక్స్ అన్నాడు: "మేం పంది మాంసం పెట్టెల్ని ముందుకి దొర్లించాం. డాం పైకి వంగిన పడవ భాగం చివర ఒకే రంధ్రం పొడిచాం. పడవలోని నీరు దానిలోనుంచి బయటికి పోయింది. మేము అపాయాన్ని తప్పించుకున్నాం."

ఈ సందర్భంలో ఎంతో ధైర్యం చూపించి అపాయాన్ని తప్పించినవాడు ఏబ్. రంధ్రం చెయ్యడానికి బరమాని ఊళ్ళోనుంచి అతనే తెచ్చాడు. పడవని నీళ్ళలో ముంచినదీ అతనే. తరువాత రంధ్రం పొడిచి మిల్లు డాం మీంచి తప్పించాడు. ఈ గుంపులో ఈ నాటకం చూసేవారిలో కొందరు స్త్రీలు, పురుషులు ముందు ముందు లింకన్ జీవితంలో చాలా ప్రముఖమైన పాత్రని వహించారని చెప్పాలి! మెంటర్ గ్రాహాం అనే స్కూలు టీచరు అతనికి సర్వే పని నేర్చుకోడంలో సహాయ పడ్డాడు.

క్లారీస్ గ్రోవ్ అనే క్లబ్ సభ్యులకు హీరో అయిన జాక్ ఆరంస్ట్రాంగ్ అనే వస్తాదుని కుస్తీలో ఓడించడంద్వారా ఏబ్ అతనిని తన ప్రాణ స్నేహితునిగాను, భక్తునిగాను చేసుకున్నాడు.

జేమ్సు రట్‌లెడ్జి ఆ సెటిల్‌మెంటు స్థాపకుల్లో ఒకడు; మిల్లు యజమానులో ఒకడు ఊరికల్లా అందగత్తెయైన ఏన్ రట్‌లెడ్జికి వివాదాస్పదుడైన తండ్రి.

జాక్ కెల్‌సో తాగుడన్నా, చేపలు పట్టడమన్నా, షేక్స్పియర్నీ, రాబర్ట్ బర్న్స్‌నీ వల్లించడమన్నా చెవికోసుకునే రకం. అతను లింకన్‌కి అనేక మంచి పుస్తకాలతో పరిచయం కలగజేశాడు.

బౌలింగ్ గ్రీన్ 240 పౌన్లుతూగే ఖులాసాపురుషుడైన ఒకజడ్జి. వ్యతిరేక రాజకీయ పక్షానికి చెందినవాడైనా అతను లింకన్‌కి సాను భూతిని చూపిస్తూ అతనిని బలపరచాడు.

డాం దగ్గిర మన యువనావికుడు తన సమస్యని పరిష్కరించు కుంటూండగా వీళ్ళు, ఇంకా ఇతర గ్రామవాసులూ ఆశ్చర్యంతో చూశారు.

ఈ సందర్భంలో లింకన్ చూపిన తెలివితేటలకి డెనన్ ఆఫట్‌కి అతనియెడల బాగా గౌరవం కుదిరింది. లింకన్‌ని అభిమానించి అతను పైకి రావాలనే ఉద్దేశ్యంతో న్యూ ఆర్లియన్స్‌నించి వచ్చిన తరువాత న్యూ సాలెమ్‌లో ఒక చిన్న దుకాణం పెట్టేందుకు అతన్ని నియోగించాడు.

జాన్‌జాన్‌స్టన్, జాన్‌హాంక్సు, ఏబ్‌లింకన్, డెన్టన్ ఆఫట్లు తిరిగి సంగమన్ నది మీదుగా ఇల్లినాయిస్ నదిని చేరుకున్నారు. అక్కడినుంచి మిస్సిసిపీలో ప్రయాణంచేసి నూ ఆర్లియన్సు జేరు కున్నారు. జాన్‌హాంక్స్ సెంట్‌లూయీ దగ్గిర వెను దిరిగిపోయాడు

ఈ విషయం మనకేమంత ప్రధానమైనదికాదు. అయితే హాంక్స్ కథనం ప్రకారం న్యూఆర్లియన్స్‌లో ఒక బానిసల వేలం పాటలో అబ్రహాం లింకన్ ఒక అందమైన ములట్టో బాలికని అమ్మ డం చూశాడు. అతను చాలా బాధపడి తనకెప్పుడైనా బానిసత్వాన్ని ఖండించే తరుణంలభిస్తే బాగా దెబ్బకొడతానని అన్నాడు. నిజానికి అబ్రహాం లింకన్ బానిసల వేలంపాట చూసిఉంటే బాధపడేవాడు. కోపంకూడ అతనికి కలిగేది న్యూ ఆర్లియన్స్ యాత్రలో అతని కళ్ళు ఇటువంటి ఘటనవల్ల విప్పుకుని ఉండవచ్చు. అయితే జాఞ

పోంక్సు న్యూ ఆర్లియన్స్‌లో లింకన్ వెంట లేనప్పుడు అతని మాట అంత పరిగణనీయంకాదు. లింకన్ ఆ తరవాత అనేక సంవత్సరాలకి గాని బానిసత్వంయెడ తనకి గల అభిప్రాయాల్ని బహిరంగంగా వ్యక్తపరచలేదు.

న్యూ ఆర్లియన్స్‌కి రెండవసారి వెళ్ళివచ్చిన తరువాత ఏబ్ ఇల్లినాయిస్ నుంచి డామ్ ఎగువభాగంలో ఉన్న న్యూసాలెంకి బయలుదేరాడు. సంయుక్త రాష్ట్రభావి అధ్యక్షుడు 100 మందే నా జనసంఖ్యలేని ఒక గ్రామంలోని ఒక చిన్న దుకాణంలో గుమాస్తాగా పనిచెయ్యడానికి అతి కృతజ్ఞతతో తయారయాడు.

# న్యూసాలెమ్, బ్లాక్ హాక్ యుద్ధం

"అప్పుడు నేను న్యూసాలెం చేరుకున్నాను........ అక్కడే నేను ···· ఒక చిన్న దుకాణంలో గుమాస్తాగా చేరాను. ఆ తరవాత బ్లాక్‌హాక్ యుద్ధం వచ్చింది; నన్ను ఒక స్వచ్ఛందసేవక నాయకుడుగా ఎన్ను కున్నారు—అంతవరకూ నాకు లభించిన పదవు లన్నిటికంటె ఇది నాకు ఎక్కువ ఆనందాన్ని ఇచ్చింది."

అబ్రహాం లింకన్

1831 జూలైలో ఏబ్ లింకన్ న్యూ సాలెం చేరుకున్నప్పుడు అతను తనను "ప్రవాహంలో కొట్టుకుపోయే ఒక పుల్ల ముక్క" గా భావించుకున్నాడు. పొలం పని, బండ వడ్రంగం పనీ, పడవలు నడపడం తప్పితే ఆతనికి ఉపయోగ కరమైన వేరు పని ఏదీ తెలియదు. ప్రయత్నం లేని, శిక్షణ లేని అతను ఇంకా నిరుద్దేశ్యంగానే ఉన్నాడు. ప్రత్యేక యోగ్యతలులేని అతనికి ఉత్కృతాకాంక్ష కూడా ఉన్నట్టు కనిపించదు. ఆరేళ్ళ తరువాత అతనా గ్రామం వదలి లా ప్రాక్టీసు కోసం ఇంకొక చోటికి వెళ్ళాడు. అప్పటికి అతను మంచి యువశాసన సభ్యుడుగా ప్రసిద్ధికెక్కి, తనభావి భాగ్యోదయానికి అతి చేరువకి వచ్చాడు. అయితే మనం కథ దాటి ముందుకి పోతున్నాం.

ఏబ్ హడావుడిగా ఉన్న ఆకుగ్రామం చేరుకునే టప్పటికి ఎలక్షన్లు దగ్గిర పడ్డాయి. అనేకమంది చరిత్ర కారులు నమ్మినట్లు



గమత్తయిన కథలు చెప్పి నవ్వించేవాడు

బ్ స్కూలు మేష్టర్ మెంటర్ గ్రహాంకి వోట్లు నిప్పించే విషయంలో హాయపడలేదు. కాని తాను మొదటిసారి ఓటు వేశాడు, అతను తి త్వరలోనే అక్కడివారిని హాస్యప్రసంగాలతోను, కథలతోను వ్వించడం ప్రారంభించాడు. పూజారి లాగూకాలులో ఇరుక్కున్న న్న నల్ల బల్లి కథ చాలా ప్రసిద్ధికెక్కింది.

పొడుగైన, ప్రేమపాత్రుడైన ఈ వ్యక్తి పిల్లిని కూడా నవ్వించ గలడు. చదవడం వ్రాయడం, తెలిసినవాడు కూడాను. అందుచే అతను ఇక్కడ ఇరుగు పొరుగు వారి అభిమానానికి అతి త్వరలోనే పాత్రుడయాడు

కొన్ని వారాలు లింకన్ సామానుకోసం నిరీక్షిస్తూ గడప వలసి వచ్చింది. డెన్‌కున్ ఆఫట్ దుకాణానికి కావలసిన సామాను రేవుకి ఎగుమతి చేస్తానని వాగ్దానం చేశాడు. ఈ తీరుబడి సమయంలో చాలా భాగం లింకన్ ఊరితోనూ ఊరివారితోనూ, పరిచయం సంపాదించడంలో గడిపాడు. జేమ్సు రట్‌లెడ్జి, జాన్ ఎమ్. కామ్‌రన్ రెండేళ్ళ క్రితమే ఈ వలస పల్లెను స్థాపించారు. రంపపు మిల్లుకూడా తమ యాజమాన్యంలో నడుపుతున్నారు. మొదట్లో ఊరంతా కలిసి ఒక డజను ఇళ్ళుగల వీధిగా ఉండేది. ఆక్యాబిన్లన్నీ స్త్రీ పురుషులతోను బల్లలతోనూ కిటకిట లాడుతూ ఉండేవి. తర్వలోనే ఈ ఊరివాళ్ళకి ఒక కమ్మరి, చక్రాలుచేసేవాడు, చెప్పుకుట్టేవాడు, ప్యాకేజీ పెట్టెలు తయారుచేసేవాడు, ఒక ధనికుడైన కలప వ్యాపారి, ఇద్దరు డాక్టర్లు ఏర్పడ్డారు. విల్లియమ్ క్లారీ స్థాపించిన క్లబ్ చాలామందిని ఆకర్షించింది. మెథాడిస్టులూ, బాప్టిస్టులూ కంబర్‌లేన్డ్ ప్రెస్బిటేరియన్లూ స్థాపించుకున్న మత సంస్థలకి సభ్యుల సంఖ్యలో ఇది ఏమాత్రం తీసిపోదు. కాని ఆ క్లబ్‌కి సంబంధించిన కొంతమంది యువక రౌడీలు పై సంస్థల కార్యక్రమాలకి అడ్డుతగిలే పరిస్థితికి రావడం చాలా విచాకరం.

డెనన్ ఆఫట్ తన సరుకులతో న్యూసాలెమ్ చేరుకునేటప్పటికి అతని స్టోర్‌కీపర్ చాలామంది గ్రామస్థులతో మంచి పరిచయం సంపాదించాడు. కాని క్లారీ క్లబ్ రౌడీలకి ఇంకా సరిగా అతని స్తుతువ

తెలియదు. గుర్రపు పందెములు, కుస్తీలు, తాగుడు మొదలైనవాటికి బాగా అలవాటు పడిపోయిన అయువకులు ప్రతీ శనివారం ఇండియన్ల లాగ ఊగులాడుకుంటూ తగాదాకు తయారుగా జొనుకివచ్చే వాళ్ళు. క్లారీక్లబ్ ఆఫట్‌స్టోర్‌కి సరిగ్గా ముప్పై గజాల దూరంలో ఉంటుంది. ముఠాకి న్యూసాలెంలోని ఈ క్లబ్బే ప్రధాన కార్యాలయం. గుర్రాలమీద కాని, నడిచి కాని ఊరికే తిరుగుతూండడం, ఎక్కువ వెడల్పు దూకడం, అందరినీ సవాలు చెయ్యడం, కుస్తీ పట్టడం, ఊరికే కయ్యానికి కాలు దువ్వుతూండడం - వీళ్ళ ముఖ్య కార్యాలు.

ఆఫట్ డాబులరాయడు; పొట్టిగా ఉంటాడు. క్లారీ క్లబ్ సభ్యులెవరైనా అతన్ని కుస్తీలో నిమిషంలో జయించగలరు. అయితే అతను తనగుమాస్తా వాళ్ళలో ఎవరినైనా సరే నిమిషంలో ఓడించగలడని చాటడం ప్రారంభించాడు. అతను ఏబ్ పక్షానలో అయిదు డాలర్లు పందెం ఒడ్డడానికి తయారయాడు. అతని సవాలుకి జవాబుగా ఒక వ్యక్తి నిలబడ్డాడు.

క్లబ్బు ఛాంపియన్ అయిన జాక్ అరమ్ స్ట్రాంగ్ ఇరవై మైళ్ళ చుట్టు పక్కలలో అంత గొప్ప యుద్ధ ప్రవీణుడు, కుస్తీలో నిపుణుడు లేడని ప్రసిద్ధికెక్కాడు. క్రొత్తగా వచ్చిన బలశాలియైన ఏబ్ లింకన్‌కీ, ఓటమి ఎరుగని జాక్ అరమ్ స్ట్రాంగ్‌కి కుస్తీ జరుగబోతోందని న్యూసాలెమంతటా తెలిసిపోయింది. ఉత్సాహంతో ఊరి వారంతా గుమిగూడారు. సారా మొదలుకుని, విచ్చుకత్తుల వరకూ-డబ్బు సరేసరి-పందేలు వేసుకున్నారు.

సుప్రసిద్ధమైన ఈ మల్లయుద్ధం - లింకన్‌కి తరువాత రాజనీతికంగా ఫలితాల నిచ్చిన ఈ కుస్తీ - ఒకానొక శనివారం నాటి



కిందపడి, మీదపడి చివరికి చిత్తుచేశాడు

సాయంత్రం జరిగింది. అతి ఆసక్తితో చూస్తున్న ప్రేక్షకుల మధ్య జాక్, ఏబ్ లు నడుంవరకు విప్పుకున్నారు. ఇద్దరూ కొంతసేపు పట్టు దొరికించుకోవడం కోసం చెలగాటలాడారు. జాక్, ఏబ్ కంటె పొట్టి వాడైనా ఆబోతులా బలిష్ఠంగా ఉన్నాడు. అతని బరువైన భుజాలూ, దండలూ ఎండలో తళ తళ మెరుస్తున్నాయి. ఏబ్ పొడుగైన సామాన్య కండరాలలో రాక్షస బలం, సామర్థ్యం ఉన్నాయి. అయితే ఒక బలిష్ఠ ప్రతిపక్షిని తాను ఎదుర్కొంటూన్న సంగతి అతనికి బాగా తెలుసు.

ఈ పోటీ ఏవిధంగా జరిగిందనే విషయంలో కొన్ని మత భేదాలు ఉన్నాయి. అయితే కొంతసేపు కుస్తీ జరిగిన తరువాత ఏబ్ జాక్ ని పూర్తిగా చిత్తు చేశాడనే విషయంలో మాత్రం అన్ని మతాలు ఏకీభవిస్తున్నాయి. ఇది జరగగానే క్లారీ క్లబ్ ముఠా అంతా ఏబ్ మీదికి విరుచుకు పడింది. ఏబ్ చటుక్కున లేచి నుంచుని తన వీపు గోడకి ఆన్చుకుని వాళ్ళందరితోటీ యుద్ధం చేసేందుకు తాను తయారుగా ఉన్నానని తెలియజేశాడు. అయితే ఒక్కొక్కరే ముందుకి వచ్చి నిలవాలన్నాడు. ఆరమ్ స్ట్రాంగ్ పెద్దమనిషి తరహాతో, (ఆ తరువాత నుంచి అతను నిజంగా పెద్దమనిషిగానే ప్రవర్తించాడు) తన సహచరుల్ని అవతలికి నెట్టేసి, ఏబ్ కి తన చెయ్యి అందించాడు. అతనూ, అతని భార్య హాన్నా ఆఖరివరకూ లింకన్ కి స్నేహితులుగా ఉన్నారు. అతని రాజనీతిక ఉద్యమా అన్నిటిలోనూ వారతన్ని బాగా బలపరచారు. లింకన్ కూడా వాళ్ళకి ఎన్నడూ మరచిపోలేని ఉపకారాలు చేశాడు. లింకన్ పరుగెత్తడంలోనూ, గెంతడంలోనూ, బరువైన సుత్తిని విసరడంలోనూ, సంఘంలోని యువకు లందర్నీ మించగల వాడన్న విషయం తెలియగానే అంతా అతని సమర్థ నాయకత్వాన్ని వెంటనే ఒప్పుకున్నారు. అతను తాగుడు, జూదము మొదలైన

దుర్వ్యసనాలేవీ లేకపోయినా పామర జనంలో కూడా మంచి పలుకుబడి గలవాడయాడు.

సరిహద్దు జనం అతని భౌతిక బలాన్ని మెచ్చుకుంటుంటే, బుద్ధిబలాన్ని అంతకంటె ఎక్కువగా మెచ్చుకుంది. ఊళ్ళో పెద్దలు అయినవారుగురు అతనిలో శరీరబలమే కాక, ఇతర గుణా లనేకం ఉండడం చూశారు. స్కూలు టీచర్ మెంటర్ గ్రహం లింకన్‌కి వ్యాకరణం, గణితం నేర్చుకోడంలో సహాయ పడ్డాడు. చేపలు పట్టడం, పద్యాలు వల్లించడం తప్పితే జీవికకోసం వేరు పరిశ్రమ చెయ్యడానికి ఎంతమాత్రం తయారుగాలేని జాక్ కెల్సో ఏబ్ షేక్స్పియర్ నాటకాలమీద రాబర్ట్ బర్న్స్ కవిత్వంమీద ఆసక్తి కలగజేశాడు. స్థానిక సాహిత్య చర్చాసమితిలో తన గంభీర యుక్తి పూర్ణమైన మొదటి ఉపన్యాసం ఇచ్చే సదవకాశంకూడా లింకన్‌కి అతి త్వరలోనే లభించింది. జేమ్సు రట్‌లెడ్జి, డాక్టర్ ఫ్రాన్సిస్ రెజినీర్ వంటి వ్యక్తులు ఏబ్ వాగ్ధాటికి చకితులయారు. గొప్ప వక్తగా తయారయేందుకు యువక లింకన్‌కి ఇంక కావలసినదల్లా అనుభవమూ, దిద్దుబాటేనని వాళ్ళు తెలుసుకున్నారు.

ఒక్క విషయంలో మాత్రం ఏబ్ పనికిరాడని తేలిపోయింది. ఆఫట్ స్టోర్ విషయంలోనే కాక, ఆ తరువాత కూడా అతను వ్యాపారానికి పనికిరాడన్నది ధ్రువ పడింది. అతని స్నేహ భావాన్నీ న్యాయ శీలాన్నీ అంతా మెచ్చుకునేవారు. కాని లింకన్‌కి క్యాలికో, ఉప్పు, పంచదార, టీ మొదలైన సరుకులు అమ్మడంలో కంటె పుస్తకాలు చదవడంలోనూ, కథలు చెప్పడంలోనూ ఆసక్తి ఎక్కువగా ఉండేది. కొద్ది కాలంలోనే ఆఫట్ స్టోర్ విషయంలో విసుగెత్తి, వేరే వ్యాపారం కోసం ఊరు విడిచి వెళ్ళిపోయాడు. వసంతఋతువు వచ్చేటప్పటికి ఏబ్ నిరుద్యోగి అయాడు.

న్యూసాలెమ్‌లో తను గడిపిన ఆ మొదటి ఏడు మాసాలూ లింకన్‌కి ఆత్మ విశ్వాసాన్ని ఇచ్చి ఉంటాయి. అతనికి అందరితోనూ పరిచయం ఏర్పడింది 1832 మార్చి 9 వ తేదీని తను రాబోయే ఎన్నికలలో రాష్ట్రశాసన సభకి నిలబడుతున్నానని అతను ప్రకటించాడు.

మెంటర్ గ్రాహం తదితరుల సహాయంతో ఏబ్ తన మొట్ట మొదటి రాజనీతిక విధానాన్ని వ్యక్తపరచాడు. అతని మ్యానిఫెస్టో అతి సంతృప్తంగా ఉండే ఉంటుంది. కాని, సంగమన్ కౌంటీ వోట్లను సంపాదించగలిగేటంతటి కట్టు దిట్టంగా ఉండి ఉండదు.

ప్రజాభిమానాన్ని చూరగొన్న ఆండ్రూ జాక్‌సన్‌కి విరుద్ధంగా హెన్రీక్లేని బహిరంగంగా బలపరుస్తూ లింకన్ తన విజ్ఞప్తిలో స్థానిక సమస్యలకి మాత్రమే ప్రాధాన్య మిచ్చాడు. ఋణాల వడ్డీ తగ్గుదల (వోటర్లలో చాలామంది అప్పులో ఉన్నవాళ్ళే), విద్యా విషయిక మైన అభివృద్ధి, నిజానికి ఆ ప్రాంతాల్లో ఒక్క స్కూలు కూడా లేదు) సంగమన్ నదిని చక్కబరచడం ద్వారా రాకపోకల సదుపాయం మొదలైన విషయాలకి అతను ప్రాముఖ్యమిచ్చాడు. 25 నుంచి 30 టన్నుల బరువుమోసే పడవలన్నీ సంగమన్ నదిలో సౌత్‌ఫోర్క్ వరకూ రావడానికి వీలుంటుందని అతని నమ్మకం. అంతా కలిసి వంపుల్నీ, లోపలికి చొచ్చుకున్న భాగాల్నీ సరిచేస్తే నది దానంతట అదే లోతు అవుతుందనే వింతఅభిప్రాయం అతను వ్యక్తపరచాడు. తనను తప్పక బలపరిచే పద్ధతిలో అతనొక పేరాతో తన మొదటి ప్రచార పత్రాన్ని ఈ విధంగా ముగించాడు :

"నేను అతి సాధారణ కుటుంబంలో పుట్టి పెరిగాను...... సజ్జనులైన మీరంతా నన్ను తెరమరుగుననే ఉంచాలని నిర్ణయించే



వాలిన కొమ్మలు నరకడంలో నావికులకు సాయపడుచున్నాడు.

టట్లైతే నే నింతవరకూ అనేక నిరాశల ననుభవించినట్లే దీన్నీ భావి స్తాను. మీ స్నేహితుడు, సహనగరవాసి;

అబ్రిహాం లింకన్

జల మార్గం ద్వారా రాక పోకల ఖర్చు చాలా తక్కువ అనే విషయాన్ని ధ్రువ పర్చడానికా అన్నట్టు 'టాలిస్‌మన్' అనే పేరుగల ఒక చిన్న స్టీమ్‌బోటు కెప్టెన్ విన్సెన్ట్‌బోగ్ ఛార్టర్ నను సరించి సెంట్‌లూయీ నుంచి సామాను తీసుకురావడానికీ, వెళ్ళ డానికీ వస్తోందని ప్రకటించారు. దీనితో న్యూసాలెమ్, దాని చుట్టు పక్కల గ్రామాల వాళ్ళు ఒక్కసారిగా ఆనంద సముద్రంలో

మునిగి పోయారు. ఈ బోటు సెంటు లూయీ నుంచి స్ప్రింగ్ ఫీల్డు నగరానికి ఉత్తరంగా ఆరుమైళ్ళ దూరంలో ఉన్న రేవుదాకా సంగమన్ నదిలో తిరుగుతుంది. 100 పౌన్ల బరువుకి ముప్ఫై ఏడు న్నర సెంట్లు మాత్రమే ఛార్జి చేస్తారు. వర్తకులు ఇప్పుడు మెట్ట మార్గం ద్వారా ఇందుకు రెట్టింపు ఖర్చు పెట్టవలసి వస్తోంది. ఇల్లినాయిస్ సరిహద్దునుంచి సరుకులూ, పంట పదార్థాలూ ఇంత వౌకగా రాక పోకలు సాగించగలగడం వర్తకులకీ, వ్యవసాయదారులకీ కొండెక్కినంత సంతోషమైంది.

మెలికలు తిరిగిన సంగమన్ నదిలో ప్రయాణం చేసే ఆ బోటుకి ముందు గడలు, కొంకి కర్రలు, పెద్ద గొడ్డళ్ళు పుచ్చుకుని నదిలో కొట్టుకువచ్చే పుల్లల్ని నరుకుతూ, దారి శుభ్రపరుస్తూ బయలు దేరిన వ్యక్తులకి శాసన సభ్యార్థియైన ఏబ్ లింకన్ నాయకత్వం వహించాడు. గట్టుమీద వీళ్ళకు ప్రోత్సాహాన్ని కలుగజేస్తూ వచ్చిన నగర వాసులలో గుర్రం మీద వచ్చిన ఒక పదమూడేళ్ళ కుర్రవాడు "బిల్లీ" హెర్న్డన్ అనేవాడు ఉన్నాడు. తరువాత తరువాత ఆ కుర్రవాడే లింకన్‌కి మూడవ సహాయక వకీలుగాను, అతని జీవిత చరిత్ర రచయితగాను, అతని భక్తుడుగాను ప్రసిద్ధికెక్కాడు. టాలిస్ మన్ మార్గాన్ని సరిచేస్తూ వచ్చిన ఆ పరశుధారులకు ఏబ్ నాయకత్వం వహించిన ఆ ఘట్టాన్ని అతడు ఎన్నడూ విస్మరించలేదు.

బ్రహ్మాండమైన స్వాగతంపొంది స్టీమ్‌బోటు సరుకుల్ని విడుదల చేసి, నది వాలు ప్రవాహంలో తిరుగు ప్రయాణం సాగించింది. అయితే వరద పూర్తిగా తగ్గిపోయింది. ఈ తిరుగు ప్రయాణంలో సహానావికుడుగ పని చేసిన లింకన్ అత్యంత పరిశ్రమచేసి ఈ యాత్ర ను నిర్విఘ్నంగా సాగించాడు.

టాలిస్‌మన్ రాక సందర్భంలో కలిగిన ఉత్సాహ సంరంభం ఇంకా తగ్గిందో లేదో, ఇంకొక గందరగోళం ఏర్పడింది. ఈ దెబ్బతో పల్లెపట్టులన్నీ భయోత్పాతాలతో కంపించాయి. సాక్, ఫాక్సు అనే అడవిజాతుల యుద్ధ నాయకుడు బ్లాక్ హాక్ తన బలాల్ని సమకూర్చుకుంటున్నాడు.

దాదాపు నాలుగు వందల సాయుధులైన ఇండియన్లు కయ్యానికి కాలు దువ్వారు. మిస్సిసిపీనదిని దాటి ఇల్లినాయిస్‌లోనూ విస్‌కాన్‌సిన్‌లోనూ ఉన్న ప్రాచీన ఇండియన్ క్షేత్రాలనుంచీ గ్రామ భూములనుంచీ తెల్ల వలసదారుల్ని తరిమివెయ్యడానికి ముందుకు వస్తున్నారు.

నిజానికి ఈ జాతుల వీర వృద్ధనాయకుడు దయాపాత్రుడని చెప్పాలి. అతి ప్రాచీన కాలంనుంచీ అతని ప్రజల హక్కు భుక్తాలలో ఉన్న మంచి పంట భూములనుంచి వాళ్లను వెళ్లగొట్టారు. ఇలా బ్లాక్ హాక్: వాదించాడు, "భూమిని అమ్మడం మహాపాపమనినా అంతరాత్మ ప్రబోధిస్తోంది. సర్వశక్తిమంతుడైన భగవంతుడు తన బిడ్డలకి అనుభవించమని దాన్ని ప్రసాదించాడు. అది వారి స్వాధీనంలో సాగుబడి చేయబడుతూన్నంత వరకు దానిమీద వారికి జన్మ హక్కు ఉంటుంది. ఒకచోటి నుంచి ఇంకొక చోటికి కదపడానికి వీల్లేని వస్తువుల్ని ఎప్పుడూ అమ్మకూడదు."

కాని బ్లాక్ హాక్ ఇంతకుముందు చేసుకున్న సంధి నియమాలని వ్యతిరేకించాడు అతని పక్షంలో ఎంతవరకూ న్యాయం ఉందో మనం చెప్పలేం కాని వలసవాసులను గుండు దెబ్బల కెరచెయ్యడం ద్వారాను, వాళ్ళని గొడ్డళ్ళతో కొట్టి, తలమీది చర్మం ఒలిచి అనేక ఘాతుక కృత్యాలు చెయ్యడం ద్వారాను అతను భయోత్పాతాలు కలిగించాడు.

ఉత్తర ఇల్లినాయిస్‌లోని మారుమూల వలస ప్రదేశాలనుంచి ఆయుధ సహాయం కోరుతూ దూతలు వస్తున్నారు. ఇల్లినాయిస్ గవర్నరు విజ్ఞప్తి ననుసరించి వాలంటీర్లు గబగబా పోగయారు వోట్ల ద్వారా లింకన్ ఒకగుంపుకి నాయకుడుగా ఎన్నిక అయాడు. అతనికి ఇదివరకే భక్తులుగా తయారైన క్లారీ క్లబ్ యువకులంతా అతనికి ఈ పదవి రావడానికి తోడ్పడ్డారు. అందుకు తగినట్లుగా జాక్ ఆరమ్. స్ట్రాంగ్ ఏబ్‌కి మొదటి సార్జంటు అయాడు.

లింకన్, తదితరులూ కూడా ఈ వాలంటీర్ దళంలోని అనుభవ హీనతని గూర్చి చాలా నవ్వు పుట్టించే కథలు చెప్పేవారు. అతని కింది వాలంటీర్లు బండతనంగా ఉండేవారు. గడ్డం చేసుకునే వారు కారు. క్రమ శిక్షణకు లొంగేవారుకారు. తన ఆజ్ఞల్ని పరిపాలించని ప్రతివాడితో కుస్తీ పడతానని భయపెట్టి ఏబ్ వాళ్ళని వరుసలో నుంచునేట్లు చేసేవాడు. అయితే లింకన్‌కి కూడ స్వయంగా డ్రిల్లుకి సంబంధించిన మాటలు తెలియవు. ఒకసారి అతని దళం ఒక ఇరుకుగేటు దగ్గిరికి చేరుకుంది. "చివరినుంచి" అనేమాట అతనికి తెలియక పోవడంవల్ల అతను ఈ విధంగా ఆజ్ఞాపించాడు: "ఆగండి! ఈ దళం రెండు నిమిషాలపాటు విడిపోతుంది. గేటుకి అవతల మళ్ళీ వరుసలో నిలుస్తుంది."

లింకన్ కాని, అతని దళంవారు కాని బ్లాక్ హాక్ సైన్యాన్ని చూడనేలేదు. యుద్ధ సూచకంగా ఒక గుండు మ్రోతకూడ వినలేదు. ఒకసారి ఒక ఇండియన్ ప్యాస్ తీసుకుని ఏదో పనిమీద. తెల్లవాళ్ళవలసలోకి వచ్చాడు. అతన్ని సైనికులు చంపడానికి తయారైతే లింకన్ అతన్ని రక్షించాడు. కెల్లాగ్స్‌గ్రోవ్ దగ్గిర ఇంతకుముందు జరిగిన యుద్ధంలో చనిపోయిన అయిదుగురు సైనికులకు అతను, అతని

దళంవాళ్ళూ అంత్యక్రియలు జరిపారు. ఉదయ సూర్యుని ఎర్రని కాంతి తమమీద పడుతూండగా నేల మీదపడి ఉన్న ఆ చనిపోయిన సైనికుల్ని చూసిన ఆ నాటి అనుభవాన్ని లింకన్ ఎన్నటికీ మరచి పోలేదు. "ప్రతివ్యక్తి తలమీదా ఒక ఎర్రని మచ్చ ఉంది. ఇండి యన్లు అక్కడి చర్మాన్ని బలవంతంగా ఒలిచేశారు. అతిభయంకర మైన, జుగుప్సాకరమైన ఆదృశ్యం ఎర్రని సూర్యకాంతిలో ఇంకా భయావహంగా ఉంది. ఒక వ్యక్తి లేడి చర్మపు పంట్లాం ధరించి ఉన్నట్టు నాకు జ్ఞాపకం."

ఈలోపుగా వృద్ధ బ్లాక్‌హాక్‌ని మోసపుచ్చి ఓడించడం, పట్టు కోడం జరిగాయి. వాషింగ్‌టన్ (డి. సి.) కి తీసుకుని వచ్చాక అతను అతి గర్వంగా ప్రెసిడెంటు ఆండ్రూ జాక్‌సన్‌కి ముఖాముఖిగా నిల బడి అన్నాడు "నేను ఒక మనిషిని. నీవూ ఒక మనిషివి. నా జాతి ప్రజలు ఇంతవరకూ అనుభవించిన కష్టాలు దుర్భరమై పగ తీర్చుకో డానికే నేనీ గొడ్డలిని పట్టుకొన్నాను. ఇంకా వారి కష్టాల్ని చూస్తూ నేనూ ఊరుకుని ఉంటే నా ప్రజలులో 'బ్లాక్‌హాక్ చాలా ముసిలివాడై పోయాడు. అతను మన నాయకుడుగా ఉండడానికి తగడు. అతను శాక్ జాతివాడే కాదు' అనేవారు."

లింకన్‌ని దక్షిణ విస్‌కాన్‌సిన్ నుంచి పంపారు అతని గుర్రం దొంగిలించ బడడంవల్ల అతను న్యూసాలెంకి పడవమీదా, కాలి నడకనూ రావలసి వచ్చింది.

చాలా ఏళ్ళ తరువాత డెమొక్రాటిక్ అభ్యర్థి లూయీ కేస్‌ని ఖండిస్తూ, అతని సైనికానుభవాల్ని గూర్చి వ్యంగ్యంగా తన ఉపన్యా సంలో ఈ విధంగా అన్నాడు:

"అన్నట్టు, స్పీకర్‌గారూ నేను సైనిక వీరుణ్ణి! అనే విషయం మీకు తెలుసా? అవునండోయి, బ్లాక్‌హాక్ యుద్ధం సమయంలో

నేను యుద్ధం చేశాను. దెబ్బతిన్నాను. పారిపోయి వచ్చాను. జనరల్ కేస్‌ని గూర్చి మాట్లాడుతూంటే నా సంగతి జ్ఞాపకం వస్తోంది. నేను నా ఖడ్గాన్ని విరక్కొట్టుకో లేదన్నది నిజమే! ఎందుచేతనంటే నాకు కత్తి లేదు. అయితే ఒక సారి మాత్రం నేనొక తుపాకీని పూర్తిగా వంచేశాను... నీలి బెర్రీలు ఏరడంలో జనరల్ కేస్ నన్ను మించితే, అడవి ఉల్లిపాయల్ని దంచడంలో నే నతన్ని మించాను. నిజానికి బతికిఉన్న ఎర్ర యిండియన్ వీరుల్ని నేను చూడలేదు, అతనూ చూడలేదు."

లింకన్ న్యూసాలెం తిరిగి వచ్చాడు అయితే అతను దేశానికి చేసిన ఈస్వల్ప సేవ రాష్ట్ర శాశన సభ ఎన్నికకు అతను చేసుకున్న ప్రచారంలో ఏమీ ఉపయోగపడ్డట్టు కనిపించదు. తన అభ్యర్థిత్వాన్ని బలపరచమని ప్రచారం చేసుకోడానికి ఇంకెంతో వ్యవధి లేదు. ఏబ్ ఈ సందర్భంలో పల్లె పట్టులకు వెళ్ళి వ్యవసాయ దార్లతో మాట్లాడుతూ, కోతలలో వాళ్ళకు సహాయపడ సాగాడు. అప్పుడప్పుడు చిన్న ఉపన్యాసాలు కూడా ఇచ్చేవాడు. పాప్స్‌విల్‌లో అతను ఒక పశువుల వేలం పాటలో మాట్లాడుతూండగా తన ఉపన్యాసాన్ని కొంతసేపు ఆపి, ఒక రౌడీని బలవంతాన గుంపులోనుంచి బయటికి అతను తరుమవలసి వచ్చింది. తిరిగి ఉపన్యాస వేదిక మీదికి వచ్చాడు. ఇటువంటి సందర్భాల్లో అతను విచిత్రమైన తోకలతో కూడిన ఒక కోటూ, - లినెన్ పంట్లాం (అది చాలా పొట్టిగా ఉండేది,) ఒక గడ్డి టోపీ (దానికి పటకా ఉండేదికాదు). ధరించేవాడు. అతని ఉపన్యాస అతి క్లుప్తంగా ఉండేది. రాజనీతిజ్ఞులందరికీ ఉపయోగించే ఒరవడి ఉపన్యాసమది :

"పౌరులారా! నే నెవరినో మీ అందరికీ బాగా తెలుసు ననుకుంటాను. నేను మీ అబ్రహాం లింకన్‌ని. మిత్రుల ప్రోద్బలంవల్ల నేను

దళంవాళ్ళూ అంత్యక్రియలు జరిపారు. ఉదయ సూర్యుని ఎర్రని కాంతి తమమీద పడుతూండగా నేల మీదపడి ఉన్న ఆ చనిపోయిన సైనికుల్ని చూసిన ఆ నాటి అనుభవాన్ని లింకన్ ఎన్నటికీ మరచి పోలేదు. "ప్రతివ్యక్తి తలమీదా ఒక ఎర్రని మచ్చ ఉంది. ఇండి యన్లు అక్కడి చర్మాన్ని బలవంతంగా ఒలిచేశారు. అతిభయంకర మైన, జుగుప్సాకరమైన ఆదృశ్యం ఎర్రని సూర్యకాంతిలో ఇంకా భయావహంగా ఉంది. ఒక వ్యక్తి లేడి చర్మపు వంట్లాం ధరించి ఉన్నట్టు నాకు జ్ఞాపకం."

ఈలోపుగా వృద్ధ బ్లాక్‌హాక్‌ని మోసపుచ్చి ఓడించడం, పట్టు కోడం జరిగాయి. వాషింగ్‌టన్ (డి. సి.) కి తీసుకుని వచ్చాక అతను అతి గర్వంగా ప్రెసిడెంటు ఆండ్రూ జాక్‌సన్‌కి ముఖాముఖిగా నిల బడి అన్నాడు "నేను ఒక మనిషిని. నీవూ ఒక మనిషివి. నా జాతి ప్రజలు ఇంతవరకూ అనుభవించిన కష్టాలు దుర్భరమై పగ తీర్చుకో డానికే నేనీ గొడ్డలిని పట్టుకొన్నాను. ఇంకా వారి కష్టాల్ని చూస్తూ నేనూ ఊరుకుని ఉంటే నా ప్రజలులో 'బ్లాక్‌హాక్ చాలా ముసలివాడై పోయాడు. అతను మన నాయకుడుగా ఉండడానికి తగడు. అతను శాక్ జాతివాడే కాదు' అనేవారు."

లింకన్‌ని దక్షిణ విస్‌కాన్‌సిన్ నుంచి పంపారు. అతని గుర్రం దొంగిలించ బడడంవల్ల అతను న్యూసాలెంకి పడవమీదా, కాలి నడకనూ రావలసి వచ్చింది.

చాలా ఏళ్ళ తరువాత డెమోక్రాటిక్ అభ్యర్థి లూయీ కేస్ ని ఖండిస్తూ, అతని సైనికానుభవాల్ని గూర్చి వ్యంగ్యంగా తన ఉపన్యా సంలో ఈ విధంగా అన్నాడు:

"అన్నట్టు, స్పీకర్‌గారూ నేను సైనిక వీరుణ్ణి! అనే విషయం మీకు తెలుసా? అవునండోయి, బ్లాక్‌హాక్ యుద్ధం సమయంలో

నేను యుద్ధం చేశాను. దెబ్బతిన్నాను. పారిపోయి వచ్చాను. జనరల్ కేస్‌ని గూర్చి మాట్లాడుతూంటే నా సంగతి జ్ఞాపకం వస్తోంది. నేను నా ఖడ్గాన్ని విరక్కొట్టుకో లేదన్నది నిజమే! ఎందుచేతనంటే నాకు కత్తి లేదు. అయితే ఒక సారి మాత్రం నేనొక తుపాకీని పూర్తిగా వంచేశాను... నీలి బెర్రీలు ఏరడంలో జనరల్ కేస్ నన్ను మించితే, అడవి ఉల్లిపాయల్ని దంచడంలో నే నతన్ని మించాను. నిజానికి బతికిఉన్న ఎర్ర యిండియన్ వీరుల్ని నేను చూడలేదు, అతనూ చూడలేదు."

లింకన్ న్యూసాలెం తిరిగి వచ్చాడు. అయితే అతను దేశానికి చేసిన ఈస్వల్ప సేవ రాష్ట్ర శాశన సభ ఎన్నికకు అతను చేసుకున్న ప్రచారంలో ఏమీ ఉపయోగపడ్డట్టు కనిపించదు. తన అభ్యర్థిత్వాన్ని బలపరచమని ప్రచారం చేసుకోడానికి ఇంకెంతో వ్యవధి లేదు. ఏబ్ ఈ సందర్భంలో పల్లె పట్టులకు వెళ్ళి వ్యవసాయ కార్లతో మాట్లాడుతూ, కోతలలో వాళ్ళకు సహాయపడ సాగాడు. అప్పుడప్పుడు చిన్న ఉపన్యాసాలు కూడా ఇచ్చేవాడు. పాప్స్‌విల్‌లో అతను ఒక పశువుల వేలం పాటలో మాట్లాడుతూండగా తన ఉపన్యాసాన్ని కొంతసేపు ఆపి, ఒక రౌడీని బలవంతాన గుంపులోనుంచి బయటికి అతను తరుమవలసి వచ్చింది. తిరిగి ఉపన్యాస వేదిక మీదికి వచ్చాడు. ఇటువంటి సందర్భాల్లో అతను విచిత్రమైన తోకలతో కూడిన ఒక కోటూ, - లినెన్ పంట్లాం (అది చాలా పొట్టిగా ఉండేది,) ఒక గడ్డి టోపీ (దానికి పటకా ఉండేదికాదు). ధరించేవాడు. అతని ఉపన్యాస అతి క్లుప్తంగా ఉండేది. రాజనీతిజ్ఞులందరికీ ఉపయోగించే ఒరవడి ఉపన్యాసమది :

"పౌరులారా! నే నెవరినో మీ అందరికీ బాగా తెలుసు ననుకుంటాను. నేను మీ అబ్రహాం లింకన్‌ని. మిత్రుల ప్రోద్బలంవల్ల నేను

శాసన సభకి నిలబడ్డాను. నా రాజకీయాలు అతి సంక్షిప్తంగా సరళంగా వృద్ధ స్త్రీ నాట్యంలా ఉంటాయి. నేను జాతీయ బ్యాంక్ ఉంచాలని కోరేవాడిని. అంతర రాష్ట్రీయాభివృద్ధి విధానాన్ని నేను బలపరుస్తున్నాను. ఎగుమతి దిగుమతులకు రక్షణ ఉండాలని నా అభిప్రాయం. ఇవి నాభావాలు; రాజనీతిక సిద్ధాంతాలు. నన్ను మీరంతా ఎన్నుకుంటే కృతజ్ఞుణ్ణి; లేక పోయినా అంతే!"

లింకన్ ఎన్నికష్టాలలో ఓడిపోయాడు. అతని జీవితంలో ప్రజల బహిరంగపు వోటు ద్వారా ఓడి పోయిన ఘట్టం ఇదొక్కటే! అయితే అతని ప్రాంతంలో 277 వోట్లతో అతను గెలిచాడనే మనం భావించాలి. ప్రతి కక్షికి 7 వోట్లు మాత్రమే వచ్చాయి. అతను న్యూసాలెంలో అతిప్రసిద్ధ వ్యక్తి, తన దళానికి నాయకుడు. 1832 గ్రీష్మంలో అతని ఈ ఓటమియెడ సానుభూతితో వారంతా ఏబ్ లింకన్‌ని ప్రేమతో ఓదార్చారు.

# రకరకాల ఉద్యోగాలు..

"స్టోరు కన్నుమూసింది"

అబ్రహాం లింకన్

తరువాత ఐదు సంవత్సరాలు లింకన్ స్టోర్ కీపర్‌గానూ, పోస్టు మాష్టరుగానూ, సర్వేయర్‌గానూ, రాష్ట్ర శాసన సభ్యుడుగానూ, కొత్తగా లైసెన్సు పొందిన లాయర్‌గానూ పని చేశాడు. మొదటి దానిలో తప్ప మిగిలిన వాటన్నిటిలోనూ అతను రాణించాడు. ఏది ఎలాగున్నా, స్టోరు విషయంలో అతని వ్యాపార సంబంధాలు చాలా దురదృష్టవంతంగా పరిణమించాయి. దమ్మిడీ చేతిలో లేకుండా ప్రారంభించి, 1837 లో న్యూసాలెం నుంచి స్ప్రింగ్ ఫీల్డుకి బయలుదేరేనాటికి అతను సుమారు 1,000 డాలర్లు అప్పు పడ్డాడు.

వ్యాపారిగా ఉండాలనే కోరిక ఎందుకు కలిగింది.? బహుశః ఇండియానా తిరిగి వెళ్ళిపోయిన జేమ్సు జెన్ట్రీకి సంఘంలోని గౌరవ స్థానం చూసి వ్యామోహపడి ఉంటాడు. నిస్సందేహంగా అతను గల్లాపెట్టె దగ్గర కూచుని ఇరుగు పొరుగువారితో పరిచయం చేసుకుంటూండడంలోనూ, వారికి కథలు చెప్పడంలోనూ చాలా ఆనందం అనుభవించి ఉంటాడు. అన్నిటికంటె ముఖ్యంగా ఇక్కడ శారీరక పరిశ్రమ అవసరం ఉండదు. తన తలపైగా గోడకి కాళ్ళు ఆన్చి



చిల్లర దుకాణంలో అమ్మేవాడి ఉత్తణం.

నరాలు కనిపించే మొరటు బారిన తన పెద్ద చేతులకు అంకిన ప్రతి పుస్తకమూ కౌంటర్ మీద పడుకుని విశ్రాంతిగా చదువుకుంటూండేవాడు.

సంవత్సరాల తరువాత తనని అత్యంత ఆదరాభిమానాలతో చూసిన న్యూసాలెం స్నేహితులమధ్య ఉండాలనే తాను కోరుతున్నట్టు లింకన్ అన్నాడు కమ్మరి పని నేర్చుకోవాలని ఒకప్పుడు అతను అనుకునేవాడు. లా చదువుదామని అనుకునేవాడు. కాని, పెద్ద చదువు లేనిదే అందులో రాణించడం కష్టమని మళ్ళీ సందేహించేవాడు.

పనేమీలేక, శరీరాన్ని ఎలాగో రక్షించుకునే అవసరంలో ఉన్న తనవంటి ఇంకొక బీదవానికీ అప్పు పద్ధతి మీద కొంత పాత సరుకు అమ్ముతానంటూ తయారై, నిజంగానే అమ్మిన ఒక వ్యక్తిని చూసి లింకన్ నిజానికి చాలా ఆశ్చర్యపోయాడు. ఇద్దరూ కలిసి వర్తకులయారు. కాని వాళ్ళంతకంతకీ అప్పులపాలై పోవడం తప్ప చేసింది వేరే ఏం లేదు.

ఈ విధంగా కన్ను మూసిన స్టోరునిగూర్చి చాలామంది అనేకసార్లు పేర్కొన్నారు. ఈకథ చాలా ప్రసిద్ధికెక్కింది. నిజమైనదికూడాను: ఏబ్, అతని భాగస్థుడు విలియం ఎఫ్. బెర్రీ త్వరలోనే విచిత్రమైన వర్తకుల జంటగా తేలారు. విస్కీ బ్యారెల్‌లోనుంచి బెర్రీ బాగా తప్పతాగేవాడు. లింకన్ తన పుస్తకాల నిషాలో ఉండేవాడు ఇద్దరూ కలసి కొద్ది నెలల్లోనే వ్యాపారాన్ని పూర్తిగా నాశనం చేసి పారేశారు. కాని న్యాయబుద్ధి గల ఏబ్ నెత్తిమీదే అప్పులన్నీ వచ్చి పడ్డాయి. ఎవరి దగ్గరైనా ఒక పైసా ఎక్కువ పుచ్చుకుంటే అనేక మైళ్ళైనా నడిచి వెళ్ళి అది తిరిగి ఇచ్చేసే ఏబ్ అప్పుడీ అప్పులు తీర్చ

కుండా ఎలా ఉండగలడు? అనేక సంవత్సరాలు పరిశ్రమచేసి అతనా అప్పులన్నీ పైసా బాకీలా తీర్చేశాడు.

తను భోజనం చేస్తూన్న రట్లెడ్జి హోటల్ ఖర్చులు తీర్చేందుకు కలప దుంగలు తెగగొట్టడం, ధాన్యం దంచడం, ఏ.వై. ఎల్లిస్ నడిపే స్టోరులో లెక్కలు వ్రాయడం వంటి ఏ పనైనా సరే చేసేందుకు లింకన్ ఏమాత్రం వెనుదీయలేదు. 1833 మే 7 వ తేదీని అతను న్యూసాలెం పోష్టుమాస్టరయాడు. ఈ ఉద్యోగం వల్ల అతనికి ఏడాదికి ఏభై, లేక డెబ్భైయైదు డాలర్లు ముట్టేవి. అయితే ఊరిలోని చందాదార్లకి వచ్చే పేపర్లన్నీ చదివే సదుపాయం కూడా లభించింది.

ఇండియానా తిరిగి వచ్చాక అక్కడి వారంతా ఏబ్ని ఒక న్యూస్ బాయ్గా చూసేవారు. తను అతి ఆప్యాయంగా చదివిన పేపర్లలోని వార్తలన్నీ అతను ఏకధాటీని ఏకరువు పెట్టేవాడు. ప్రపంచాన్ని గూర్చి, జాతీయ వ్యవహారాల్ని గూర్చి, రాజకీయ సమస్యల్ని గూర్చి తాజా వార్తలు తెలుసుకోడానికి లింకన్ చాలా ఆతురతగా ఉండేవాడు. అందుకోసం అతను సెంట్ లూయిస్ నుంచి వచ్చే రిపబ్లికన్, లూయిస్విల్ జర్నల్, వాషింగ్టన్ నుంచి వచ్చే 'నేషనల్ ఇన్ టెల్లిజన్సర్' స్ప్రింగ్ ఫీల్డు నుంచి వెలువడే 'సంగమో జర్నల్' మొదలైన న్యూస్ పేపర్లు దీక్షగా చదివేవాడు. న్యూసాలెమ్లో అతను తరుచు పెద్ద గుంపు మధ్య ఏదో పేపరు పైకి గట్టిగా చదువుతూ కనిపించేవాడు. చందాదారు పోష్టాఫీసుకి వచ్చి ఇది నా పేపరనిచెప్పి తీసుకొని పోయేవరకూ ఆ పేపరు సద్వినియోగ పడుతూనే ఉండేది.

తను ఎప్పుడైనా ఆ తోవని వెడుతూ ఉంటే తనకి వీలయినప్పుడు కొంతమందికి ఉత్తరాల్ని లింకన్ స్వయంగా తీసుకువెళ్ళి

ఇచ్చేవాడు. ఇలా చెయ్యడంలో అత నొక విధమైన ఆనందాన్ని అనుభవించేవాడు. అతను ఈ ఉత్తరాల్ని తన టోపీలో పెట్టుకుని తీసుకు వెళ్ళేవాడు. అతని టోపీలో పట్టని వస్తు వంటూ లేదు. తరువాత తరువాత కోర్టు సంబంధమైన కాగితాలూ, రకరకాలైన ఉత్తర ప్రత్యుత్తరాలూ, ఇంకా అతనికి అర్జెంటుగా అవసరమైన వస్తువులెన్నో అందులో ఇరికేవి. అతను ఎవరైనా స్త్రీ ఎదురైనప్పుడు తన టోపీని గౌరవసూచకంగా పైకెత్తవలసి వచ్చినప్పుడు చాలా జాగ్రత్తగా ఉండేవాడు. ఏమాత్రం అజాగ్రత్తగా ఉన్నా టోపీలో ఉన్న కాగితాలన్నీ చెల్లా చెదరై పోతాయని అతని భయం!

మనం ధన సంపాదన దృష్టితో చూస్తే నిజానికి యువ అబ్రహాం లింకన్ న్యూసాలెమ్‌లో లతులు గడించిం దేమీ లేదు. అయితే అతను ఇంకొకరకమైన ధనాన్ని ఆర్జించాడు. వ్యాకరణం, గణితం, ఆ తరువాత సర్వేపనిలో ప్రాథమిక సూత్రాలు, న్యాయ శాస్త్ర సిద్ధాంతాలు మొదలుగా గల విద్యాధనం పోగుచెయ్యడంలో అతను సఫలుడయాడు.

అబ్రహాం లింకన్‌ని అతని భావి జీవితానికి యోగ్యుడుగా తయారుచేయడంకోసమే న్యూసాలెమ్ గ్రామం గారడీవిద్య ద్వారా చిత్రంగా నిర్మించబడిందా అన్నట్టు కనిపిస్తుంది. లింకన్ రావడానికి రెండేళ్ళముందే ఈ గ్రామం ఏర్పడింది. మళ్ళీ అతను ఆ ఊరు విడిచి వెళ్ళిన రెండేళ్ళకే అది మ్యాపులోనుంచి మాయమైపోయింది. ఎవరో మంత్రగాడు మంత్రదండం తిప్పడంతో సంగమన్ తీరంలో కొన్ని బల్లచెక్కల యిళ్లు వెలిశాయా అనిపిస్తుంది. (షేక్స్పియర్ నాటకం టెంపెస్టులో లాగ మంత్రదండం తిప్పగానే ఎక్కడో గాలిలోనుంచి పాత్రలు పుట్టుకొచ్చినట్టు కనిపిస్తుంది. ఎప్పుడో తీరుబడిసమయంలో జాక్ కెల్సో లింకన్‌కి ఈ టెంపెస్టు నాటకం చదివి వినిపించి ఉండవచ్చు.

న్యూసాలెంలోని తమ చెక్క యిళ్ళలో నివసించే ఈ పాత్రలు లింకన్ నాటకంలో నిజానికి సత్యమైనవే! ఏబ్ జీవితంలో ప్రముఖ పాత్రలను నిర్వహించాయి కూడాను. ఉదాహరణకి సంగమన్ మండలపు సర్వేయరైన జాన్‌కాల్హౌన్ లింకన్‌ని తన సహాయకుడుగా ఏర్పరచుకుని పొలాల గట్లు సరిచేయడం, నగరాల ప్లాన్లు వెయ్యడం, కొత్తరోడ్లు నిర్మించడం మొదలైన పనులన్నీ నేర్పాడు. ఏబ్ ఆ వృత్తికి సంబంధించిన విషయాలు ఏమీ ఎరగడు. అందుచేత అతను స్కూలు టీచరైన మెంటర్ గ్రాహాం దగ్గిర ఉంటూ ఫ్లిన్ట్ రచించిన సిష్టం ఆవ్ జ్యామెట్రీ... (సర్వేయింగుకి సంబంధించిన వివరాలతో) అన్న పుస్తకం రాత్రిళ్ళు చెప్పించుకునేవాడు. గ్రాహాం భార్య సారా తన భర్తా లింకనూ నెగడు దగ్గిర కూర్చుని గొడవగా మాట్లాడు కుంటూండడం వల్ల తనకి తెల్లవార్లూ నిద్రలేకుండా పోతోందని అందరితోటీ చెప్పుకుని యాగీ చేసేది!

చాలా ఏళ్ళ తరువాత - గ్రహాం టీచరుగా తను పని చేసిన దీర్ఘకాలంలో లింకన్‌లాగ అంత శ్రద్ధగా విద్య నేర్చుకున్న వ్యక్తినిం కొకరిని ఎరగననీ, అతను చదువుచెప్పిన అయిదువేల మంది స్కూలు పిల్లలలో ఇంత గొప్ప సాధకుడు, విద్య నేర్వడంలోను, సాహిత్య సాధనలోను కుదురుగా ఉండి ఇంత పరిశ్రమచేసిన పిల్లవాడు ఇంకొ కడులేడనీ చెప్పేవాడు.

త్వరలోనే **లింకన్** కంపాసూ, గొలుసూ పట్టుకొని రకరకాల పొదలనీ, విషవృక్షాలనీ దాటుకుంటూ దుబ్బు గడ్డిని తొక్కుకుంటూ పెద్ద పెద్ద చెట్లతో నిండిన అడవుల్ని కొలవడం మొదలెట్టాడు, మధ్య ఇల్లినాయిస్ గ్రామాలూ రోడ్లూ పొలాలూ సర్వేచెయ్యడానికి అతను బురదతో నిండిన మైదానాల్లో తిరుగసాగాడు. ఈ పనిలో అతనికి క్వార్టర్ సెక్షన్ (నూట అరవై ఎకరాలు) కొలవడానికి రెండు

న్నర డాలర్ల చొప్పున దొరికేది. ఇదికాక రోజుకి రెండు డాలర్లు ఖర్చులకుగాను ఇచ్చేవారు అయితే ఈ మొత్తం రొక్కంరూపంగాగాని అప్పుడప్పుడు వస్తురూపకంగా గాని ముట్టేది. అతను మొదటి సారిగా పనిచేసినప్పుడు అతనికి రెండు లేడి చర్మాలు బహుమానంగా దొరికాయి. ఇవి ముళ్ళకి, పొదలకి తగిలి చిరిగిపోకుండా జాక్ భార్య హన్నా ఆర్మ్‌స్ట్రాంగ్ వాటిని అతని పంట్లాంతో కలిపి అంటకుట్టింది.

వీటిలో ఏ ఉద్యోగమూ, లేక అన్ని ఉద్యోగాలూ కలిసికూడా అతని జీవిక గడవడానికీ, అప్పులు తీరడానికీ ఉపయోగపడులేదు. ఈ కష్టాలకు తోడు అతని అప్పులవాళ్ళు అతని గుర్రాన్నీ, జీనునీ, కళ్ళాన్నీ, సర్వే పరికరాల్నీ జప్తుచేయించి వేలం వేయించారు. అదృష్టవశాత్తూ ఒక స్నేహితుడు వీటినన్నిటినీ కొని యువక సర్వేయర్ యెడ తనకు గల అభిమానానికి నిదర్శనంగా వాటిని తిరిగి ఏబ్‌కి ఇచ్చేశాడు.

1834 ప్రారంభంలో లింకన్ ఇంకొకసారి రాష్ట్రశాసన సభకి పోటీచేయడానికి నిశ్చయించుకున్నాడు. డెమోక్రాట్ల, విగ్గుల సహాయంతో అతను గెలిచాడు న్యాయమూర్తి బౌలింగ్ గ్రీన్ డెమోక్రాటిక్ పార్టీ తరపున అతన్ని బలపరచాడు జనరల్ అసెంబ్లీ విగ్గు అభ్యర్థి, స్ప్రింగ్‌ఫీల్డులోని ప్రసిద్ధలాయరు అయిన జాన్ టి. స్టువర్ట్ లింకన్ పార్టీతో కలిసి పనిచేశాడు. లింకన్‌ని వాండలియాలో అసెంబ్లీ సమావేశాలు జరిగినప్పుడల్లా రాష్ట్ర రాజకీయాల దుర్గమమార్గాల్లో చేయూత ఇచ్చి నడిపించడం ద్వారానూ, అతన్ని న్యాయశాస్త్రాన్ని అభ్యసించమని చెప్పి అవసరమైన పుస్తకాలు అతనికి ఇవ్వడం ద్వారానూ, కొద్ది సంవత్సరాల్లోనే అతన్ని తన తోటి

లాయరుగా తీసుకోడం ద్వారానూ స్టూవర్టు ఎన్నో విధాల లింకన్‌కి సహాయపడ్డాడు.

ఈ విధంగా-ఇతర వృత్తులతో పాటు న్యాయశాస్త్రాన్నీ, రాజకీయాలనీ సాధించే నిమిత్తం లింకన్ బ్లాక్‌స్టన్ రచించిన 'కామెన్టరీస్' అనే పుస్తకం, చిట్టీ రచించిన 'ప్లీడింగ్సు' అనే పుస్తకం చదవడం ప్రారంభించాడు.

1834 ఆకురాలు కాలం వరకు ఏబ్ ఇదే విధంగా సర్వే పనితోపాటు రకరకాల పనులు చేస్తూనే ఉన్నాడు. తరువాత తన స్నేహితుడైన కోల్‌మన్ స్మూట్ దగ్గర రెండు వందల డాలర్లు అప్పుపుచ్చుకుని అరవై డాలర్లతో అతను టైలర్ తయారుచేసిన తన మొట్టమొదటి సూట్ కొన్నాడు! ఇల్లినాయిస్‌కి అప్పటి రాజధాని అయిన వాండలియాలోని జనరల్ అసెంబ్లీకి చెందిన ప్రజా సభలో అతను పూర్తి డ్రస్సుతో హాజరయి తన పాత్రను నిర్వహించ సాగాడు.

ఆ రోజుల్లో, ముఖ్యంగా నవంబరులో రోడ్లు బురదగా ఉండేవి. పచ్చిక మైదానంలో నిర్మించబడిన వాండలియా గ్రామానికి అప్పటికి ఇంకా పూర్తిగాపడని కంబర్‌లాండు రోడ్డుమీదుగా బురద చిందుకుంటూ స్టేజ్‌కోచ్ వచ్చేది. అప్పటికి ఆ ఊళ్ళో రెండంతస్థుల రాజధాని భవనమూ, అసెంబ్లీ సమావేశానికి హాజరయేందుకు వచ్చే శాసన సభ్యులూ, వారి కుటుంబాలూ తప్పితే వేరే చూడదగ్గ విశేషాలేమీ ఉండేవి కావు. కాని లింకన్‌కి మాత్రం 800 ల జన సంఖ్యగల ఈ పట్టణం అదృష్టస్థానమైంది. అతనూ స్టూవర్టూ కలిసి ఆ ఊరి హోటల్లో బసచేసేవారు.

సంగమన్ మండలంనుంచి వచ్చిన ఈ కొత్త రాష్ట్ర శాసన సభా సభ్యుని గూర్చి ఇక్కడ వివరించడం అనవసరం అతను రెండేసి ఏళ్ల గడువుగల నాలుగు పెరములు ఇల్లినాయిస్ అసెంబ్లీలో సభ్యుడుగా ఉన్నాడు. పరిపక్వంకాని ఈ అసెంబ్లీలో అతను రాజకీయాలకు సంబంధించిన ప్రాథమిక సమస్యల్ని నేర్చు కున్నాడన్నది వాస్తవమే కాని, అతను దూలాలనుకోసే స్థితినుంచి, వాటినిదొర్లించే స్థితివరకు వచ్చాడని సానుభూతి లేని ప్రేక్షకులు అతన్నిగూర్చి చెప్పేరంటే ఆశ్చర్యంలేదు. రాజకీయాల్లో తనకి ఉపకారంచేసేవారికి తిరిగి తను ఉపకారంచేసేవాణ్ణి దూలాలు దొర్లించే వ్యక్తిగా పరిగణిస్తారు, ఇతర రాజనీతిజ్ఞుడు నెగ్గింపతలచిన తీర్మానానికి అనుకూలంగా ఇతను వోట్లు చేస్తే ఆ రాజనీతిజ్ఞుడు కూడా ఇతని విషయంలో అలాగే ప్రవర్తిస్తాడు. దురదృష్టవశాత్తూ, నేడు కూడా లింకన్ యుగంలోలాగే, రాజనీతిజ్ఞులు ఈ విధమైన రాజీలు చేసుకుంటున్నారు.

ఈ ఎనిమిదేళ్ళ శాసన సభలోని అనుభవంతోను లింకన్ మైనారిటీ పక్షాల నాయకుని హోదాలోకి వచ్చాడు. ఇది విజానికి అతనికి రాష్ట్రరాజకీయాల్లో ఒక శక్తి ఇచ్చింది. ఏదైనా ఒక తీర్మానాన్ని గెలిపించవలసి వచ్చినప్పుడు ఇతర శాసన సభ్యులను ఒత్తిడిచేయగల పరిస్థితివరకు అతను రాగలిగాడు.

ఇల్లినాయిస్ కూడా ఆ కాలంలోని అన్ని రాష్ట్రాలవలెనే తమ రాష్ట్ర అభివృద్ధి కోసం, వెనుక ముందులు చూడకుండా, ప్రయత్నించే స్థితికి వచ్చింది. సరిహద్దుకంతటికీ రోడ్లూ, కాలువలూ, రైలు మార్గాలూ ఎంతో అవసరమన్న విషయం నిజమే! కాని ఇల్లినాయిస్ రాష్ట్ర కోశాగారంలో 2,000 డాలర్లైనా లేని ఆ యేడు కోట్ల డాలర్లు ఖర్చుకాగల కాలువలు తదితర రాక పోకల

సదుపాయాలకోసం వోటు చెయ్యడం మనకీనాడు మూర్ఖత్వంగానే కనిపిస్తుంది.

ఇల్లినాయిస్‌లోని వివిధ కౌంటీలూ కోరిన ఈ రోడ్లు, కాలువలు, రైలు మార్గాలు సాధించడం కోసం లింకన్ తాను శాసన సభ్యుడైన మూడో యేడు తన రాజకీయపు ఎత్తులన్నీ ఉపయోగించి రాజకీయ అధికారాన్ని హస్తగతం చేసుకోడానికి సర్వశక్తులా ప్రయత్నించాడు. సంగమన్ కౌంటీనుంచి వచ్చిన తొమ్మండుగురు పొడుగువారికీ (దాదాపుగా ఆరడుగుల పొడుగుండే ఏడుగురు శాసన సభ్యులు, ఇద్దరు రాష్ట్ర సెనేటు సభ్యులు) నాయకుడైన లింకన్ అందరికంటె పొడుగ్గా ఉంటూ ఈ పొడుగు వ్యక్తులందరి పొడుగునీ బలాన్నీ అసెంబ్లీనికై వశంచేసుకోడం కోసంవినియోగించాడు. డెమోక్రాట్లు కొత్త రాకపోకల విధానాన్ని కోరారు. లింకనూ అతని స్నేహితులూ రాష్ట్రరాజధాని వండాలియానుంచి స్ప్రింగ్‌ఫీల్డుకి మార్చాలన్నారు. అద్భుతమైన ఈ దూలాల దొర్లింపు మంచి ఫలితాన్ని ఇచ్చింది. రోడ్లూ, కాలువలూ రైలు మార్గాలూ నెగ్గాయి. రాజధాని మార్పు కూడా నెగ్గింది. వండాలియా మీద స్ప్రింగ్‌ఫీల్డు నగరం అద్భుత విజయాన్ని సాధించింది. స్ప్రింగ్‌ఫీల్డు పక్షం నెగ్గడానికి ఎంతో సహాయపడ్డ లింకన్ అందరి దృష్టిలోనూ గొప్ప వీరుడయాడు.

వండాలియాలో ఉన్నరోజుల్లో లింకన్‌కి ఇద్దరు వ్యక్తులు పరిచయ మయారు. తరవాత తరవాత వారిద్దరూ అతనికి ప్రతికక్షులయారు. అందులో ఒకడైన జేమ్సుషీల్డ్స్ ఒకనాడు ఒకనాడు లింకన్‌ని ద్వంద్వయుద్ధానికి రమ్మని సవాలు చేశాడు. రెండవవాడు పొట్టిగా లావుగా తెలివైనవాడుగా ఉండే స్టీవెన్ ఏ. డగ్లస్. 1850 ఆఖరులో లింకన్ అతనితో సుప్రసిద్ధమైన వాగ్వాదాలు జరిపాడు.

దేశమంతటా ఆ ఉపన్యాసాలు మారు మ్రోగిపోయాయి. ఒక హోటల్లో జరిగిన విందులో రాజనీతిజ్ఞులందరి సమక్షంలో నుపిల్డ్ సూ పగ్లసూ పెద్ద డిన్నర్ టేబిల్ మీద ఈ చివరినుంచి ఆచివరివరకు డ్యాన్సు చేస్తూండగా లింకన్ చూశాడు. మర్నాడు షీల్డ్స్ పగిలి పోయిన కప్పులూ, పేట్లూ మొదలైన వాటి బిల్లు 600 ల డాలర్లు చెల్లించాడు. ఆ రోజుల్లో ఆ డబ్బుతో వందల ఎకరాల భూమివచ్చేది.

లింకన్‌కి 'ఆచరణ సాధ్య రాజకీయాలు మాత్రమే ఇష్టమనడం అన్యాయమే అవుతుంది. అతను తన ఆదర్శాలనీ, స్వప్నాలనీ కూడా ఆచరణ సాధ్యం చెయ్యడానికి పాటుపడ్డాడు. మాండలికాభ్యుదయ కార్యక్రమాలు, రాజధాని మార్పు మొదలైన సమస్యలు పరిష్కారం కాగానే లింకన్‌కి బానిసత్వం విషయమై తన అభిప్రాయాల్ని వ్యక్తపరచే అవకాశం లభించింది. ఆ తరువాత 24 సంవత్సరాల్లో అతని ఈ అభిప్రాయాలెంత మాత్రం మార్పు చెందలేదు. బానిసత్వం అన్యాయమనీ, చెడ్డ సిద్ధాంతమనీ అతను తన అభిప్రాయాల్ని అసెంబ్లీలో తెలియజేశాడు. అయితే తను బానిసత్వ నిర్మూలన వాదిని కాదనికూడా చెప్పాడు. ఇంతకుముందే బానిసత్వాన్ని ఒప్పుకున్న రాష్ట్రాల విషయంలో కేంద్ర ప్రభుత్వం కలుగజేసుకో కూడదని అతని వాదం. అయితే, కొలంబియా జిల్లాలో దాన్ని బహిష్కరించే హక్కు కాంగ్రెస్‌కి ఉందని అతని ఉద్దేశ్యం.

ఈ విధంగా యువకుడుగా ఉన్నప్పటినుంచే లింకన్ బానిసత్వమనే రోగాన్ని వ్యాపించ నివ్వకూడదనే నిశ్చితాభిప్రాయాన్ని వ్యక్తపరచడం ప్రారంభించాడు.

రాష్ట్ర శాసన సభా సమావేశాల మధ్య కాలం లింకన్ న్యూ సాలెమ్‌లో గడిపేవాడు. ఆ ఊళ్ళో ఏన్ రట్‌లెడ్జి అనే అమ్మాయి

ఉండేది. నీలి కళ్ళు, బంగారువన్నె జుట్టూగల ఆ పిల్ల జేమ్సు రట్‌లెడ్జి కూతురు. జాన్ మెక్‌నీల్ అనే అతనికి ఆమెని ఇచ్చి పెళ్ళి చెయ్యడానికి నిశ్చయించారు. 1832 లో మెక్‌నీల్ కుటుంబ వ్యవహారాల్ని పరిష్కరించుకోడానికి తూర్పు వెళ్ళాడు. తన వ్యవహారాలు చక్కబడగానే వచ్చి అతను ఆమెని పెళ్ళాడుతాడన్న ఏర్పాటు జరిగింది. కాని మెక్‌నీల్ తన కాబోయే భార్యకు ఉత్తరాలు వ్రాయడం హఠాత్తుగా మానేశాడు. ఈ విధంగా మూడేళ్ళు గడిచి పోయాయి. మెక్‌నీల్ తన అభిప్రాయాన్ని మార్చుకున్నాడని, నమ్మిన ఏన్‌నిగాని, ఏబ్‌నిగాని, మనం విమర్శించడం మంచిది కాదు.

అయితే లింకన్ ఏన్‌కి తన కోరిక ఎన్నడైనా తెలియజేశాడా? ఆమె అతన్ని స్వీకరించిందా? 1835 లో ఆమె చనిపోవడంవల్ల పిచ్చివాడై పోయేటంతగా లింకన్ బాధ పడ్డాడా?

ఆధునిక జీవిత చరిత్రకారులంతా ఏకగ్రీవంగా ఈ ప్రేమ కథ అబద్ధమని కొట్టిపారేశారు. ఇందుకు ఆధారాలు మనకేం దొరకవు; కాని లింకన్‌ని గూర్చి ప్రచారంలో ఉన్న కట్టుకథ లన్నిటికంటె ప్రజలు దీన్ని ఎక్కువగా నమ్ముతున్నారు. ఇప్పటి ఏన్ గోరీ మీద ఎడ్గార్ లీ మాస్టర్స్ రచించిన ఒక పద్యం చెక్కి ఉంది. అందులో చిన్నతనంలోనే మరణించినట్లు, లింకన్‌కి తెలిసిన ఈ బాలిక హృదయం గమ శబ్దాలతో ఇలా వర్ణించబడి ఉంది:

యోగ్యతలేని అపరిచితను నేను
నాలోనుంచి సంగీతం వినిపిస్తోంది,
"ఎవరిమీదా ద్వేషంలేదు,
అందరినీ ఆదరిస్తాను!"
నాలోనుంచి కోటి క్షమాపణ

కోట్లమందికి లభిస్తున్నాయి,
ఒక ఉజ్వలజాతి రూపం
న్యాయం సత్యంతో కూడుకుని
ప్రకాశిస్తోంది చూడండి!
ఈ గడ్డి కింద నిద్రిస్తున్నాను
నేను ఏన్ రట్ లెడ్జిని,
అబ్రహాం లింకన్ ప్రేయసిని
అతని కంకితమైన బాలికని!
కలయికలో కాదు-
వియోగంలో.
ఓ రిపబ్లిక్! వికసించు-
నా హృదయ మృత్తికలోనుంచి
శాశ్వతంగా వికసించు!

ఉదయ కాలపు మంచులా నశించిపోయిన ఒక గ్రామంలో ఎన్నో ఏళ్ళ క్రితం రెండు యువ హృదయాల్లో ఏ మధుర భావాలు వికసించాయో ఇప్పుడు మన మేం చెప్పగలం? ఒకవేళ ఏన్ రట్ లెడ్జి వృత్తాంతం కల్పనా లోకాలకు సంబంధించిన ప్రేమకథ అయి ఉన్నప్పటికీ ఇతర వియోగ ప్రణయాలలాగే చరిత్రలో ఒక శాశ్వత స్థానాన్ని పొందింది.

ఏది ఎలాగున్నా అబ్రహాం లింకన్‌కి ఇప్పుడు న్యూసాలెమ్ గ్రామం సారవిహీనంగా కనిపిస్తూంది. 1837 ఏప్రిల్‌లో తన ఇరవై ఎనిమిదో ఏట (అంటే అతని కింకొక ఇరవై ఎనిమిది ఏళ్ళు జీవితం ఉందనగా) ఏబ్ తన లాయర్ ప్రాక్టీసుకోసం స్ప్రింగ్ ఫీల్డు చేరుకున్నాడు.

న్యూసాలెమ్‌లో అప్పటికీ వెనుకటి స్మృతి చిహ్నాలెన్నో ఉన్నాయి. దివాలా తీసిన స్టోరు ఉంది. న్యూస్ పేపర్లు చదవడానికి అతనికి వీలు కలగజేసిన పోస్టు మాస్టరు ఉద్యోగం, దూలాలు పగలగొట్టేపని, ధాన్యం దంచేపని, సర్వే పని ఉన్నాయి. అతను తన స్నేహితులతో నెగడు దగ్గిర కూచుని చేసిన సంభాషణలు ఉన్నాయి. అతను చదివిన పుస్తకాలున్నాయి. అతను ఎన్నికలకు నిలిచినప్పుడల్లా అతని ఇరుగు పొరుగు వాళ్ళు అతనికి వేసిన వోట్లున్నాయి. అతని పరిచిత బాలిక పచ్చిక బయలు అడుగుభాగంలో నిద్రిస్తోంది. ఇంక రెండేళ్ళకి న్యూసాలెమ్ పూర్తిగా మటుమాయం కాబోతూంది షేక్స్పియర్ పాత్ర ప్రోస్పెరో మాటల్లో :

ఈ మన పాత్రలు
నేను ముందే చెప్పాను ప్రేతాలు!
అందుకే గాలిలో కలిసి మాయమయాయి
మేం నిజమైన పాత్రలం కాము
కలలో కనిపించినట్టు కనిపించాం;
మా క్షణిక జీవితాలు నిద్రలో లీనమయాయి.

# స్ప్రింగ్‌ఫీల్డులో తొలిరోజులు

"నేను లా చదివాను – ప్రాక్టీసు కోసం స్ప్రింగ్ ఫీల్డుకి వచ్చాను."

అబ్రహాం లింకన్

జాషువా ఎఫ్. స్పీడ్ కంటకీలో పెరిగిన యువక వ్యాపారి. అందమైనవాడు, మంచి భాగ్యవంతుడు. అతను త్వరలోనే లింకన్‌కి ప్రాణ స్నేహితుడయాడు. మన కాబోయే అధ్యక్షుడు ఇరవై నాలుగు సంవత్సరాలు నివసించిన స్ప్రింగ్ ఫీల్డుకి మొదట ఎంత సామాన్యుడుగా వచ్చాడో స్పీడ్‌కి బాగా గుర్తుంది. లింకన్ ఎరువు తీసుకున్న ఒక గుర్రం మీద తన సామానంతా రెండు సంచీలలో పెట్టుకుని జీనుకి రెండు పక్కలా తగిలించుకుని వచ్చాడు. తిన్నగా స్పీడ్ దుకాణంలోకివచ్చి లింకన్, "ఒక చిన్న గదికి కావలసిన ఫర్నిచరు ఎంతలో వస్తుంది," అని అడిగాడు. స్పీడ్ అంచనావేసి 1700 ల డాలర్లని చెప్పాడు. లింకన్ అన్నాడు: "నిజానికి ఇది చాలా చవక అనే చెప్పాలి ... అయినా కొనేందుకు నా దగ్గిర డబ్బులేదు. మీరు క్రిస్టమసు దాకా నాకు గడువిస్తే, లాయరుగా నా ప్రయత్నాలు ఇక్కడ జయప్రదమయే పక్షంలో నేను బాకీ తీర్చేస్తాను. నేను జయం పొందలేకపోతే మాత్రం ఈఋణాన్ని నేను ఎన్నటికీ తీర్చలేను."

ఒకసారి చూస్తే చాలు ఎన్నడూ మరిచిపోలేని అతి విచారకరమైన ఆ ముఖాన్నీ, పొడుగ్గా అతిసామాన్యుడుగా కనిపించే ఆ




ఎరువు గుర్రంమీద స్ప్రింగ్‌ఫీల్డ్‌కి ప్రయాణం

వ్యక్తినీ చూసి స్పీడ్ వెంటనే ఒక నిర్ణయానికి వచ్చాడు. తన కౌంటర్ని ఆనుకుని దీనంగా నిలబడి ఉన్న ఆ యువ లాయర్ని చూసి అతను అన్నాడు:

"ఈ చిన్న అప్పే మీకింత విచారం కలిగిస్తూందా? మీరేమీ అప్పు చెయ్యకుండానే మీ పని జరిగే మార్గం నేను చెపుతాను

నాకు ఒక పెద్ద గదీ, అందులో రెండు చాలా పెద్ద మంచాలూ పరుపులూ ఉన్నాయి. మీ కిష్టమైతే ఆ గదిలో నాతో పాటు మీరూ ఉండవచ్చును."

లింకన్, "ఆగది ఎక్కడ ఉంది?" అని అడిగాడు. పైకి త్రోవతీసే మెట్లవైపు చూపిస్తూ స్పీడ్, "మేడమీద," అని జవాబి చ్చాడు. తన జీను, సంచీలు పట్టుకుని లింకన్ అడుగుకి రెండుమెట్లు దాటుకుంటూ పైకి ఎక్కాడు. అతను అతి సంతృప్తి సూచకంగా చిరునవ్వు నవ్వుతూ, "అయితే, నేను సిద్ధమే" అన్నాడు.

తను వెళ్ళిన క్రొత్తలో వ్రాసిన ఒక ఉత్తరంలో లింకన్ తన ఒంటరితనాన్ని గూర్చి వ్రాసినా, అతను అనేక విధాల అదృష్టవంతు డనే చెప్పాలి. జాషువా స్పీడ్ ఔదార్యంవల్ల అద్దె లేకుండా ఇల్లు ఒక క్లబ్బు, ఒక రంగస్థలంకూడా అతనికి లభించాయి. దుకాణానికి వెనుక ఒక పెద్ద గది ఎప్పుడూ నెగడుతో వెచ్చగా ఉండేది. ఊళ్ళో అనేక మంది చదువుకున్న యువకులు తరచు ఆ గదిలో సాహిత్యాన్ని గూర్చి రాజకీయాల్ని గూర్చి చర్చించడానికి వస్తూ ఉండేవాళ్ళు, స్పీడ్ లింకన్ లాగే చదువుకున్నవాడు. లింకన్‌కంటె ఎక్కువ నాగరకుడు. స్పీడ్‌కి తగిన తెలివైన గుమాస్తా "బిల్లీ" హెర్న్‌డన్. ముఖ్యంగా వారిద్దరూ ఎప్పుడూ చర్చల్లో పాల్గొనేవారు. అపుడప్పుడు స్టీఫెన్ ఏ. డగ్లస్ అనే యువకరాజకీయవేత్తకూడా వస్తూండేవాడు. అతను అదృష్టవంతుడు పొట్టివాడు, కయ్యానికి కాలు దువ్వే రకం, డెమోక్రేట్. లింకన్ ఇందుకు వ్యతిరేకంగా పొడుగు, సర్దుకుపోయే రకం, విగ్గూ. తరుచు వీళ్ళంతా రాత్రి చాలా సేపటివరకూ కూర్చుని వేళాకోళాలాడుకోడం, కథలు చెప్పుకోడం, గట్టిగా పద్యాలు చదవడం చేసేవారు. అప్పుడప్పుడు లింకనూ, డగ్లసూ గంభీరరాజనీతిక వాగ్వాదంలోకి దిగుతూండేవారు. వాళ్ళిద్దరూ నిజానికి తగిన ఉజ్జీలు!

ఇతరవిధాల కూడా లింకన్ అదృష్టవంతుడు. అతన్ని న్యాయ శాస్త్రాధ్యయనంలో ప్రోత్సాహ పరచిన జాన్ టి, స్టువర్టు సరిగా ఈ సమయంలో నే అతన్ని తన భాగస్థునిగా తీసుకున్నాడు స్టూవర్టు లింకన్ ఎకౌంటు బుక్కుని పట్టి ఈ ఫరమ్ మొదటి సంవత్సరంలో సంపాదించిన కోర్టుఫీజు 500 డాలర్లని తెలుస్తూన్నా వీళ్ళ భాగస్వామ్యం ముందుకు సాగేదే అని తేలింది.

ఇంతకుముందు మనం తెలుసుకున్నట్లు, వండాలియానుంచి ఇల్లినాయిస్ రాష్ట్ర రాజధానిని స్ప్రింగ్ ఫీల్డుకి మార్పించడంలో మంచి రాజకీయపు ఎత్తుద్వారా సహాయపడ్డ లింకన్ ఆ ఊళ్ళో మంచి పేరు పొంది ఉన్నాడు.

రెండేళ్ళక్రితమే రాష్ట్ర జనసంఖ్య లెక్కించ బడింది. దీని ప్రకారం లింకన్ వచ్చేటప్పటికి స్ప్రింగ్ఫీల్డు జన సంఖ్య 1500. చర్చిల సంఖ్య ఎంతో, చిల్లర దుకాణాల సంఖ్యకూడ సరిగ్గా అంతే! అంటె ఇవి ఆరు, అవి ఆరు. అభివృద్ధి చెందుతూన్న ఈ ఊరి జనం సరుకులు కొనుక్కోడానికి 19 ప్రత్యేక సంస్థ లున్నాయి. నాలుగు హోటళ్ళూ, నాలుగు మందుల షాపులూ, నాలుగు కాఫీషాపులూ ఉన్నాయి. రెండు ప్రతిస్పర్థి వార్తాపత్రికలు ఉన్నాయి. ఇవి క్రమంగా రాజకీయ ప్రతి ద్వంద్వులయిన అబ్రహాం లింకన్కి, స్టీఫెన్ ఏ. డగ్లస్కి ప్రచార ద్వారాలుగా తయారయాయి! లింకన్కి విశ్వాస పాత్రుడైన సైమన్ ఫ్రాన్సిస్ 'సంగమోజర్నల్'ని నడిపేవాడు. ఇల్లినాయిస్ రిపబ్లికన్ సంపాదకుడు జార్జి వీబర్ స్నేహ సహకారాలు డగ్లస్కి లభించాయి.

చాలా వరకు ఆఫీసులూ, దుకాణాలూ కూడలికి ఎదురుగా ఉన్నాయి. కొన్ని పక్కనున్న పల్లపు వీథుల్లో ఉన్నాయి. కొంచెం

దూరంలో అస్తవ్యస్తంగా కర్ర క్యాబిన్లూ, ఇటికతోనూ చట్రాలతోనూ కట్టిన మంచి కట్టడాలూ కలిసి ఉన్నాయి.

కాని ఈ పట్టణమంతటా వీథుల్లో ఎక్కడా రోడ్లులేవు. ఎండా కాలంలో దుమ్ము దుమారాలు, వానాకాలంలో ఇల్లినాయిస్ రేగడి బురదతో నిండిన మురికికాలవలూ దుర్భరంగా ఉన్నాయి. కూడలిలో కూడా పందులు చిందరవందరగా పరుగెడుతూ ఉంటయి. వీథి దాటడమనేది ఒక్కొక్కప్పుడు చాలా కష్టసాధ్యమైపోతూంది. కొత్త రాష్ట్ర రాజధానిలో జీవితం మొరటుగాను, అనాగరకంగాను ఉండే దంటే అతి శయోక్తి కాదు.

అయితే, ఇందుకు విరుద్ధంగా ఆ కొత్త నగరానికి మన యువ లాయర్‌కి లాగే విజ్ఞాన తృష్ణ మాత్రం ఎక్కువగా ఉన్నట్టు కనిపిస్తుంది. స్ప్రింగ్‌ఫీల్డులో ఒక బుక్‌స్టాలు, ఒక పరిషత్తూ చాలా ప్రైవేటు స్కూళ్ళూ ఉన్నాయి. థిసి, యన్ సొసైటీ టెంపరెన్సు సొసైటీ, యువజన సంఘం కూడా ఉన్నాయి. డేనియల్ వెబ్‌స్టర్ వంటి సుప్రసిద్ధవ్యక్తులు ఉపన్యాసా లివ్వడానికి వచ్చేవారు. 1500 ల జనసంఖ్య గల నేటి అమెరికన్ టౌన్లలో ఈ సరిహద్దు ప్రాంతపు స్ప్రింగ్‌ఫీల్డులా పుస్తకాలమీదా ఆదర్శాలమీదా అభిమానం చూపించే టౌన్లే ఎన్ని ఉంటాయా అది సందేహం. ఆ ప్రాచీన కాలంలో అబ్రహాం లింకన్ లాగ సాంస్కృతిక విషయాలపై ఎక్కువ శ్రద్ధ వహించే నాగరకులు బహు తక్కువ.

స్ప్రింగ్‌ఫీల్డు ఇచ్చే ఆతిథ్యంలో అభిమాన ఆదరాలు ఎక్కువ. ఎక్కువగా కంటకియన్లతో కూడుకున్న నాగరక సంఘానికి నాయకుల్లో నినియన్ డబ్ల్యూ. ఎడ్వర్డ్స్, అతని భార్య ఎలిజబెత్ టాడ్ ఎడ్వర్డ్సకూడా ఉన్నారు. ఈ సంఘంలో లింకన్‌కి సునాయా

సంగా ప్రవేశం దొరికింది. జాన్ టి. స్టూవర్ట్‌కి భాగస్థుడుగానూ, రాష్ట్ర శాసనసభలో విగ్గుల నాయకుడుగానూ అతను ఎటువంటి గోష్ఠికైనా మంచి అలంకారంగా ఉండేవాడు. అత నెంత అజాగ్రత్తగా బట్టలు కట్టుకున్నా సరిహద్దు యాసతో మాట్లాడుతూన్నా, ఆడపిల్లల్ని డ్యాన్సుకి రమ్మని పిలిచే వయస్సులో గప్పాలుకొట్టే యువశ్రోతలని ఆకర్షిస్తున్నా, లింకన్ ఏ సమాజానికైనా ఒక భూషణంగా రాణించేవాడు.

స్ప్రింగ్‌ఫీల్డులో జరుగబోయే శాసన సభా ప్రథమ సమావేశం సందర్భంలో ఏర్పరచబడిన డ్యాన్సింగ్‌లో లింకన్ శ్రీమతి ఎడ్వర్డ్స్ చెల్లెలైన మేరీటాడ్‌ని కలుసుకున్నాడని వదంతి. పొట్టిగా లావుగా నీలికళ్ళతో చమత్కారంగా మాట్టాడే చదువుకున్న ఆ బాలికవ్యక్తిత్వం అతన్ని బాగా ఆకర్షించింది. కొవ్వువత్తుల వెలుగులో, పువ్వులతో అలంకరింపబడిన ఆగది మొత్తంలో పొట్టి డ్యాన్సు డ్రెస్సులో ఉన్న పొట్టి మేరీ టాడ్ చాలా అందంగా ఆకర్షణీయంగా ఉంది.

అనాకారి, పొడుగువాడు అయిన అబ్రహాం లింకన్ అవకతవక డ్రస్సులో ఉండి తను చెప్పేకట్టు కథలమీద దృష్టి నిలపలేకపోయాడు. ఒకసారి స్టీఫెన్ డగ్లస్‌తోటీ, ఇంకొకసారి జేమ్సు షీల్డుతోటీ, లేక ఇంకొక అందమైన యువకుడి తోటీ డ్యాన్సు చేస్తూన్న ఆ అందమైన పిల్ల మీదే అతని దృష్టులు కేంద్రీకరించబడి ఉన్నాయి. అతను ఆఖరికి ధైర్యంచేసి కుమారి టాడ్ దగ్గిరికి వెళ్ళి ఆమెతో తన చేతకాని పద్ధతిలో డ్యాన్సు చెయ్యడానికి రమ్మని కోరాడు. మేరీ టాడ్ తరవాత అన్నట్టు 'అతను నిజాంగా అలాగే డ్యాన్సు చేశాడు.'



ధైర్యం చిక్కబట్టుకుని ఆమెని పలకరించాడు

ఈ విధంగా అమెరికన్ చరిత్రలో అతి ఊహాతీతమైన వివాహానికి త్రోవతీసిన అద్భుత ప్రణయం ప్రారంభమయింది.

అబ్రహాం, మేరీల వలె పూర్తిగా వ్యతిరేకతత్వాలు కలవారుండడం అసంభవం. లింకన్ సరిహద్దు స్కూలులో ఒక సంవత్సరానికి తక్కువగా ప్రాథమిక విద్యాభ్యాసం చేసిన వ్యక్తి; రెండు ఎకాడమీలలో విద్యా పరిపూర్ణతనందిన మేరీ టాడ్ ఫ్రెంచిభాష, నాటకాలు, నాట్యం, సంగీతం, సాహిత్యం, సాంఘిక మర్యాదలు బాగా జీర్ణించుకున్న వ్యక్తి.

తల్లితండ్రులు దిగువ తరగతికి చెందినవారవడమేగాక లింకన్ హాంక్సువైపు నుంచి తనకు కొంత నీచత్వం కూడా సంక్రమించినట్లు అనుమానించేవాడు. ఈ వైపున చూస్తే టాడ్ కుటుంబం కంటకీ కుటుంబాల్లో చాలా ప్రసిద్ధి కెక్కినది. లింకన్ సామాన్యంగా, సరసంగా, ఉదారబుద్ధితో ఉంటూ, సహనం, క్షమాశీలం అలవర్చుకున్నవాడు, మేరీ శుభ్రంగా, నాగరకంగా ఉంటూ డాబు దర్పాలు చూపేది. క్షమించడం చేతకాదు; పైగా తరుచుమూతి ముడుచుకోడం, కోపగించడం ఆమెకి అలవాటు లింకన్ సామాన్య స్థితిలో ఉండ కలుగితే చాలను కొనేరకం, మేరీ స్ప్రింగ్‌ఫీల్డులో ఎన్నడూ కనీ వినీ ఎరుగనంతగా పైకి రావాలని తాపత్రయపడే మనిషి.

లింకన్ - డగ్లస్ జేమ్సు, షీల్డ్సులచే చుట్టుముట్టబడి ఉండే రోజుల్లో మేరీని అనేకసార్లు ఆమె ఎవరిని పెళ్ళాడకోరుతున్నదో చాలామంది అడిగేవారు. అధ్యక్షుడు కాబోయే వ్యక్తినే నేను పెళ్ళాడతానని అనేకసార్లు ఆమె తన నిశ్చయాన్ని వ్యక్తపరచింది. లింకన్‌తోను, డగ్లస్‌తోను ఆమె ఆ ఉన్నతపదవికి తగిన రెండు

ప్రత్యేక వ్యక్తిత్వాన్ని చూసింది. బహుశః తన తీవ్ర ఉన్నతా కాంక్షద్వారా వారిద్దరిలో ఎవరినైనా సరే అధ్యక్షుణ్ణిచేసే శక్తి ఆమెలో ఉండి ఉంటుంది.

ఈ సామాన్య వర్ణనతో మేరీ టాడ్ పూర్తి చిత్రాన్ని మనం చూడలేం. అనేక ఆధునిక చరిత్రకారులు చారిత్రక నవలా రచయితలూ మేరీ టాడ్ జీవితాన్ని ఉన్నదానికంటె ఎక్కువ శృంగార పూర్ణంగా చూపించారు. ఆ ఆదర్శత్వానికి న్యాయం, పూర్తిగా కాక పోయినా కొంతవరకైనా, చేకూర్చగలిగే సౌందర్యం - బుద్ధి కుశలత, శక్తి సామర్థ్యాలు ఆమెలో లేక పోలేదు. నిజానికి ఆమె లింకన్‌ని తీవ్రంగా ఆకర్షించిందనే చెప్పాలి. అప్పుడప్పుడు ఆమె అతన్ని ఆగాధ దుఃఖసముద్రాల్లో మునకలు వేయించేదన్నది కూడా సత్యమే! వారిద్దరూ సాహిత్యాన్నిగూర్చి, రాజకీయల్ని గూర్చి మాట్లాడుకునేవాళ్ళు. ఇద్దరికీ అవి రెండూ చాలా ప్రియమైన విషయాలు. మేరీ సోదరీకథనం ప్రకారం - లింకన్ వచ్చినప్పుడల్లా మేరీయే సంభాషణాక్రమాన్ని సాగించేది. "లింకన్ ఆమె పక్కన కూర్చుని వింటూ ఉండేవాడు అతను సాధారణంగా ఏమీ మాట్లాడకుండా ఆమెవైపు చూస్తూ ఉండేవాడు. ఏదో అజ్ఞాత మహాశక్తిచే ఆకర్షించబడి, ఆమెకి వశపడిపోయిన వాడిలాగ కనిపించేవాడు."

వాళ్ళు కలుసుకున్న ఆ మొదటి సంవత్సరం ఒక విచిత్రమైన పంథాలో వారి ప్రణయం ముందుకి సాగుతూన్నటే కనిపించింది. 1840 ప్రాంతాల్లో వాళ్ళు ఒకరి కొకరు మాట కూడా ఇచ్చేసుకున్నారు. లింకన్ తనకు తగిన భర్త కాదని ఇంట్లో వాళ్ళంతా అడ్డువచ్చినా మేరీ లెక్కపెట్టలేదు. ఆ తరవాత ఏం జరిగిందీ అన్న విషయంలో గొప్ప గొప్ప జీవిత చరిత్ర రచయితలుకూడా వాదవివా



ఏం వెయ్యడానికీ పాలు పోవడం లేదు!

దాలు చేసుకుంటున్నారు. సంగమన్ తీరంలోని ఇండియన్ గ్రీష్మం లోని నీలి పొగలా ఈ విషయం చాలావరకు అస్పష్టంగా ఉండిపోయింది శీతకాలం రావడంతో, అప్పటికే కుంగి ఉన్న లింకన్ హృదయంలో ఏదో గడ్డ కట్టుకుంది. 1841 జనవరి ఒకటో తారీఖున స్వయంగా లింకన్ ద్వారా ఖరారునామా రద్దు చేయబడింది. కారణం నేటికీ ఊహించడం అసాధ్యం!

ఆ తరవాతే ఇద్దరూ - ముఖ్యంగా లింకన్ విరహంలో రెండు దీర్ఘ సంవత్సరాలు గడపవలసి వచ్చింది. ఈ దుఃఖభారంతో కుంగిపోతూ లింకన్ చాలా రోజులు గది వదలి బయటికి రాలేదు

ఇంతకుముందు ఒక సామాన్య యువతి మేరీ ఓవెన్స్ అనే ఆమె ప్రేమభగ్నవలన ఇలాగే కూడా నిరుత్సాహపడి సందిగ్ధావస్థలో లింకన్ ఏ నిశ్చయానికీ రాలేక బాధ పడ్డాడు.

జాషువా స్పీడ్‌ని కలుసుకోడం కోసం లింకన్ చేసిన కంటకీ యాత్ర అతనికి మనశ్శాంతినీ, ఆనందాన్ని చేకూర్చిందని మనం నమ్మవచ్చును. స్పీడ్ స్వదేశానికి తిరిగి వెళ్ళి ఫానీ హెన్నింగ్ అనే అందమైన యువతితో స్నేహం చేసుకున్నాడు. కాని ఆమెని పెళ్ళాడడం విషయంలో లింకన్‌లాగే అతనూ ఎందుచేతో ముందుకు రాలేదు. స్పీడ్‌కి ఈవిధమైన సందిగ్ధస్థితి మంచిది కాదని బోధించే సందర్భంలో లింకన్ తనంతట తనే తన తప్పు తెలుసుకుని ఉంటాడు. స్పీడ్ తన నూతన వైవాహిక జీవితాన్ని గూర్చి వ్రాసిన ఉత్తరం చదివి, "1941 జనవరి ఒకటవ తారీఖునుంచి అప్పటివరకు పొందిన ఆనందం మొత్తం కంటె లింకన్ ఎక్కువ ఆనందం" పొందాడు.

బహుశః సంగమోన్ జర్నల్ సంపాదకుడైన సైమన్ ఫ్రాన్సిస్ భార్య తిరిగి లింకన్‌నీ, మేరీ టాడ్‌నీ కలిపిఉంటుంది. ఆమె వాళ్ళు రహస్యంగా కలుసుకునేందుకు తన గదిని ప్రత్యేకించింది. నిస్సందేహంగా ఇక్కడినుంచే ఈ ఇద్దరు కుట్రదారులూ "లాస్ట్ టౌన్‌షిప్" లేఖలు తయారుచేసి ఉంటారు. వీటి మూలంగా లింకన్ ప్రాణానికే ముప్పు రావలసింది!

ఏబ్ చిన్నతనంనుంచీ మనస్సుకి ముల్లులా గుచ్చుకునే వ్యంగ్య రచనలకు అలవాటు పడ్డవాడే! ఇప్పుడు ఈశక్తిని అతను రాజకీయ వాంఛా పూర్తికి ఉపయోగించ సాగాడు, సంగమోన్ జర్నల్‌లో పదిపడితే అది వ్రాసే సదుపాయం ఉండడంవల్ల అతను న శత్రువులు కొందరినిగూర్చి వ్యంగ్యబాణాలు కురిపించే కోర్కైను

అపుకోలేకపోవడం సహజమే! అతను తనవ్యాసాలకు కలంపేర్లు పెట్టుకుని సంతకం చేసేవాడు. "శాంప్సన్స్ ఘోస్ట్" అన్నది వాటిలో ఒకటి.

ఇప్పుడు లింకనూ, మేరీ కలిసి మేరీకి ప్రాణ స్నేహితురాలైన జూలియా జేనీ సహాయంతో సంగమోం జర్నల్‌కి ఒక కొత్త లేఖా రచయితని తయారుచేశారు. "లాస్టు టౌన్‌షిప్" అనే ఊరూ, ఆ ఊరికి చెందిన లేఖారచయిత్రి "ఆన్‌ట్ బెక్కా" కల్పిత పాత్రలే! ఈ రచయిత్రి కలం చాలా కటువైనది; తీక్షమైనది. ఆమె వ్యంగ్య రచనలకు గురియైన వ్యక్తి లింకన్‌కి రాజనీతికరంగంలోనూ, కొంత కాలం ప్రణయంలోనూ ప్రతిస్పర్థియైన జేమ్సు షీల్డ్సు. ఇతను ఐర్లాండులో పుట్టినవాడు; స్టేట్ ఆడిటర్‌గా పని చేస్తూన్నవాడు.

నిజానికి లింకనే తన తోడి విగ్గుల సహాయంతో రాష్ట్రాన్ని బాగా అప్పులపాలయ్యేట్టు చేశాడనాలి. అయితే అతను అన్యాయంగా, తను కలగజేసిన రాష్ట్ర ఆర్థిక పరిస్థితిలోని అవ్యవస్థకి షీల్డ్సునీ, అతని పార్టీనీ దుమ్మెత్తి పోశాడు. తప్పు లింకన్‌దే కాని షీల్డ్సుది ఎంత మాత్రం కాదు.

అతని ఎత్తంతా ఆఖరికి చాలా అసహ్యాకరంగా పరిణమించింది. లింకన్ ఊళ్ళో లేనప్పుడు మేరీ టాడ్, జూలియా జేనీ కలిసి చాలా అవమానకరమైన ఆఖరిలేఖ వ్రాసి ఉండకపోతే అతన్ని క్షమార్పణ చెప్పుకోడమో ద్వంద్వయుద్ధానికి తయారవడమో చెయ్యాలని షీల్డ్సు ఛాలెంజి చేసే పరిస్థితి వచ్చేదికాదు. ఆన్ట్ బెక్కా సంతకంతో ఉన్న ఈ లేఖకూడా వాస్తవానికి ఛాలెంజి చేసేందుకు తగిన కారణమయ్యేదికాదు. ఆన్ట్‌బెక్కా లేఖలో షీల్డ్సు ద్వంద్వయుద్ధానికే పిలువగోరే మాటయితే తాను న్యాయమైన పద్ధతిలో అందుకు

తయారే అని వ్రాసింది. అంతేకాదు; షీల్డ్సు గేను తొడుక్కోడమో లేక తాను పంట్లాం తొడుక్కోడమో జరగాలనికూడా ఆమె వ్రాసింది!

సహించలేని పరిస్థితిలో షీల్డ్సు అసలు రచయిత పేరు వ్యక్త పరచమని సంపాదకుణ్ణి నిల దీసి అడిగాడు. లింకన్ పూర్తి బాధ్య తను తనమీద వేసుకుని అవసరం బహిరంగ క్షమార్పణ లేకుండానే వ్యవహారాన్ని సర్దుబాటు చెయ్యడానికి ప్రయత్నించాడు ఇందులో అసఫలుడయి అతను విధిలేక షీల్డ్సు చేసిన ఛాలెంజి ప్రకారం ద్వంద్వయుద్ధానికి తయారయాడు. పొడుగైన అశ్విక ఖడ్గాల్ని ఆయుధాలుగా పేర్కొన్నాడు. షీల్డ్సు ఒకానొకప్పుడు కత్తి సామునేర్పే శిక్షకుడుగా ఉండేవాడు. లింకన్ ఖడ్గాలను ఆయుధా లుగా పేర్కోడం నిజంగా అతని ముప్పుకి కారణమయేది! దీనికి పరిహారంగా అతను ఇంకొక షరతు పెట్టాడు. దానితో వ్యవహార మంతా ఇంకా హాస్యాస్పదంగా తయారైంది. లింకన్ షరతు ప్రకా రం ఇద్దరికీ మధ్యగా ఒక బల్లచెక్క నేలమీద అడ్డుగా పెట్టాలి. ఈ బల్లచెక్కనుంచి కటారి పొడుగుకాక పైన మూడడుగుల దూరంలో రెండు వైపులా గీతలు గియ్యాలి. ఇద్దరిలో ఎవరూ ఈ బల్లచెక్క దాటి ముందుకి రాకూడదు. వెనకగీతల్ని దాటి ఒక్క అడుగుకూడ వెనక్కి వెళ్ళకూడదు. తత్ఫలితంగా షీల్డ్సు తనకెంత కత్తియుద్ధంలో నైపుణ్యమున్నా, పొడుగు చేతులుగల లింకన్‌ని అందుకోలేక పోతాడు. లింకన్ గౌరవపూర్వకంగా కొన్ని అడుగులు వెనక్కి వెళ్ళి అనవసరమైన హత్య జరగకుండా ఆపగలుగుతాడు. సహాయ కులు అసలు ప్రతి స్పర్థులకంటె తీవ్రంగా కోపాగ్నుల్ని ప్రజ్వలింప జెయ్యడంలో సహాయపడ్డారు. ఇల్లినాయిస్‌లోని ఆల్టన్‌కి అవతలి వేపుగా మిస్సిసిపీ తీరాన ఉన్న మిస్సూరిలో వాళ్ళిద్దరూ అనుకున్న ప్రకారం యథాసమయంలో కలుసుకున్నారు. కాని యుద్ధం లేకుండానే వారి కలహం సర్దుబాటైపోయింది.

జరగని ఈ ద్వంద్వయుద్ధ ఫలితంగా రెండు లాభాలు కలిగాయి. లింకన్ ఆ తరువాత ఎన్నడూ తన ప్రతిపక్షుల్ని పేరులేని ఉత్తరాలతో ఎదుర్కోలేదు. లింకన్ చూపిన వీరోచిత సాహసాన్ని చూసి మేరీ టాడ్ చాలా సంతోషించి, వెంటనే వివాహానికి తయారైంది

మృత్యువుకూడా విడదీయలేని వివాహబంధనంతో వాళ్ళిద్దరూ బంధించబడేటప్పుడు కొద్దిమంది మిత్రులు మాత్రమే వారిదగ్గర ఉన్నారు. 1842 నవంబరు 4 వ తేదీని ఎలిజబెత్ నినియన్ ఎడ్వర్డుల స్వగృహంలో లింకన్ మేరీల వివాహం అతి సామాన్యంగా జరిగిపోయింది. ఈ విధంగా వారిద్దరూ మంచిలోనూ, చెడ్డలోనూ, భాగ్యంలోనూ దారిద్ర్యంలోనూ, రోగంలోనూ, అనారోగ్యంలోనూ ఒకటిగా నిలిచారు.

# కాంగ్రెసు సభ్యత్వం, న్యాయవాద వృత్తి

"1846 లో నే నొకసారి కాంగ్రెసు దిగువ సభకు ఎన్నుకో బడ్డాను."

అబ్రహాం లింకన్

న్యాయవాద వృత్తిలో అబ్రహాం లింకన్‌కి ముగ్గురు భాగ స్థులు అయారు, మొదటివాడు జాన్ టి. స్టూవర్టు. ఇతన్నిగూర్చి ఇదివరకే తెలుసుకున్నాం. ఆ తరువాత టి. లోగన్ ఆఖరివాడు హెచ్. హెర్న్‌డన్. 1841 లో స్టూవర్టుతో లింకను విడిపోగానే లింకన్ లోగన్‌తో చేరాడు. ఇల్లినాయిస్‌లోని గొప్ప న్యాయ వాదు లలో ఒకడైన లోగన్ పొట్టిగా బక్కపల్చగా ఉండేవాడు. ఎర్ర జుట్టుతో అతనుకూడా లింకన్‌లాగే చాలా సామాన్యంగా కనిపించే వాడు. అయితే అతను లింకన్ కంటె ఎక్కువ జాగ్రత్తగా తన కేసుల్ని తయారు చేసుకునేవాడు. అనుభవహీనుడైన తన భాగస్థునికి లోగన్ లా పుస్తకాల్ని ఎలా ఉపయోగించాలో, కేసుల్ని క్రమ పద్ధతిలో ఎలా తయారుచేసుకోవాలో నేర్పాడు. దీనివల్ల మునుపటి కంటె లింకన్ ఇప్పుడు మంచి అనుభవజ్ఞుడైన లాయరుగా తయా రయాడు. అయితే లోగన్ మాత్రం అతన్ని గురించి చెప్పవలసివచ్చి నప్పుడల్లా ఒక విధమైన ఈసడింపుతో చెప్పుకోతగినంత న్యాయ శాస్త్రజ్ఞానంలేని సామాన్యలాయరనే చెప్పేవాడు.

1844 లో లోగన్ తనకొడుకునే తన భాగస్థుడుగా పెట్టుకోడానికి నిర్ణయించుకున్నాడు. లింకన్ తనకి భాగస్థు లెవరూ లేక పోవడంవల్ల 26 పళ్ళ "బిల్లీ" హెర్న్డన్‌ని భాగస్థునిగా ఏర్పరచుకున్నాడు. అది హెర్న్డన్‌కే ఆశ్చర్యాన్ని కలగజేసింది. అతనికి బాగాజ్ఞాపకం. "నేను అనుభవంలేని వాణ్ణి!సామర్థ్యం, అనుభవంనాలో ఎంతగా లోపించాయో నాకు తెలుసు. కాని లింకన్, 'బిల్లీ, నిన్ను నేను నమ్ముతున్నాను, నన్ను నువ్వు నమ్ముతున్నావా లేదా'? అని హృదయం విప్పి స్పష్టంగా అడిగినప్పుడు నా కెంతో ధైర్యం కలిగింది. ఔదార్యంతో ఇచ్చిన ఆ పదవికి ఒప్పుకున్నాను."

ఈ సందర్భంలో లింకన్ చాలా ఔదార్యం చూపించాడనే చెప్పాలి. అయితే వెనుకముందులు చూసుకోకుండా అతను తొందరపడి ఈ పని చెయ్యలేదు. హెర్న్డన్‌కి ఊళ్ళోని తెలివైన రౌడీలతో రాజకీయ సంబంధం ఉంది. ఆ ప్రాంతంలో జరిగే ప్రతి ఎలక్షన్‌తోనూ వాళ్ళకి బాగా సంబంధం ఉంది. లింకన్‌కంటె అతను ఎక్కువ సుశిక్షితుడు. అనేక విషయాల్లో మంచి జ్ఞానం ఉన్నవాడు. వేదాంతంలో విశేష అభిరుచి కలవాడు. బహుశః లింకన్ ఇకనించి తనే ప్రధాన భాగస్థుడుగా ఉండాలనే ఉద్దేశ్యంతోకూడా ఈ మార్పు చేసి ఉండవచ్చును. తన సహాయక భాగస్థునిగా బిల్లీ హెర్న్డన్‌ని ఎన్నుకోడంలో లింకన్ చాలా తెలివితేటలుగానే ప్రవర్తించాడు లింకన్ యెడ అతనికిగల గౌరవం క్రమక్రమంగా వీరపూజగా పరిణమించింది. అయితే అతనికి తెలియకుండా అంతర్గతంగా లింకన్ యెడ ఒక విధమైన అసూయ కూడా హెర్న్డన్ మనస్సులో లేక పోలేదు.

లింకన్ ధరించే అవకతవక డ్రస్సుగా గాక హెర్న్డన్ చాలా నీటుగా డ్రస్సు వేసుకునేవాడు. తోలుబూట్లు, కిడ్ గ్లోవ్‌లు

ధరించేవాడు. ఇద్దరూ పొడుగుపాటి సిల్కు టోపీలు పెట్టుకునేవారు. అయితే హెర్న్డన్ టోపీ మచ్చలులేకుండా మెరుస్తూఉంటే, లింకన్ టోపీ దుమ్ము కొట్టుకునిఉండేది. దానిలో కోర్టు కాగితాలు పెట్టుకునే అలవాటు అతని కెప్పుడూ ఉండనే ఉంది.

లింకన్ చనిపోయేవరకూ ఈ విచిత్రమైన జంట అన్యోన్య సహకారులుగా ఉన్నారు. వీరిభాగస్థతని ధ్రువపరుచుకునేందుకు కోర్టు కాగితాలేమీ వ్రాసుకోలేదు. ఫీజు చెరి సమానంగా పంచుకునేవారు. హెర్న్డన్‌కి లింకన్ భార్య మేరీకి ఎన్నడూ పడకపోయినా ఆమె బిల్లీకి, లింకన్‌కి మధ్య కలుగజేసుకోలేదు.

ఇటువంటి వినయవిధేయతలుగల లా భాగస్థుడు దొరకడం నిజంగా లింకన్ అదృష్ట మనాలి. ఎందుచేతనంటే ఇంటిలో అతని జీవితం ఎప్పుడూ ఆనందమయంగా ఉండేది కాదు. మనకు దొరికే కొద్ది ఉత్తరాలను, టెలిగ్రాముల బట్టి చూస్తే మేరీ అబ్రహాం ప్రేమ నిశ్చలమైనదని తెలుస్తుంది. వాళ్ళు సుఖదుఃఖాలను పంచుకునేవారు. రాజకీయ ఉద్యమాల రాపిడికి తట్టుకుంటూ నిలిచి ఇద్దరూ కలిసి అతి జయప్రదంగా జీవన యాత్రను సాగించారు. ఇద్దరి మనస్సులూ కలిసిపోయినయి.

అయితే మేరీ తలనొప్పిపనులూ, చిరాకు స్వభావమూ, నోటి దురుసుతనమూ తరచు గృహస్థ జీవితంలో శాంతి లేకుండా చేసేవి. భర్త మోటుతనాన్నీ, అతని నాటు అలవాట్లనీ, వేళాకోళాలాడే ధోరణినీ, అన్నిటినీమించి నేలమీద వెల్లకిలా పడుకుని కాళ్లు తలపైకి తెచ్చుకుని చదివే పిచ్చి అలవాటునీ ఆమె విమర్శించకుండా ఎప్పుడూ వదిలిపెట్టేది కాదు. అయితే మేరీకి కూడా కొన్ని మితి మీరిన అల

వాళ్లు లేకపోలేదు. ఆమెకు తుఫాను గాలి అంటే తగనిభయం. తుఫాను సూచనలు కనిపించిన తత్‌క్షణం లింకన్ ఎక్కడున్నా సరే ఆమె దగ్గిరికి పరిగెత్తుకు రావలసిందే!

వాళ్ళు వివాహమైన కొత్తలో స్ప్రింగ్‌ఫీల్డులోని గ్లోబ్ టావెరన్‌లో వారానికి 4 డాలర్లు ఇచ్చి ఉండేవాళ్ళు. ఇక్కడుండగానే వాళ్ళకు మొదటి కొడుకు రాబర్ట్ టాడ్ లింకన్ 1843 ఆగష్టులో పుట్టాడు ఆ మరుసటి సంవత్సరం జనవరిలో 1500 ల డాలర్లు పెట్టి ఇల్లు కొనుక్కున్నారు. దాన్ని కొంత మార్పు చేసి సుఖంగా అందులో ఉంటున్నారు. 1861 లో వాషింగ్‌టన్‌లోని వైట్‌హౌస్‌కి వెళ్ళేవరకూ వాళ్ళు ఈ ఇంట్లోనే ఉన్నారు. స్ప్రింగ్ ఫీల్డులోని ఇంట్లో ఉండగానే ఈదంపతులకు ఇంకొక ముగ్గురు పిల్లలు కలిగారు. 'ఎడ్డీ' అని పిలువబడే ఎడ్వర్డ్ బేకర్ 1846 లో పుట్టాడు; 'విల్లీ' అనే విలియం వాలెస్ 1850 లో పుట్టాడు; టాడ్ అని ముద్దుగా పిలువబడే థామస్ కడగొట్టుకొడుకు; 1853 లో పుట్టాడు. ఈ నలుగురిలో రాబర్ట్ టాడ్ లింకన్ మాత్రమే పెరిగి పెద్దవాడయాడు.

ఈ పిల్లలయెడ వారికిగల ప్రేమ, వారి ఆరోగ్యం విషయంలో బెంగ, పిల్లలు జబ్బుగా ఉన్నప్పుడు మంచాల దగ్గిర రాత్రింబగళ్ళు కనిపెట్టుకుని ఉండడం మొదలైనవాటివల్ల మేరీ అబ్రహాంలు బాగా కలిసి మెలిసి ఉండవలసి వచ్చింది. ఈ అతి గారాబం చేసే తల్లి తండ్రులు పిల్లలనే తగిన క్రమశిక్షణ ఇవ్వలేక పోయారు. లింకన్ ప్రేమించే వాళ్ళందరి యెడలా తనకి సహజంగా ఉన్న దురభిప్రాయానికి అనుగుణంగా బిల్లీ హెర్న్‌డన్ వాళ్ళ పిల్లలను అల్లరివెధవ లనేవాడు. ఆదివారం ఉదయం లింకన్ పిల్లల్ని వెంట

పెట్టుకుని ఆఫీసుకి వచ్చినప్పుడు వాళ్ళు హెర్న్డన్‌కి పిచ్చెక్కించేసే వాళ్ళు. వాళ్ళుచేసే అల్లరి చూసీ చూడకుండా లింకన్ గట్టిగా పైకి ఏదో చదువుకుంటూ ఉండేవాడు. ఆ అల్లరిపిల్లలు గదంతా నాశనం చేసి పారేసేవాళ్ళు. డ్రాయర్లు తెరిచేసి పెట్టెలు బద్దలు కొట్టేసి కాగితాలు చిందరవందరగా పారేసేవాళ్ళు. గోడనివేసి కొట్టి కలం పాళీలు విరగకొట్టేవాళ్ళు. సిరాబుడ్లు కాగితాలమీద బోర్లించేవాళ్లు ఉత్తరాలన్నీ గది నిండా విరజిమ్మేసి వాటిని కాళ్ళతో తొక్కుతూ గంతులు వేసేవాళ్ళు. వాళ్ళని అదుపు ఆజ్ఞలలో ఉంచడం చాలా అవసరం అని హెర్న్డన్ ఉద్దేశ్యం. అయితే వాళ్ళతో పాటుగా ఆటలాడుతూ గంతులువేసే లింకన్ మేరీలాగే వాళ్ళ చెడ్డఅలవాట్లనీ గుణాలనీ మార్చడానికీ సక్రమ శిక్షణ ద్వారా వాళ్ళని మంచి మార్గంలో పెట్టడానికీ, ఎంతమాత్రం ప్రయత్నించే వాడు కాడు. లింకన్ తన చిన్నతనంలో తండ్రిచేత బాగా దెబ్బలు తిని తిని బాధ పడ్డవాడు కనుక ఇప్పుడు దానికి ప్రతిచర్యగా తన పిల్లల్ని ఈ విధంగా నెత్తిని ఎక్కించుకుంటున్నాడేమో అనిపిస్తుంది.

ఇంతేకాక లింకన్ పిల్లల్ని ఎప్పుడూ ప్రేమగా చూసేవాడనీ, వాళ్ళెంత విసిగించినా ఎంతో ఓపికతో సహించేవాడనీ ధ్రువపరచే కట్టు కథలు మనకెన్నో దొరుకుతాయి. లింకన్ ఆరడుగుల నాలు గంగుళాల పొడుగు. రోడ్డుమీద రెండు చెట్లకి మధ్య ఏడడుగుల ఎత్తున ఒక తీగె కడితే మామూలుగా ఇతరులకేం ఇబ్బంది కలగదు. నడిచేటప్పుడు వాళ్ళెవరికీ ఈ తీగె అడ్డురాదు. అయితే లింకన్ ఆ త్రోవని నడిస్తే మాత్రం తప్పక అతని టోపీ ఆ తీగెకి తగిలి కింద పడిపోతుంది. టోపీలో అతను దాచుకున్న కాగితాలన్నీ కింద చెల్లా చెదరుగా పడిపోవడంచూసి తప్పట్లుకొట్టుకుంటూ ఆతాడు కట్టి పక్క పొదలలో దాగి చూస్తూన్న పిల్లలు కడుపు లుబ్బే

లాగ నవ్వుతూ బయటికి వచ్చేవాళ్ళు. ఎవరికీ నష్టంలేని ఈ తమాషాకి ఆ చిన్న పిల్లలలాగే అతనూ ఆనందించేవాడు లింకన్‌కి ఇటువంటి తమాషాలంటే సరదా!

లింకన్ లా ప్రాక్టీసు చేసుకుంటూ జీవించసాగాడు. అయితే అతనికి రాజకీయాలమీద ఎక్కువ ఆసక్తి ఉండేది. రాష్ట్ర శాసన సభలో నాలుగుసార్లు సభ్యుడుగా ఉన్న తరవాత తనసాటి విగ్గులచేత కాంగ్రెసుకి నామినేట్ చెయ్యబడే స్థితికి తను వచ్చినట్టుగా భావించాడు. రెండు సార్లు ఈ గౌరవాన్ని అందుకోలేక అతను తన జిల్లాపార్టీ నాయకులతో తనకు 1846 లో ఛాన్సు ఇవ్వాలని ఒప్పందం చేసుకున్నాడు. ఆ సంవత్సరం విగ్గులు అతన్ని నామినేటు చేయగా తన డెమోక్రాటిక్ ప్రతికక్షిని ఓడించి, తను అనుకున్నంత విజయానందాన్ని పొందకుండానే అతను 1847 డిసెంబరులో ప్రజాప్రతినిధి సభలో తన స్థానాన్ని స్వీకరించాడు.

ఇల్లినాయిస్‌కి సంబంధించిన ఈ ఏకాకి కాంగ్రెసు సభ్యుడూ, అందమైన లావుపాటి గయ్యాళి భార్యా స్టీమ్‌లాంచిమీద, రైలుమీద వాషింగ్‌టన్‌కి తమ దీర్ఘప్రయాణం సాగించేవాళ్ళు. ఆ రోజుల్లో దేశ రాజధాని 40,000 జనసంఖ్యతో చాలా సందడిగా ఉండేది. ఇందులో 30,000 తెల్లవాళ్ళూ 10,000 నీగ్రోలూ. వీరిలో ఐదింట ఒకవంతు బానిసలే. నిజానికి, రాజధానిభవనానికి ఎట్టఎదుట ప్రత్యక్షంగా కనిపించే బానిసల మార్కెట్టుని ఊరివారంతా సమర్థించేవారు. దేశంలో కల్లా ఇదే పెద్దమార్కెట్టు,

1847 లో ప్రభుత్వకార్యాలయం తాత్కాలికంగా ఒక కర్ర భవనంలో ఉండేది. ఇప్పుడు రెండువైపులాఉన్న భవనాలు అప్పుడు లేవు. బుధవారం శనివారం సాయంత్రం మప్పుడు వైట్‌హౌస్



తాడుకి తగిలి హేంట్ పైకి లేచింది.

ముందున్న స్థలంలో నౌకా దళంవారు బ్యాండ్ వాయించి ప్రజలను వినోదపరచేవారు. కాని కార్యనిర్వాహక కార్యాలయ భవనానికీ నదికీమధ్యనున్న స్థలం మలేరియా కలగజేసే బురద గుంటలతోనిండి ఉండేది. పెన్సిల్వేనియా ఎవెన్యూ నల్లరాతి రోడ్డుతో ఎగుడు దిగుడుగా ఉండేది. ధనికుల వాహనాలు ఆ రోడ్డు మీద ధ్వనిచేసుకుంటూనడుస్తూఉండేవి. మిగిలిన వీథులన్నీ స్ప్రింగ్‌ఫీల్డు రోడ్లలాగే బురదతోటో, దుమ్ముతోటో కాలాన్నిబట్టి, నిండిపోయి ఉండేవి. ఇక్కడ కూడా రోడ్ల పక్క పెంటకుప్పలమీద ప్రతి చోటా వరిచిత్రమైన పందులూ, బాతులూ, పొట్టిబాతులూ ఉండేవి. మేడలూ మిద్దెలూ ఒక పద్ధతి లేకుండా చిందరవందరగా ఉండేవి,

ఎలక్షన్లలో గెలిచినందుకు లింకన్ సంతోషించలేదు. మేరీ వాషింగ్‌టన్ నగరాన్ని చూసి చాలా నిరుత్సాహం పొందిందని చెప్పాలి. టాడ్ వంశపుఆడబడుచుగా కంటకీవారసత్వం ఆమెకుఉన్నా, రాజధాని నగరంలో ఆమెకు సాంఘికంగా పరపతి లేదు. ఆమెకు ఎప్పుడో ఏ కొద్దో ఆహ్వానాలు వస్తూండేవి. లింకన్లు ఒక బోర్డింగ్ హౌస్‌లో గదులు అద్దెకు తీసుకున్నారు. కాంగ్రెస్ లైబ్రరీ ఇప్పుడున్న స్థలంలో ఒక వేపుగా ఈ బోర్డింగ్‌హౌస్ ఉండేది. ఏబ్ అతి త్వరలోనే ఇక్కడివారిలో చాలా ప్రసిద్ధికెక్కాడు. అతని కథలు చమత్కారోక్తులు వారంతా చాలా ఆనందంతో వినేవాళ్ళు భోజన సమయాల్లో తప్ప మేరీ తనగది విడిచి బయటకు వచ్చేదికాదు. ఆమె పరిచితులు చాలా తక్కువమంది. సుమారు మూడు నెలలు ఈ విధమైన నిరుత్సాహ జీవితం గడిపిన తరువాత ఆమె కంటకీలోని తన స్వగృహానికి వెళ్ళి తన భర్తకోసం మొదటి సెషన్ అయేవరకూ ఎదురు చూస్తూంది.

ఈ వియోగమే మనకు మేరీ, అభ్రహాంల పరస్పర ప్రేమని వ్యక్తపరచే వాఙ్మాలమైన సాక్ష్యం ఇస్తూంది లింకన్ ఉత్తరాలు నాలుగూ మేరీ, ఉత్తరం ఒకటీ ఈ సందర్భంలో భద్రం చేయబడినవి. తరుచు వివాదాల కాస్పదమైన వారిజీవితాల్లో ఒకరిని ఒకరు విడిచి ఉండలేని విరహవేదన బాగా ఉందనీ, అంతేకాక పిల్లల విషయంలో వారిద్దరూ సమానసుఖదుఃఖాలకు ఎప్పుడూ భాగస్వాములుగా ఉండేవారనీ మనకు వాటివల్ల ధ్రువపడుతుంది,

లింకన్ తన భార్యపేర వ్రాసిన ఉత్తరం ప్రేమలేఖ అని మనం ఒప్పుకోకపోయినా అతను ఆ పాతగదిలో ఏకాంతంగా ఉండడం సహించలేక పోయేవాడు. అతను ఎడ్డీ చిన్నకాళ్ళకు సరిపడే మేజోళ్ల కోసం వెతికాడు. వీలైనంతవరకు మేరీ ఆనందంగా గడపాలని అతను కోరాడు. తన భార్యకు తలనొప్పి బాధ తగ్గిందని అతను ఆశిస్తున్నా నన్నాడు. మేరీ మంచి అందంగాను, లావుగాను, చిన్నదిగాను తయారై మళ్ళీ పెళ్ళి చేసుకోడానికి తగిన స్థితికి వస్తూందని అతను వెళాకోళాలాడాడు. పిల్లల్ని గూర్చి వ్రాస్తూ అతనన్నాడు: "కుర్రకుంకలు నాన్నని మరిచిపోతారేమోసుమా!" అతను "నీ అతి ప్రియమైన" అని సంతకం పెట్టాడు. ఇది కల్పితకథలలోని ప్రణయంలా లేకపోయినా, ఇటువంటిది భార్యాభర్తలలో సామాన్యంగా కనిపించే సంసారపక్షం గాఉండే ప్రేమసందేశంగా మనం భావించవచ్చును.

కొత్తగా వచ్చిన కాంగ్రెసు సభ్యుడుగా లింకన్ పదమూడవ కాంగ్రెసు మొదటి సెషన్‌లో చాలా వెనుకగా కూచునేవాడు. సభ్యులందరిలోను అనామకుడుగా ఉండేవాడు. ఆ శాసన సభాస్థలంలో చారిత్రకంగా ప్రసిద్ధికెక్కినవాళ్ళు ముందు ముందు ప్రసిద్ధికెక్కబోయేవాళ్ళు అనేకులు ఉండేవారు.

వీరందరిలోకీ పేరొందినవాడు పూర్వపు అధ్యక్షుడు జాన్ క్విన్సీ ఆడమ్స్. విగ్గుపార్టీకి చెందిన ఎనభై యేళ్ళ ఈ శ్రీమంతుడు తన దేశానికి విశ్వాసపాత్రుడు. బహిరంగంగా లింకన్ కంటె ఎక్కువగా బానిసత్వాన్ని ఖండించేవాడు. ఏబ్ తల ఇటు తిప్పినా అటుతిప్పినా ఒకవేపు అలెగ్జాండర్ హెచ్ స్టీఫెన్స్ ఇంకొకవేపు ఏన్డ్రూ జాన్సన్లు కనిపిస్తారు. అలెగ్జాండర్ హెచ్. స్టిఫెన్స్ జార్జియావాడు. ఒకానొకప్పుడు స్టేట్ కౌన్సిల్‌కి వైస్ ప్రెసిడెంటు కాబోయేవాడు. టెన్నిసీనించి వచ్చిన ఏన్డ్రూజాన్సన్ లింకన్ అధ్యక్షతలో సంయుక్త రాష్ట్రానికి ఉపాధ్యక్షుడు కాబోయేవ్యక్తి, పెన్సిల్వేనియాకి చెందిన డేవిడ్ విల్మోట్ బానిసత్వాన్ని ఖండించే 'విల్మోట్ సవరణ తయారుచేసిన వాళ్ళలో ఒకడును మొత్తం సభలో వాగ్వివాదాలకు ఎక్కువగా గురిఅయ్యేవ్యక్తి, తన పెద్దచేతుల్నీ పాదాల్నీ ఏం చెయ్యాలో తెలియని ఇల్లినాయిస్ నుంచి వచ్చిన పొడుగుపాటి కాంగ్రెసు సభ్యుడే తమ అందరిలోకీ గొప్పవాడు కాబోతున్నాడని అంటే వీరిలో ఏ ఒక్కడూ నమ్మేవాడు కాడు.

పదమూడవ కాంగ్రెస్ చర్చించిన సమస్యలు చాలాఉన్నాయి. కాని అన్నిటికంటె తీవ్రరూపందాల్చినవి మెక్సికన్ యుద్ధమూ, బానిసత్వ విషయంలో క్రుతిమించి రాగాన పడుతున్న అంతః కలహాలు. ఒకొక్కప్పుడు రెండు సమస్యలూ ఒక దానితో ఒకటి కలిసిపోయేవి!

1847 లో లింకన్ తనస్థానాన్ని అధిష్ఠించేటప్పటికి మెక్సికన్ యుద్ధం పూర్తిఅయినట్లే అయితే ఎన్ని విజయాలు సాధిస్తూన్నా యుద్ధశ్రమ ఎక్కువగా బాధించేది. అంతేకాక, ప్రెసిడెంట్ పోల్క్ డెమోక్రాటు. దీనా దానా విగ్గులకు ఆయనంటే ఇష్టం లేక పోయింది.

తన మొదటి టరములో లింకన్ అధమపక్షం రెండు ముఖ్య మైన కమిటీలలో సభ్యుడుగా పని చేశాడు. కాని ఇల్లినాయిస్ పత్రికలలో కూడా అతనిపేరు ఒక్క సందర్భంలో మాత్రమే పేర్కొనబడింది. అతను "స్థల తీర్మానాల"ను ప్రతిపాదిస్తూ మొట్ట మొదటి సారిగా యుద్ధరక్తం చిందింది మెక్సికన్ భూమిమీదే ననీ, తద్వారా అమెరికన్లే దండెత్తి వెళ్ళిన విషయం స్పష్టపడుతూందనీ ప్రెసిడెంటు పోల్క్ చేత ఒప్పిండానికి ప్రయత్నించాడు. చరిత్రకారులు ఈ విషయంలో ఇంకా ఇదమిద్ధమని ఏ సంగతీ తేల్చకుండా ఉన్నారు. పై తీర్మానాన్ని బట్టి లింకన్ కాని సంగమో జర్నల్ కాని యుద్ధ ప్రారంభానికి మెక్సికన్లే కారణమనే విషయాన్ని ఒప్పుకోడం లేదని స్పష్టపడుతూంది. లింకన్ తనజీవిత కాలమంతా యుద్ధాన్ని బహిరంగంగా ద్వేషించేవాడు. ఈ తీర్మానం ద్వారా విగ్గుపార్టీ బలం ఎక్కువై 'ప్రెసిడెంటు పోల్క్' అతని పార్టీవారైన డెమోక్రాట్లు అపఖ్యాతిపాలు కావాలని, తరువాత అధ్యక్షపదవికి జరిగిన ఎన్నికలో విగ్గు అభ్యర్థే ఎన్నుకోబడాలని కూడా లింకన్ ఉద్దేశ్యం.

"స్థల తీర్మానాల" సద్యః ఫలితంగా అతని రాష్ట్రంలోనూ కాంగ్రెసు జిల్లాలోనూ కూడా అత్యంత అపఖ్యాతిపాలైన కాంగ్రెసు సభ్యుడుగా లింకన్ తయారయాడు. లింకన్ స్నేహితులు ఇరుగు పొరుగు వారు చాలమంది యుద్ధంలో చనిపోవడమో గాయ పడడమో జరిగింది బిల్లీ హెర్న్డన్ తను వ్రాసే ప్రతి ఉత్తరం లోనూ ప్రతికక్షుల్ని ఖండించడంలో కొంత మార్దవం చూపించ మని లింకన్ని ఎంతగానో బతిమాలాడు. కాని లింకన్ తన యుద్ధ వ్యతిరేకత పోల్క్ వ్యతిరేకత, డెమోక్రాట్ వ్యతిరేకత పరిహారం చేయడం ఎంతమాత్రం వదిలిపెట్టలేదు.

ఇంకొక సందర్భంలో అతను పూర్తిగా ఆచరణసాధ్య రాజకీయాలతోనే తృప్తిపడి ఊరుకోలేదు. కొలంబియా జిల్లాలోని బానిసల్ని క్రమ క్రమంగా స్వతంత్రుల్ని చెయ్యాలని అతను పెట్టిన తీర్మానం - ఈ సమస్యని అతను అహింసా, మితవాద పద్ధతుల్లో విడదీయడానికి చేసిన మొదటి ప్రయత్నంగా మనం భావించవచ్చును. అయితే అతని ప్రయత్నం ఫలించలేదు.

రెండవ సెషన్ అయిన తరువాత లింకన్ తిరిగి స్ప్రింగ్‌ఫీల్డు చేరుకున్నాడు. తమ స్వగృహంలో భార్యా పుత్రులతో ఉంటూ ఏదైనా మంచి ప్రభుత్వోద్యోగం లభిస్తుందేమోననే ఆశతో ఎదురు చూడ సాగాడు. కాని ఆరెగాన్ ప్రాంతానికి సెక్రటరీగా నియోగించబడ్డప్పుడు దూర పశ్చిమారణ్యాల్లో ఉండడానికి ఎంతమాత్రం ఇష్టపడని మేరీ అతనికి ఆ పదవిని తిరస్కరించడానికి తోడ్పడింది. రాజకీయోద్యోగానికి తనకి ఇకముందెట్టి సుయోగం లేకుండా తానే చేసుకున్నట్టు లింకన్‌కి స్పష్టపడింది.

అతను తిరిగి తన లా ప్రాక్టీసు ప్రారంభించాడు. ఆలోచనలతో, విచారంతో ఎన్నో ఏళ్ళు గడిచాయి. ఇంగ్లీషు జుడీషియల్ జిల్లాకి సంబంధించిన సర్క్యూట్ కోర్టు ఇల్లినాయిస్ పచ్చికబయళ్ళలో 1200 చతురపు మైళ్ళు వ్యాపించి ఉండేది ఈ వృత్తిలో లింకన్ ఒక చోటినుంచి ఒకచోటికి తిరుగుతూ ఒకొక్కసారి వారాలూ, నెలలూ ఇంటికి చాలా దూరంలో గడపవలసివచ్చేది. మంచులో వర్షంలో, ఎండలో, చలిలో అతను ఎప్పుడూ సర్క్యూట్ తిరుగుతూనే ఉండేవాడు.

ఒక్కొక్కప్పుడు గుర్రంమీద ఎక్కి వెళ్ళేవాడు. తరుచు డబ డబలాడే బగ్గీలో ప్రయాణం చేస్తూండేవాడు. వంగిన తన భుజాలచుట్టూ

శాలువ ఒకటి కప్పుకుని, చేతిలో ఎప్పుడూ ఏదో పుస్తకం పట్టుకుని ఉండేవాడు. 1850 లో అతను అప్పుడప్పుడు రైలుమీద కూడా తిరిగేవాడు. ఈ సమయంలోనే అతను యూక్లిడ్ మొదటి ఆరు పుస్తకాలూ బాగా అభ్యసించాడు మనస్సుని వశంలో ఉంచుకోడానికి జామెట్రీ ఉపయోగిస్తుందని ఆయన నమ్మకం కవిత్వం చదివేవాడు పద్యాలు కంఠస్థంచేసేవాడు.

వివిధరకాలైన నగరాలకు, గ్రామాలకు ఈ కోర్టు పోతూ ఉండేది! అతను వెళ్ళిన చోటల్లా జడ్జీలనూ, ఇతర ప్లీడర్లనూ కలుసుకునేవాడు. వాళ్ళతో అర్ధరాత్రివరకూ రాజకీయ చర్చలు జరుపుతూ హాస్యప్రసంగాలతో గడిపేవాడు. లింకన్ సాధారణంగా వాళ్ళందరికీ తలలో నాలికగా ఉండేవాడు. తనవిచారంలోనుంచి తేరుకొని తమాషా కథలు, విచిత్ర సంఘటనలు అద్భుతమైన అనుభవాలు వాళ్ళకి వినిపించాడు. కోర్టులో తన కేసుల్ని అతి సరళమైన హేతువాద సమ్మతమైన వాదనలతో నడిపేవాడు. ఆయన గెలిచిన కేసులకంటె ఓడిన కేసులే తక్కువ. అయితే వరసగా మూడు నెలలవరకు అన్ని కేసుల్లోనూ ఓడిపోయాడు.

లింకన్ అప్పటి కింకా తన వృత్తిలో శిఖాగ్రాన్ని అందుకోలేదు. కొన్ని సంవత్సరాలు గడిచాక గాని ఆయన ప్రతిభ బయట పడలేదు. ఒకసారి ఇల్లినాయిస్ కేంద్ర రైలురోడ్ వారి కేసులో 5000 డాలర్ల ఫీజు వచ్చింది. అయితే ఒక దుష్ట ఏజంటుచేత తన గవర్నమెంటు పెన్షనులో సగం అపహరించబడిన ఒక వితంతువు కేసును ఫీజు పుచ్చుకోకుండా నడిపించినప్పుడు ఆయన ఎక్కువ ఆనందం పొందాడు!

హత్యాపరాధంలో చిక్కుకున్న డఫ్ ఆర్మ్‌స్ట్రాంగ్ కేసులో కూడా లింకన్ దమ్మిడీ తీసుకోకుండా పని చేశాడు. న్యూసాలెమ్‌లో

ఉండగా లింకన్‌కి స్నేహితులైన జాక్ ఆర్మ్‌స్ట్రాంగ్, హన్నా ఆర్మ్‌స్ట్రాంగ్‌ల కొడుకే ఈ యువకుడు స్వచ్ఛమైన వెన్నెలలో తాము ఆర్మ్‌స్ట్రాంగ్‌ని చూశామని అతనే జేమ్సు మెట్జికర్‌ని పంగలకర్రతో కొట్టి చంపాడని సాక్షులు చెప్పారు. ఇందులో ప్రధానసాక్షి ఎల్లెన్ అనే ఇళ్ల పెయింటరు.

ఇటువంటి కేసుల్లో లింకన్ చాలా ప్రతిభ కనబరచేవాడు. ఈ సందర్భంలో కూడా ఆయన అసాధారణమైన తెలివి తేటలలో ప్రవర్తించాడు.

తప్పుడు సాక్ష్యంగా తను భావించే ఆసాక్ష్యం పూర్తి కాగానే లింకన్ జ్యూరీలవేపు తిరిగి అన్నాడు: "ఈ ఎల్లెన్ అనేవ్యక్తి సాక్ష్యం సరికాదన్న విషయం నేనిప్పుడు రుజూ చేస్తాను. ఇతను చెప్పినవన్నీ వట్టిఅబద్ధాలు. ఆరమ్‌స్ట్రాంగ్ మెట్జికర్‌ని పంగల కర్రతో కొడుతూండగా ఇతను చూడలేదు; వెన్నెల వెలుగులో వారి దెబ్బలాటని ఇతను చూశాననడం కూడా వట్టిబూటకం, ఎందుచేతనం టారా? ఆ రోజు రాత్రి ఆకాశంలో చంద్రుడేలేడు."

ఒక పంచాంగంతీసి అక్కడివారందరికీ లింకన్ తను చెప్పినది నిజమని ధ్రువపరిచాడు. ఆ దెబ్బలాట సమయంలో చంద్రుడు ప్రకాశించడం లేదు. అందుచేత ఎల్లెన్ తను తళతళలాడే వెన్నెల్లో చూశానని చెప్పింది పూర్తిగా అబద్ధం.

జ్యూరీలకు తనవ్యక్తంలో లింకన్ చాలా జాగ్రత్తగా తన క్లయింటు నిరపరాధిత్వాన్ని నిరూపించేసాక్ష్యాన్ని సమీకరిస్తూ అక్కడ ఉన్నవారి హృదయాలన్నీ ద్రవించేలాగ తన కేసుని ఈ విధంగా ముగించాడు :

"మహాశయులారా! అదిగో అక్కడకూచున్న ఆ యువతి పక్షంలో ప్రతి ఫలమేమీ ఆశించకుండా నేను పనిచేస్తున్నాను" - అంటూ లింకన్ ఏడుస్తూన్న డఫ్ తల్లి హన్నా ఆర్మ్‌స్ట్రాంగ్ కేసి చూపించాడు-"నాకు డబ్బులేని పరిస్థితిలో ఈమె నా మాసిన చొక్కాలు ఉతికింది." అతను న్యూసాలెమ్‌లో తను యువకుడుగా ఉండగా గడిపిన రోజుల్ని వర్ణించాడు. తను దమ్మిడీ చేతిలో లేని పరిస్థితిలో ఏవిధంగా ఈ డఫ్ ఆర్మ్‌స్ట్రాంగ్ తల్లిదండ్రులు తనకు కావలసిన ఆహారం, బస మొదలైన ఆతిథ్యాన్ని ఇచ్చినదీ చెప్పాడు. అంత దయాదాక్షిణ్యాలు గల తల్లిదండ్రులకు పుట్టి ఇతను హత్యా పరాధం చెయ్యడ మనేది అసంభవం!

లింకన్ లాగే హన్నా ఆర్మ్‌స్ట్రాంగ్ కూడా ఆవేశంతో కంపించింది. డఫ్‌ని నిరపరాధిగా నిర్ణయిస్తూ జ్యూరీలు చేసిన నిర్ణయం, లింకన్ నిర్ణయాన్ని ధ్రువపరచింది. "నిరపరాధి" అనే తీర్పు చెప్పగానే లింకన్ అన్నాడు, "ఈ పాఠం కాలక్రమాన ఇతనికీ, ఇతరులకీ కూడా మంచి పాఠంగా ధ్రువపడుగాక అనే నేను దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను."

అయితే, లింకన్ చలిలోను, పొగమంచులోను, వానలోను ఎండలోను సర్క్యూటు సాగిస్తూన్న 1850 కి ఇంకా ఎన్నో సంవత్స రాల తరవాత కాని "ఆల్ మానక్ మర్డర్" వెలువడలేదు.

లోతుకళ్ళూ, దీర్ఘాలోచనా ముద్రా అపసవ్యపు వేషం, బూట్ల దాకా దిగని పంట్లాం, పసుపు పచ్చనిపొట్టి ఫ్లానల్ నైట్ గౌను-అన్నీ కలిసి ఆయన బసచేసిన పూటకూటి ఇళ్ళల్లోనూ, హోటళ్ళలోనూ విచిత్రజీవిగా కనిపించేవాడు. ఈ వాతావరణంలో ఉంటూ ప్రపంచం ఎన్నడూ విస్మరించజాలని గొప్పరాజకీయతత్వ వేత్తగాను మానవో ద్ధారకుడుగాను పరిపక్వతనందడానికి లింకన్‌తన సాధననీ ఆలోచనా శక్తినీ సాగించాడు.

# గృహచ్ఛిద్రం

*"నాకు రాజకీయాల్లో ఆసక్తి సన్నగిల్లుతూంది. అయితే, మిస్సోరీ రాజీ భగ్నమవడంతో నేను మళ్లీ మేల్కొన్నాను."*

అబ్రహాం లింకన్

అంతర్యుద్ధానికి నలభై ఏళ్ళ క్రితంనుంచీ బానిసత్వాన్ని ఆమోదిస్తూఉన్న దక్షిణరాష్ట్రాలకూ, నిర్మూలనంకోరే ఉత్తర రాష్ట్రాలకీ మధ్యగల శత్రుత్వం ఒక విధంగా ఉపశమించి ఉండేదని చెప్పవచ్చు. 1820 లో యూనియన్‌లో ఇరవై రెండు రాష్ట్రాలే ఉండేటప్పుడు రెండు పక్షాల తరఫునా పదకొండు పదకొండు రాష్ట్రాల చొప్పున ఉండేవి. ఈ సమానత్వాన్నే ఇకముందు కూడా నిలపాలనే ఒప్పందం వాటి మధ్య జరిగింది. మేయిన్ బానిసత్వ వ్యతిరేక రాష్ట్రంగా యూనియన్‌లో చేరితే, మిస్సోరీ బానిసత్వ పక్షంలో చేరింది.

ఈ సుప్రసిద్ధమైన "మిస్సోరీ ఒప్పందం"లో ప్రధానమైన ఒక క్లాజు ఉంది. లూయిజియానాలో క్రయంపొందినభాగం 36° 30" అక్షాంశరేఖ మీద ఉత్తరాన ఉంది కనుకనూ, ఇంకా అది రాష్ట్రపు హోదాను పొందలేదు కనుకనూ దానిలో బానిసత్వం శాశ్వతంగా నిర్మూలింపబడాలనే పవిత్ర ప్రతిజ్ఞ చెయ్యబడింది.

1858 జనవరిలో సెనేటర్ స్టీఫెన్ ఏ. డగ్లస్ సెనేటులో ఒక బిల్లు ప్రతిపాదించాడు. అది దేశాన్నంతటినీ అట్టుడికించడమే గాక ఉత్తర, దక్షిణాప్రాంతాలమధ్య మనస్పర్థల్ని బాగా రగిలించింది. కాన్సాస్ నెబ్రాస్కా శాసనం మిస్సూరీ ఒప్పందాన్ని భంగపరచడమే గాక బానిసత్వం ఎగబ్రాకకుండా చెయ్యడానికి ఏం చెయ్యాలనే విషమ సమస్యను తిరిగి లేవదీసింది.

నెలల తరవాత వాగ్వివాదాల పర్యవసానంగా ఈ డగ్లస్ తీర్మానాన్ని కాంగ్రెసులోని రెండు సభలూ ఆమోదించినయి దీని ప్రకారం ఉత్తరప్రాంతానికి చెందిన కాన్సాస్, నెబ్రాస్కాలలోని భాగం తమ ఇష్టంప్రకారం బానిసత్వాన్ని ఆమోదించడం గాని నిర్మూలనంచెయ్యడంగాని చెయ్యడానికి స్వాతంత్ర్యాన్ని పొందాయి. బానిసత్వాన్ని వ్యాపించకుండా చెయ్యాలని చూసే లింకన్ వంటి వారికి ఈ ప్రాంతంలో బానిసత్వ నిర్మూలనం చెయ్యాలనే పవిత్ర ప్రతిజ్ఞకి భంగం వాటిల్లినట్టు తోచింది.

బానిసత్వ పక్షవాదులకూ, బానిసత్వ వ్యతిరేక వాదులకీ మధ్య జరిగే తీవ్ర సంఘర్షణలకు కాన్సాస్ ప్రధాన రంగ స్థలమైంది. రెండు పక్షాల వారూ గుర్రాలమీదా, వాగన్లమీదా ఎక్కి కాన్సాస్ రాష్ట్రంలోకి వస్తున్నారు. తుపాకులు, కత్తులు పట్టుకుని బానిసత్వ సమస్యపై జరిగే ఏ ఎలక్షన్‌లోనైనా ఒక పక్షాన్ని ఒక పక్షం ఓడించడానికి నడుం కట్టి నిలబడ్డయి.

కాని యుద్ధరంగంగా మారిన కాన్సాస్‌లో దోపిడులు, తుపాకీ కాల్పులు, తగుల బెట్టడాలు ప్రారంభించకముందే కొత్త శాసనాన్ని గూర్చిన వాగ్యుద్ధాలు దేశమంతటా చెలరేగాయి. అత్యంతప్రధానమైన ఈ సమస్యపై చెలరేగే ఈ యుద్ధంలో లింకన్



బ్లూమింగ్టన్‌లో మహోపన్యాసం

తన కంఠాన్ని, తార్కికశక్తినీ ఉపయోగించకుండా ఊరికే చూస్తు ఎలా ఉండగలడు? ఈ సంఘర్షణలో తన పూర్వపు మితవాదపక్షమైన విగ్ పార్టీ చీలి నాశనమైపోవడం చూశాడు. రిపబ్లికన్లమని చెప్పుకునే వ్యక్తులతో కూడిన ఒక శక్తిమంతమైన కొత్తపార్టీ రోజు

రోజుకీ అభివృద్ధి చెందుతూ బానిసత్వవ్యాప్తిని అరికట్టడానికి బహి రంగంగా నడుముకట్టి రంగంలోకి రావడంకూడా గమనించాడు.

పూర్తి మార్పునుకోరే ఈ రిపబ్లికన్లలో వెంటనే జేరకపోయినా లింకన్ కాన్సాస్ - నెబ్రాస్కా శాసనాన్ని ఖండించడంలో ఎంతమాత్రం వెనుకంజ వెయ్యలేదు.

1855 ఫిబ్రవరి 8 వ తారీఖున లింకన్ యునైటెడ్ స్టేట్సు సెనేటుకి నిలబడి, ఇల్లినాయిస్ శాసన సభ్యులవోట్లతో ఓడించబడ్డాడు. నానాటికి పెరుగుతూన్న దౌష్ట్యాన్ని సక్రమపద్ధతిలో ఎదుర్కోవాలంటే తాను రిపబ్లికన్లతో చెయ్యీ చెయ్యీ కలపాలన్న సత్యం ఆ మరుసటిఏడు గాని ఆయన గ్రహించలేదు. దేశాన్ని ఉడుకెత్తించే స్తూన్న సమస్యవిషయంలో లింకన్ ఏమిచేయదలచుకున్నదీ 1856 మే 29వ తేదీని స్పష్టపడిపోయింది. ఆ రోజున బ్లూమింగ్టన్‌లో ఇల్లినాయిస్ రిపబ్లికన్‌శాఖ శాస్త్రీయంగా ఉద్భవించింది. ఆ సమయంలో ఆయన అద్భుతమైన ఉపన్యాసం శ్రోతలనందరినీ మంత్రముగ్ధుల్ని చేసేసింది. శ్రోతలుగాని, పత్రికా విలేఖరులుగాని ఆ ఉపన్యాసాన్ని రాసుకోవాలన్న విషయమే పూర్తిగా మరిచిపోయారు. ఈ విధంగా ఆనాటి లింకన్ అద్భుత ఉపన్యాసం సుప్రసిద్ధమైన, ఉద్వేగ పూర్ణమైన "మరచిరానిన ఉపన్యాసం" అయింది.

మంత్రముగ్ధుడై కూచుని పోయిన బిల్లీ హెర్న్‌డన్ తరవాత ఇలా అన్నాడు :

"నేను లింకన్ ఉపన్యాసాలన్నీ వినడం, లేదా చదవడం జరిగింది. నా ఉద్దేశంలో బ్లూమింగ్టన్‌లో ఆయన ఉపన్యాసం

అన్నిటిలోకీ గొప్పది. అంతవరకూ ఆయన రాజనీతిక ప్రయోజనాల్ని దృష్టిలో పెట్టుకుని బానిసత్వాన్ని యుక్తి యుక్తంగా ఖండించేవాడు. విశ్వమానవదృష్టి కోణంలోనుంచి దాన్ని ఆయనెప్పుడూ చూడలేదు. ఇప్పుడు ఆయనకొత్తగా జన్మించాడు, కొత్తగామతం స్వీకరించినవానిలో ఉండే ఉద్వేగం ఆయనలో ఉంది. ఇంతవరకు నివురుగప్పిన నిప్పు ఇప్పుడురగుల్తోన్నది. ఆయనలో అంతులేని ఉత్సాహం రేకెత్తింది. ఏదో మహాజ్యోతితో ఆయన కళ్ళు తళ తళ లాడాయి."

ఆ రోజుల్లో హెర్న్డన్ ప్రతిసారీ లింకన్ ఉపన్యాసాల్ని రాసుకునేవాడు. ఈ సారి మాత్రం ఆయన అన్నీ మరిచిపోయి పెన్సిలూ, నోటుబుక్కూ పక్కకి విసిరేసి, ఒక అద్భుతమైన భావ వాహినిలో మునిగిపోయాడు. తన చుట్టూ ఉన్నవారందరిలాగే అతను కూడా లింకన్ మహోపన్యాసంలోని తీవ్రతచేత, శక్తిచేత మంత్రముగ్ధుడైపోయాడు. ఎంత కఠోరంగా, కటువుగా, వ్యంగ్యంగా క్రోధంగా ధ్వనించినా అతని అమరవాక్కులలో సత్యంఉంది. హెర్న్డన్ చెప్పినట్లు అబ్రహాం లింకన్ శత్రువును కుస్తీపట్టుతో ఎదుర్కొన్నాడు. సామాన్యంగా లింకన్ ఆరడుగుల నాలుగంగుళాల పొడుగుంటే, ఆ రోజు బ్లూమింగ్టన్‌లో ఏడడుగుల ఎత్తున లేచి ప్రజలను ప్రబోధించాడు.

ఆ ఉపన్యాసానికి అధికారపూర్ణమైన ప్రతి దొరకకపోయినా ఇల్లినాయిస్ రిపబ్లికన్లపై దాని అద్భుత ప్రభావం వార్తతూర్పు దిశగాకూడా వ్యాపించి ఉండాలి! మూడు వారాల తరువాత ఫిలడెల్ఫియాలో జరిగిన రిపబ్లికన్ నేషనల్ కన్వెన్షన్‌లో ప్రతినిధులంతా తమ మొదటి అధ్యక్షుని ఎన్నుకోడానికి గుమిగూడారు. ఈ ఎన్నికలలో లింకన్‌కి ఉపాధ్యక్షుడుగా ఉండడానికి 110 వోటు

వచ్చాయి. ఈ విధంగా అధ్యక్షుడుగా ఎన్నిక అయిన జాన్ సి. ఫ్రెమాన్ట్‌కి సహచరుడుగా ఉండేస్థితికి ఆయన రాగలిగాడు. తరువాత ఎన్నికల్లో లింకన్ పేరు తోసిరాజని ప్రతినిధులంతా న్యూజెర్సీకి చెందిన విలియం ఎల్. డేటన్‌ని ఉపాధ్యక్షుడుగా ఎన్నుకున్నారు.

లింకన్‌కి ఈ 110 వోట్ల సంగతి తెలిసినప్పుడు చాలా ఆశ్చర్యపడి అన్నాడు, "బహుశః అది నా పేరై ఉండదు; మెస్సాచుసెట్స్‌లో లింకన్ పేరుగల ఇంకొక గొప్ప వ్యక్తి ఉన్నాడు. ఆ వోట్లు అతనికి వచ్చి ఉంటాయి."

ఆ మొదటిసారి బలహీనమైన రిపబ్లికన్ పార్టీ అభ్యర్థిగా ఉపాధ్యక్షపదవికి లింకన్ సూచించబడకపోవడమే చాలా మంచిదైంది. ఫ్రెమాన్ట్ అసమర్థుడైన డెమొక్రాటిక్ అభ్యర్థి జేమ్సు బుకనన్ చేత ఓడించబడడం అటుతరువాతి చారిత్రిక ఘటనలను దృష్టిలో ఉంచుకుని చూస్తే- ఇంకా మంచిదైంది. ఫ్రెమాన్ట్ వైటుహౌస్‌లో ప్రవేశిస్తే యూనియన్ నుంచి విడిపోతామని దక్షిణాది రాష్ట్రాలు అప్పుడే భయపెట్టసాగాయి. ఇది నిజానికి మన జాతి వినాశనానికి తోవతీస్తుంది. ఎందుచేతనంటే, 1856 నాటికి ఉత్తరరాష్ట్రాలు ఇటువంటి ప్రతిఘటనని ఎదుర్కోగలిగినంత పటిష్ఠంగా లేవు.

బుకనన్ అధ్యక్షపదవి నధిష్ఠించిన రెండు రోజులకే యునైటెడ్ స్టేట్సు సుప్రీంకోర్టులో మేరీల్యాండుకి చెందిన చీఫ్ జస్టిస్ రోగర్ బి. టేన్సీ "నీగ్రో తెల్లవానికంటె చాలా తక్కువవాడు కనుక ఏ కోర్టులోనూ వానిని నాగరకునిగా చూడకూడదు." అనే దారుణమైన తీర్పు చెప్పాడు. దీనితో బానిసత్వ విరుద్ధమైన ఉత్తర రాష్ట్రాలలో విద్వేషాగ్ని ప్రజ్వరిల్లి రెండు పక్షాలలోనూ ఇదివరకే రగులుతూన్న ప్రచ్ఛన్నయుద్ధం తీవ్రరూపం దాల్చింది,

1858 లో లింకన్ సెనేటుకి అభ్యర్థిగా నిలచి చేసిన ప్రయత్నం నాలుగేళ్ళ క్రితంచేసిన ప్రయత్నంకంటె చాలా తీవ్ర మైనదని చెప్పాలి. రెండవ టరమ్ పూర్తి అయిపోతూన్న సెనేటర్ డగ్లస్ అతని ప్రత్యర్థి కాబోతాడు. లింకన్ ఈ సుప్రసిద్ధ ప్రతికక్షిని ఎదుర్కోడానికి నడుం కట్టడంతో ఇదొక మేటి పోటీగా ఏర్పడింది.

1858 జూన్ 16 న స్ప్రింగ్‌ఫీల్డులో జరిగిన స్టేట్ రిపబ్లికన్ కన్వెన్షన్‌లో తన నామినేషన్‌ని స్వీకరిస్తూ లింకన్ అద్భుతంగా ఉపన్యసించాడు. అతని పూర్వపు రికార్డంతా తుడిచివేసినా ఈ ఒక్క ఉపన్యాసంతో అతని పేరు శాశ్వతంగా ఉండిపోతుంది. "గృహచ్ఛిద్రం" అనే ఈ ఉపన్యాసం అతి స్పష్టంగాను, నిర్భయం గాను ఉండడం చూసి హెర్న్డన్ తప్ప మిగిలిన స్నేహితులంతా ఆ ఉపన్యాసం ఇవ్వద్దని అతన్ని బ్రతిమాలారు. అయితే దూరదృష్టి గల హెర్న్డన్ అన్నాడు: "లింకన్! ఇప్పుడు చెప్పిన ప్రకారమే ఉపన్యాసం తప్పక ఇయ్యి! దీని ద్వారా నువ్వు అధ్యక్షుడవు అవుతావు."

కంచు గంటలా ఖంగున మ్రోగి, ప్రతిధ్వనించిన ఆ ఉప న్యాసంలోని హెచ్చరిక మాటలు ఇవి: "గృహచ్ఛిద్రంతో విడిపోయిన కుటుంబం ఎన్నటికీ బాగుపడదు. జాతి సగం బానిసగాను, సగం స్వతంత్రంగాను ఉండి శాశ్వతంగా బతుకలేదని నా నమ్మకం. యూనియన్ విచ్ఛిన్న మవడం నా అభిమతంకాదు. ప్రభుత్వం పతనం నేను కోరడంలేదు - అది చీలిపోకుండా ఉండడమే నా అభిమతం."

ఈ మాటలు ఉత్తరాదివారికి ధైర్యాన్ని కలగజేసివల్లే దక్షి ణాదివారిలో క్రోధాన్ని రగుల్కొలిపాయి. లింకన్ అంతర్యుద్ధాన్ని

లేవదీసేందుకు చూస్తున్నాడనే అర్థం వచ్చేట్లా స్టీఫెన్ ఏ. డగ్లసు వెంటనే వీటికి వ్యాఖ్యచేశాడు. రాజకీయ వివాదాలలో నక్కజిత్తులు ప్రయోగించే డగ్లస్ ఈ నాజూకు సమస్యపై లింకన్ వాఖ్యాలాన్నే తనకి అనుకూలంగా ఉపయోగించుకున్నాడు. బలశాలియైన తన ప్రత్యర్థిని ఓడించాలంటే ఇటువంటి నక్కజిత్తులు లేందే పని సాగదని డగ్లస్‌కి బాగా తెలుసు. అతనికి తన ప్రతికక్షి సామర్థ్యం బాగా తెలుసు. లింకన్ సెనేట్‌కి నామినేట్ అయాడని విన్నప్పుడు డగ్లస్ - "స్ప్రింగ్‌ఫీల్డు విగ్గులందరిలోనూ ఏబ్ లింకన్ చాల సమర్థుడూ న్యాయబుద్ధి కలవాడూ అన్నది నిర్వివాదాంశం!" అన్నాడు.

తన ఎన్నికల ప్రచారం కోసం తిరిగేందుకు ఇల్లినాయిస్ రాక డగ్లస్‌కి విజయయాత్ర అయింది. పేరు ప్రఖ్యాతులు గల భాగ్యవంతుడైన ఈ కులాసా పురుషుడు సాధారణంగా ఎన్నికల ప్రచారం చేసేటప్పుడు ఒక ప్రత్యేకపు రైలులో ఒక ఊరినుంచి ఒక ఊరు ప్రయాణంచేస్తాడు. అతనితో అందమైన సంఘగౌరవంగల అతని రెండవభార్య అడెలీ కట్స్ డగ్లస్‌కూడా ఉండేది. ఇల్లినాయిస్‌లోనే కాక రాజధాని నగరంలోకూడా అందమైన ఆమె బట్టల్ని గూర్చి అంతా గొప్పగా చెప్పుకునేవాళ్ళు. డగ్లస్ ప్రయాణంచేసే రైలులో ఒక బండి పైకప్పులేకుండ బల్లపరుపుగా ఉంటుంది. దాని మీద తళ తళలాడే ఒక కంచు ఫిరంగీ, దాని కిరుపక్కలా యూనిఫారంలో ఉన్న సేకర్లూ ఉండేవాళ్ళు. ఒక ఊరు చేరుకోగానే, గొప్పవాడైన స్టీఫెన్ ఏ. డగ్లస్ ఉపన్యసించడానికై ఈ ఊరు వచ్చాడని తెలియజేయడానికి ఆ ఫిరంగి మ్రోగేది. అదే రైలులో ఒక మామూలు పెట్టెలో అసంగత వేషంలో పొడుగుపాటి ఏబ్ లింకన్ కూడా ఉండేవాడు. డాబు దర్పాలతో రాజఠీవిని గనబరచే తన

ప్రతికటితో పోటీచేసే ఉద్దేశ్యమూ అతనికి లేదు అందుకు తగిన సాధన సంపత్తిలేదు. ప్రతీ అభ్యర్థీ ప్రజలను వశపరచుకునేందుకు ఏదో ఒక ప్రత్యేక విధానాన్ని అవలంబిస్తాడు. అయితే లింకన్‌కి ఇటువంటి వాటిమీద నమ్మకంలేదు లింకన్ ఒకసారి అన్నాడు: "ప్రజలనందరినీ కొంతకాలంవరకూ మోసపుచ్చవచ్చు; కొంతమందిని శాశ్వతంగా మోసపుచ్చవచ్చు. కాని అందరినీ శాశ్వతంగా మోసపుచ్చడం ఎవ్వరితరమూ కాదు."

మొదట్లో లింకన్ ఒక ఊరినుంచి ఒకఊరు సెనేటరుతోపాటు వెళ్లేవాడు. ప్రేక్షకు లెవరైనా కోరినప్పుడు డగ్లస్‌కి జవాబుగా మాట్లాడేవాడు. కొన్నిచోట్ల ప్రత్యేకంగా తనకోసం ఏర్పడ్డ వేరే సభలలో ఉపన్యసించేవాడు. ఇద్దరూ ఒకే ప్లాట్‌ఫారంమీద మాట్లాడితే ఎక్కువ ఉపయోగకరంగా ఉంటుందన్న ఉద్దేశం అతనికి తరవాత తోచింది. సభలలో తనతో చర్చించమని లింకన్ డగ్లస్‌ని సవాలు చేశాడు. నిజానికి డగ్లస్‌కి ఇటువంటి చర్చలవల్ల నష్టమేతప్ప లాభమేం లేదు. అయినా, అతనందుకు ఒప్పుకోక తప్పిందికాదు.

ఈ విధంగా ఇల్లినాయిస్‌లోని ఏడు నగరాలు - ఒట్టావా, ఫ్రీ పోర్ట్, జోన్స్‌బోరో, చార్లస్టన్, గేల్సుబర్గ్, క్విన్సీ, ఆల్టన్, అనేవి - లింకన్, డగ్లసుల "సుప్రసిద్ధ వాదవివాదాల" రంగస్థలాలయే గౌరవాన్ని పొందాయి. ఈచర్చలు అమెరికన్ చరిత్రను రూపొందించడంలో ఎంతో తోడ్పడ్డాయని చెప్పవచ్చు.

పడవలమీద, ఎడ్లబళ్ళమీద, గుర్రాలమీద, బగ్గీలమీద, ప్రత్యేకపు రైళ్ళమీద, కాలినడకను జనం తండోపతండాలుగా వచ్చేవాళ్ళు. కాగడాలతో ఊరేగింపులూ, యూనిఫారం డ్రస్సులూ, అందమైన ఆడపిల్లలతో నిండిన కార్లూ చూసి, వాళ్ళు చకితులైపోయేవారు. జండా

లూ, స్లోగన్లూ, బేనర్లూ మోసేవాళ్ళు. సారాయి, ఫలహారాలు సేవించే వాళ్ళు. ఒట్టావాలో మండుటెండలో నిలబడి ఉపన్యాసాలు విన్నారు. ఫ్రీపోర్టులో జడివానలో నిలబడివిన్నారు. గేల్సుబర్గ్ లో చలిగాలుల్లో నిలబడ్డారు. స్తంభించిపోయి, మంత్రముగ్ధులై, వినోదంతో, విసుగుతో ఆనందంతో వాళ్ళు కేకవేసేవారు; నవ్వేవారు! వినేవారు, కరతాళ ధ్వనులు చేసేవాళ్ళు!

డగ్లస్ డాబుసరిగా ఉండేవాడు. సాధారణంగా తెల్ల కోటో, నీలికోటో ధరించేవాడు ఫ్రిల్ షర్టూ, పొట్టి వేస్టుకోటూ, ఫేషనబుల్‌గా ఉండే పంట్లాం, పాలిష్ చేసిన బూట్లూ వేసుకునేవాడు. అతను తీవ్రంగా గుచ్చుకునే సరియైన వాగ్ధాటిగల వక్త, నక్కలా జిత్తులమారి. సాగే చేపలా జారిపోయే రకం. ఈ పొట్టి వాని కంటె పన్నెండు అంగుళాలు ఎక్కువ ఎత్తున్న లింకన్ వెలిసిన పాత నల్లకోటు తొడుక్కునేవాడు. దాని చేతులు మణికట్లదాకా రానంత పొట్టిగా ఉండేవి. నలిగిపోయిన, చొక్కా మెలికలు తిరిగిన పైతో సాధారణంగా ఆయన బూడిదరంగు శాలువా పైన వేసుకునేవాడు. వెంట ఎప్పుడూ వదులుగా ఉండి ఊడిపోయే గొడుగొకటి ఉండేది! కాని వీరిద్దరిలో ఎవరు మాట్లాడడం మొదలుపెట్టినా వేదిక చుట్టూ వేలాదిగా మూగిన శ్రోతలు వాళ్ళ భౌతికరూపాన్ని పూర్తిగా విస్మరించేవాళ్ళు. తమ కాలానికి చెందిన ఇద్దరు గొప్ప వక్తలు తమ నైపుణ్యాన్ని పూర్తిగా ఉపయోగిస్తూ తమ విషయాల్ని విశదీకరిస్తూంటే మండు టెండనీ, గజగజ లాడించే చలినీ మరిచిపోయి వినేవాళ్ళు ప్రజలు.

డగ్లస్ నక్క అయితే, లింకన్ నక్కల వేటగాడు. ఫ్రీ పోర్టులో ఏబ్ చాలా తెలివితేటలతో కూడిన ప్రశ్న వేశాడు. రాష్ట్రీయ రాజ్యాంగ విధానాన్ని ఏర్పరుచుకోకుండా ఒక ప్రాంతానికి చెందిన

ప్రజలు న్యాయ సమ్మతంగా తమ సరిహద్దుల నుంచి బానిసత్వాన్ని ఎలా పారద్రోల గలరు? డగ్లస్ దీనికేమి జవాబిస్తాడో లింకన్‌కి తెలుసు. ఈ ఎలక్షన్‌లో కాకపోయినా, 1860 లో జరిగే అతి ముఖ్యమైన ఎలక్షన్‌లోనైనా సెనేటర్ పతనం తథ్యమని లింకన్ సరిగాసే అంచనా వేశాడు.

ఏమీ తడుముకోకుండా డగ్లస్ జవాబిచ్చాడు. ఏ ప్రాంతమైనా బానిసత్వాన్ని నిర్మూలించ దలుచుకుంటే, దానికి వ్యతిరేకంగా శాసనాన్ని ఏర్పరచుకోడం ద్వారా అలా చేసుకోవచ్చును అని. పైకి అద్భుతంగా కనిపించే ఈ జవాబుకి సభలో అందరూ బ్రహ్మాండంగా కరతాళ ధ్వనులు చేశారు. కాని తాను ఈ వాగ్వాదంలో గెలిచానన్న సంగతి లింకన్ గుర్తించాడు. ఈ సుప్రసిద్ధ జవాబు "ఫ్రీ పోర్టు సిద్ధాంతం" అనే పేరుతో ప్రసిద్ధి కెక్కింది. ఇది చాలామంది దక్షిణ డెమోక్రాట్లకి కోపకారణమైంది. డగ్లస్‌కి మూడవవంతు పార్టీ బలం తగ్గిపోవడం, తన్మూలంగా డెమోక్రాటిక్ పార్టీలో చీలిక ఏర్పడడం జరిగింది. 1860 లో రిపబ్లికన్ పక్షానికి విజయం తథ్యమని తేలిపోయింది.

పై ఏడు సమావేశాల్లోనూ, న్యూస్ పేపరు రిపోర్టర్లు పూర్తిగా హ్రస్వలిపిలో రిపోర్టులు తీసుకున్నారు. అందుచేత ఈచర్చలలో గుమిగూడిన అసంఖ్యాక జనమేగాక సంయుక్త రాష్ట్రంలోని పత్రికా పాఠకులందరూ గూడా ఈ వాద వివాదాల్ని పొల్లు పోకుండా చదివారు. చూస్తూండగా అబ్రహాం లింకన్ పేరు దేశం మూల మూలలంతా ప్రతిధ్వనించింది. దేశ రాజకీయాల్లో ఆయనొక మహాశక్తిశాలిగా చలామణీ కాసాగాడు.

కాని వేదికమీది పరిశ్రమ తరువాత లింకన్ తన హోటలు గదిలో తన బూట్లూ, నెక్‌టై విప్పుకున్న వెను వెంటనే అతన్ని

ఇంకొక విధమైన భావోద్వేగ మేదో వచ్చి ఆక్రమించుకునేది. ఒక రోజున క్విసీలో విశ్రాంతి తీసుకుంటూ ఉండగా హాస్యగాడైన డేవిడ్ ఆర్. లాకీ - పెట్రోలియమ్ వి. నేస్‌బీ అనే కలం పేరు గల వ్యక్తి - లింకన్‌ని కలుసుకుని మాట్లాడాడు. లాకీ అన్నాడు: "ఇంత ఆలోచనా ముద్రలో ఉన్న ముఖం నే నింకొకటి చూడలేదు. ఇంత కీవిగా ఉండే ముఖమూ చూడలేదు. ఇంత విచార ముద్రలో ఉన్న ముఖమూ చూడలేదు."

లింకన్ లాకీతో అన్నాడు- "నేను ప్రజాభిమతంతో రాష్ట్రపు ఎన్నికల్లో గెలవగలను. కాని రాష్ట్ర శాసన సభలో డగ్లస్‌ని ఓడించడం విషయం నేను చెప్పలేను." ఆ రోజుల్లో శాసన సభే సెనేటర్లని ఎన్నుకునేది. డెమోక్రాట్లు తమ పార్టీ బలానికి అనుకూలంగా జిల్లాలను విభజించడం ద్వారా తన పార్టీవారికి బలం లేకుండా చేస్తున్నారన్న విషయం లింకన్ లాకీకి తెలియజెప్పాడు.

లింకన్ జ్యోతిషం మళ్ళీ నిజమైంది. 1858 నవంబరు 2వ తేదీ వర్షం కురుస్తుండగా జరిగిన ఎన్నికల్లో లింకన్‌కి 152, 275 వోట్లు వచ్చాయి. డగ్లస్ 121, 190 వోట్లతో ఓడిపోయాడు. కాని శాసన సభా సమావేశంలో శాసన సభ్యులు సెనేటర్‌ని ఎన్నుకునే సందర్భంలో 54 వోట్లు డగ్లస్‌కి వస్తే, 46 వోట్లే లింకన్‌కి ఇచ్చారు.

ఈ అపజయంలో ఆయన మనస్థితిని గూర్చి ప్రశ్నించగా, లింకన్ చెప్పులు తొడుక్కోక బొటనవ్రేలు విరగ్గొట్టుకున్న ఒక పిల్లవాని కథ చెప్పాడు. "నవ్వడానికి వీలులేనంతగా బాధగా ఉంది. అయితే ఆ పిల్లవాడు ఏడ్చేటంత చిన్నవాడు కాదు!"

ఈ దురదృష్టంవల్ల దెబ్బతిన్నా, లింకన్ దేశంలోని నాగరికులందర్నీ బాగా ఆకర్షించాడు. ఆ తరువాత ఒకటిన్నర సంవత్స

రాలు తన లాయరు వృత్తిని మరమ్మత్తు చేసుకోడం కోసం ఆయన శ్రమ పడ్డాడు. 1858 లో పూర్తిగా ఆ వృత్తిని బాగా అశ్రద్ధ చేశాడు. అత నిప్పుడు కూడా ఉపన్యాసా లివ్వడం మానలేదు. అయితే అవి రాజకీయ ఉపన్యాసాలు మాత్రమే కావు. అధ్యక్ష పదవికి అతని పేరు అప్పుడప్పుడు పేర్కొన బడుతూన్నా, ఆయన కలలోకూడా తన కాపదవి లభిస్తుందని ఎన్నడూ ఆశించలేదు. తనను బాగా బలపరిచేందుకు తయారైన ఒక పత్రికా సంపాదకునితో "నిజంగా నేను అధ్యక్ష పదవికి తగుతా నన్న నమ్మకం నాకు లేదు" అని చెప్పాడు లింకన్.

కాని, 1859 ఆకు రాలుకాలం నాటికి ఈ విషయమై అతని అభిప్రాయం మెల్లిగా మారింది. 1860 ఏప్రిల్ 29 న లిమాన్ ట్రంబుల్ కి వ్రాసిన ఉత్తరంలో లింకన్ తనకి ముడి పెట్టబడుతూన్న ఈ పదవి విషయం ఇలా అన్నాడు: "దీని రుచి నా నోటికి కూడా కొంచెం అంటింది." అయితే ఈ ఉత్తరం రెండో కంటికి కనిపించ నియ్యొద్దని అతను ట్రంబుల్ ని కోరాడు.

న్యూయార్కు నగరంలో కూపర్ యూనియన్ సమావేశంలో లింకన్ ఇచ్చిన ప్రముఖ ఉపన్యాసానికి వచ్చిన ఘనమైన ప్రశంసా, న్యూ ఇంగ్లాండులో యథాలాపంగా ఆయన సాగించిన భ్రమణంలో లభించిన అద్భుతస్వాగతం ఈహృదయ పరివర్తనకూ,ఆశకూ కారణా లని చెప్పచ్చును. అధ్యక్ష పదవికి నామినేటు కాబోయే ఇతర ప్రముఖ అభ్యర్థులలోగల ప్రధాన దౌర్బల్యాలను లింకన్ జాగ్రత్తగా పరిశీలించి చూసినట్టు కూడా కనిపిస్తుంది. న్యూయార్కు నుంచి విలియం హెచ్. సెవార్డ్, ఓహియో నుంచి సాల్మన్ పి. ఛేజ్, పెన్సిల్వేనియా నుండి సైమన్ కామెరన్, ఓహియోకి చెందిన సంయుక్త

రాష్ట్ర సుప్రీం కోర్టు జడ్జి జాన్ మెక్లీన్, మిస్సూరికి చెందిన జడ్జి ఎడ్వర్డ్ బేట్స్ ఈ పదవికి నిలబడే అభ్యర్థులు. కాని వీరిలో ప్రతి వ్యక్తికీ-ఆఖరికి అందరిచే అభిమానించబడే విలియం హెచ్. సెవార్డ్‌తో సహా - ఉత్తర రాష్ట్రాల్లో ఎక్కడో ఒక కీలక స్థానంలో తగినంత మద్దత్తు లేకపోవడమో, లేక పను తెలివితక్కువ వాగ్దానాల ద్వారా (అవి ఎంత సాహసంతోనూ, ముందంజ వేసే ఉద్దేశ్యంతోనూ చేసినా వాటిని ఆచరణపూర్వకంగా చేసి చూపడం అసంభవం!) కాబోయే వోటర్లని చెదరగొట్టేసుకోడమో జరిగింది.

లింకన్‌కి బానిసత్వం విషయంలో గల మితవాద ఆదర్శానికి ఎక్కువ ఆదరభావం ఏర్పడింది. డగ్లసూ, తదితర విపక్షులూ, వేస్తున్న అర్థంలేని అపనింద లెలాఉన్నా, బానిసత్వ సమస్య కోసం యూనియన్‌ని విచ్ఛిన్నం పరచడం లింకన్ అభిమతం ఎన్నడూ కాదు. నిస్సందేహంగా ఆయన బానిసత్వ నిర్మూలన వాదికూడా కాదు. రిపబ్లికన్ నేషనల్ కన్వెన్షన్‌లో తనకు మంచి అదను చిక్కబోతోందని ఆయన సూక్ష్మబుద్ధి ఎన్నడో గ్రహించి ఉండాలి. స్వరాష్ట్రానికి ఆయన అభిమాన పుత్రుడన్న విషయంలో ఎంత మాత్రం సందేహం లేదు. డెకాటర్‌లో జరిగిన ఇల్లినాయిస్ రిపబ్లికన్ కన్వెన్షన్‌లో ఒక వోటూ బీరుపోకుండా అన్నీ లింకన్‌కి లభించడం ద్వారా ఇది అద్భుతంగా నిరూపించబడింది. ముప్పై ఏళ్ళ క్రితం మొట్ట మొదటిసారి మేకన్ కౌంటీకి వచ్చిన రోజులలో ఏబ్ పగల గొట్టాడని చెప్పుకునే రెండు దుంగలను జాన్ హాంక్స్, అతని స్నేహితుడూ మోసుకురావడంతో ఆసమావేశంలో ఉత్సాహం ఉన్నతస్థాయినందుకుంది. ప్రతినిధులంతా ఆనందంలో ఉన్మత్తులై పోయారు. ఉత్తర పశ్చిమా లంతటా దూలాలూ,దుంగలూ నరికే ఏబ్‌కే వోట్లు పడతాయని తేలిపోయింది.

1860 మే 16వ తేదీన తమ నేషనల్ కన్వెన్షన్‌కి రిపబ్లికన్లు షికాగో నగరానికి తండోపతండాలుగా రావడంతో సంభ్రమం రేకెత్తింది. సేవార్డ్ ప్రతినిధులవంటి కొందరు మెరిసే యూనిఫారాలతో తమ బ్యాండు మేళాల్ని వెంట తెచ్చుకున్నారు. ఏబ్ లింకన్ ప్రతినిధులు "వైడ్ ఎవేక్స్" మిషిగాన్ ఎవెన్యూకి ఇటూ అటూ తిరుగుతూ హడావుడి చేసేందుకు ఎంతో దూరదూరాలనుంచి వచ్చి చేరుకున్నారు. సేవార్డ్ బ్యాండు చేసినంత గొడవా వీళ్ళూ చేశారు.

ఒకవేపు షికాగో లేక్ ఫ్రంటు పొడుగునా పాటలూ, మేళతాళాలూ, ఆనందోత్సవాలూ చెలరేగుతూనే ఉన్నాయి. ఇంకొకవైపు పొగతోనిండిన హోటల్ గదులలో అతి గంభీరమైన మంతనాలు జరుగసాగాయి. ప్రధాన అభ్యర్థుల మేనేజర్లు తమ రాజకీయపు సంచులలోనుంచి చేతనైన ఎత్తులన్నీ పైకితీసి న్యాయమార్గాన్నో, అన్యాయమార్గాన్నో అవలంబించి తమ తమ అభ్యర్థుల్ని గెలిపించేందుకు పన్నాగాలు పన్నుతున్నారు. ఈ ఏజంట్లలో ముఖ్యంగా పేర్కొనతగినవారు న్యూయార్కు రాజకీయాల కర్ణధారి థర్లోవీడ్ సెవార్డ్ పక్షంలో పనిచేస్తున్నాడు. పెన్సిల్వేనియా రాజకీయాల ధురంధరుడు సైమన్ కామెరన్ తన గెలుపుకోసం తనే నడుం కట్టాడు.

లింకన్ స్ప్రింగ్‌ఫీల్డులోనే ఉండేందుకు నిర్ణయించుకున్నాడు. అతని మేనేజర్లు వాళ్ళ ప్రతికక్షులలాగే హడావుడిచేస్తూ, పన్నాగాలు పన్నుతున్నారు. వీళ్ళకి లింకన్‌తో సర్క్యూటు తిరిగిన స్థూలకాయుడు జస్టిస్ డేవిడ్ డేవిస్ అత్యుత్సాహంతో నాయకత్వం వహించాడు.

"నన్ను కట్టి పడేసే ఒప్పందాలేమీ చేసుకోవద్దు" అని లింకన్ తన ఏజంట్లకు ఖచ్చితంగా తెలియజేశాడు.

మాయ మర్మా లెరుగని ఏబ్ స్ప్రింగ్‌ఫీల్డులో ఓపికతో నిరీక్షిస్తున్నాడు. విశ్వాసపాత్రులైన తన స్నేహితులు తన కోసం ఏం తంటాలు పడుతున్నారో ఆయనకు బహుశః తెలిసిఉండదు ఒప్పందాలు ఖచ్చింతంగా జరిగాయి. కొత్త ప్రభుత్వంలో మంత్రి పదవులు వాగ్దానం చెయ్యడం వంటి అతి ప్రధానమైన ఘట్టాలు కూడా ఇందులో ఉన్నాయి. అయితే ఈ రాజకీయపు ఎత్తులద్వారా ఎంతో మేలు జరిగింది: ఇంతకు ముందెన్నడూ ఏ అమెరికన్ అధ్యక్షుడూ వహించని బాధ్యతలతోకూడిన అతి అపాయకరమైన కఠినపరిస్థితుల్లో పని చెయ్యడానికి సరియైన యోగ్యనాయకుడు ఎన్నుకోబడ్డాడు.

ప్రతినిధుల దృష్టి అంతా విగ్‌వామ్ భవనంవైపు కేంద్రీకరింపబడింది. కన్వెన్షన్ జరిపే ఏకైక ఉద్దేశంతో ఈ దారు భవనం నిర్మింపబడింది. కిటకిటలాడి పోతూన్న ఈ భవన మండపం గర్జనలతో, గందరగోళంతో ఉఱ్ఱూతలూగింది. కంపించింది. అన్ని రాజకీయ కన్వెన్షన్లలోనూ ఇది మామూలే! ఆ రోజుల్లో నామినేషన్ ఉపన్యాసాలు ఎంతో సంగ్రహంగా ఉండేవి. చూస్తూండగానే ప్రతినిధులు వోట్లు వెయ్యడం ప్రారంభమయింది.

మొదటి బ్యాలెట్టులో సెవార్డ్‌కి 173½ వోట్లు, లింకన్‌కి 102, కామెరన్ 50½, చేజ్‌కి 49, బేట్సుకి 48 వచ్చాయి. ఇతర అభ్యర్థుల మధ్య 42 వోట్లు చెదరిపోయాయి.

"లెక్క పెట్టండి! లెక్క పెట్టండి!" సభంతా గర్జించింది.

రెండో బ్యాలెట్టులో లింకన్‌కి 181 వోట్లు వచ్చాయి. కాని సెవార్డ్ ఇంకా మూడున్నర వోట్లతో ఆయనకు పైగా ఉన్నాడు.

"లెక్క పెట్టండి! లెక్క పెట్టండి" ప్రతినిధులు అరిచారు.

నామినేషన్‌లో గెలిచేందుకు ఈసారి 233 వోట్లువస్తే చాలు. మూడో బ్యాలెట్టులో లింకన్‌కి 231½ వరకూ వచ్చాయి. ఒకటిన్నర వోట్లు వస్తే చాలు అతను గెలుస్తాడు.

ఇంతలో ఒక ఓహియో ప్రతినిధి ఎగిరి నుంచున్నాడు. అధ్యక్షుని అనుమతితో అతనన్నాడు:

"అధ్యక్షా, ఓహియో వోట్లలో నాలుగు వోట్లు ఛేజ్‌కి పొరపాటున వెళ్ళాయి. అవి లింకన్‌కి వెళ్ళాలన్న విషయం తెలియజేసేందుకే నేను లేచాను."

ప్రతినిధులు సంతోషధ్వానాలు చేశారు. గర్జించారు. ఈలలు వేశారు. టోపీలు పైకి ఎగరేశారు. పెద్దగందరగోళం జరిగింది. పైకప్పుమీద తయారుగాఉన్న ఒక వ్యక్తికి సిగ్నల్ ఇవ్వబడింది. విజయ ఫిరంగి దిక్కులు పిక్కటిల్లేలా మారుమ్రోగింది.

స్ప్రింగ్‌ఫీల్డులోని ఇల్లినాయిస్ స్టేట్ జర్నల్ ఆఫీసులో లింకన్ కొందరు స్నేహితులతో నిరీక్షిస్తున్నాడు. హఠాత్తుగా టెలిగ్రాం వచ్చింది : "భగవంతుడి దయవల్ల మనం గెలిచాం!"

విశ్వాసపాత్రులైన లింకన్ చుట్టూ ఉన్నవాళ్ళు సంతోషధ్వానాలుచేస్తూ నాట్యమాడారు; పాటలు పాడారు. ఒకళ్ళనొకళ్ళు వీపులు చరచుకున్నారు. లింకన్ చేతిని ఊపిపారేశారు. లింకన్ ప్రశాంతంగా అన్నాడు: "మిత్రులారా, మా ఇంట్లో ఒకపొట్టి

యువతి ఉంది; నాకంటె ఆమెకి ఈ సందేశం ఎక్కువ సంతోషాన్ని ఇస్తుందని నా నమ్మకం; మీరు అనుమతిస్తే నేను వెంటనే వెళ్ళి ఆమెకిది చూపిస్తాను."

నూటికి నూరుపాళ్ళ నిశ్చితత్వంతో ఎన్నికల ఫలితాల్ని మనం ఎన్నడూ ఊహించలేం. కాని ఫ్రీపోర్టులో లింకన్ పన్నిన రాజకీయ వ్యూహానికి ఫలితంగా డెమోక్రాటిక్ పార్టీలో భేదాలు ఎక్కువయాయి. రిపబ్లికన్ల భవిష్యత్తు ఉజ్వలంగా కనిపిస్తోంది. ఉత్తరాది డెమోక్రాట్ల అభ్యర్థి స్టీఫెన్ ఏ. డగ్లస్; దక్షిణాది డెమోక్రాట్ల అభ్యర్థి జాన్ సి. బ్రెకిన్‌రిడ్జి. కాన్స్టిట్యూషనల్ యూనియన్ అని పిలువబడే పార్టీబలపరుస్తూన్న జాన్ బెల్‌ని అంతగా పట్టించుకున్న వారే లేక పోయారు.

1860 నవంబర్ 6 న చరిత్రప్రఖ్యాతిగాంచిన ఆ ఎలెక్షన్ రోజు వచ్చింది. దక్షిణ ప్రాంతీయులు విడిపోతామని ఒకవైపు భయ పెడుతున్నారు. ప్రజలు తండోపతండాలుగా పోలింగ్ స్టేషన్లకి చేరుకోసాగారు. సామాన్య ఎన్నికలకంటె నేడేదో విశేషముందనే భావంతో అందరూ చాలా ఉద్రేకంతో ఉన్నారు.

లింకన్ గెలిచాడు పెద్ద మెజారిటీతోకాదు; నిజమే! అయితే కావలసినన్ని ఎక్కువ వోట్లు ఆయనకు వచ్చాయి. ఆఖరి పరిగణనలో లింకన్‌కి 18,66,452; డగ్లస్‌కి 13,76,957; బ్రెకిన్‌రిడ్జికి 8,49,781; బెల్‌కి 5,88, 876 వోట్లు వచ్చాయి, డగ్లస్‌తో దీర్ఘవివాదంలో ఆఖరికి లింకన్ జయించాడు.

అమెరికా . అవకాశాలకి ఆటపట్టనే విషయం కట్టెలింట్లో పుట్టిన పేదరైతుబిడ్డ ఏబ్ లింకన్ ఇంకొకసారి నిరూపించాడు.

ఎవరూ ఎన్నడూ నిర్వహించవలసిన గొప్పబాధ్యతలు అతనికోసం ఎదురుచూస్తున్నాయి. ఆ మహాభారాన్ని వహించడానికి తగిన హృదయమూ, బుద్ధీ, ఆత్మ లింకన్‌లో వికసిస్తాయి. హృదయ విదారకమైన అంతర్యుద్ధంలో తన ప్రజకి నాయకత్వం వహించా డన్న ఖ్యాతి, దుర్ఘటనా ఆయనకోసం ఎదురు చూస్తున్నాయి. అమెరికా సంయుక్త రాష్ట్రాలకి ఆయన నూతన అధ్యక్షుడు. ఇప్పుడింక నిస్సందేహంగా మేరీ లింకన్ కోరిక నెరవేరితీరుతుంది. ఆమె నేడు వైట్‌హౌస్‌కి యజమానురాలు; దేశానికంతటికీ ప్రథమ మహిళ!



# ఎవరి మీదా ద్వేషం లేదు!

"ప్రేమ పురస్సరంగా మీవద్ద సెలవు తీసుకొంటున్నాను."

అబ్రహాం లింకన్

అతను స్వయంగా ట్రంకుపెట్టెల్ని, పెద్ద పెట్టెల్ని కట్టి "అబ్రహాం లింకన్, వైట్‌హౌస్, వాషింగ్‌టన్, డి.సి." అనే ఎడ్రసు వాటిమీద వ్రాశాడు. స్ప్రింగ్‌ఫీల్డు ఇల్లు అద్దెకి ఇచ్చేశాడు. కుక్కని ఇంకొకరి ఇంట్లో అప్పచెప్పాడు. గుర్రాన్నీ, ఆవునీ అమ్మేశాడు. తన సవతి తల్లి సారాబుష్ లింకన్‌ని "ఆఖరిసారిగా" ఒకసారి వెళ్ళి కలుసుకున్నాడు. మన సైన్‌బోర్డుని అలాగే ఆఫీసుగుమ్మానికి ఉండ నిమ్మని అతను బిల్లీ హెర్న్‌డన్‌కి చెప్పాడు. "లింకన్ అండ్ హెర్న్‌డన్" కంపెనీలో మార్పేమీ ఉండదు. "నేను బ్రతికిఉంటే ఎన్నటికైనా తిరిగి వస్తాను. అప్పుడు మామూలుగానే మనిద్దరం కలిసి లా ప్రాక్టీసు చెయ్యవచ్చు."

ఇవి వీడ్కోలుకి సంబంధించిన సంసారపక్షపు సందేశాలు. అయితే అతను ఈ బంధనాలన్నిటికి దూరంగా ఉండే కొన్ని సమయాల్లో తనదేశం అంతర్యుద్ధానికి అతి చేరువలో ఉందనే నగ్న సత్యాన్ని-పైకి దాన్ని ఒప్పుకోపోయినా-లింకన్ బాగా గుర్తించాడు. గౌరవపూర్వకమైన పద్ధతుల ద్వారా దాన్ని అరికట్టడానికి ఏ

మాత్రం వీలైనా కొత్త అధ్యక్షుడుగా రక్తపాతంనుంచి దేశాన్ని రక్షి స్తానని ప్రార్థనా పూర్వకంగా నిశ్చయించుకున్నాడు.

1861 ఫిబ్రవరి 11 వ తేదీ సూర్య ఉదయం మంచువర్షం బాగా పడుతోంది లింకన్ తన అనుయాయులతో కలిసి గ్రేట్ వెస్టరన్ రైల్వేకి చెందిన ఒకచిన్న ఇటికలతో కట్టిన రైలుస్టేషన్ బయ లుదేరాడు. అక్కడ ఒక చిన్న ఇంజన్‌కి ఒక ప్యాసింజర్ పెట్టె, ఒక స్మోకింగ్ కారూ తగిలించి అధ్యక్షుని కోసం ప్రత్యేక రైలు సిద్ధంగా ఉంది.

వెనకవైపున ఉన్న ప్లాటుఫారంమీద నుంచుని లింకన్ గొడుగుల సముద్రంలోనుంచి పైకిఎత్తి ఉన్న ముఖాలకేసి చూశాడు.

"ప్రియమిత్రులారా!" ఆయన ప్రశాంతంగా అన్నాడు: "ఈ వియోగసమయంలో నే ననుభవించే దుఃఖాన్ని నేను తప్ప ఇంకెవరూ వర్ణించలేరు. ఈ స్థలం, ఇక్కడి మీ దయా నన్నింతవాణ్ణి చేశాయి. నేనిక్కడ పాతికశతాబ్దం వరకూ నివసించాను. బాల్యం నుంచి ప్రౌఢత్వాన్ని పొందాను. ఇక్కడే బిడ్డలంతా పుట్టారు. అందులో ఒకడు ఇక్కడే మట్టి పాలయాడు. ఎప్పుడు, అసలు ఎన్నటికైనా, తిరిగి వస్తానోరానోతెలియని పరిస్థితిలో నేను మిమ్మల్ని విడిచి వెడుతున్నాను. జార్జి వాషింగ్‌టన్ కంటె కఠినతర భారం నానెత్తిన పడబోతోంది. నాకెప్పుడూ సహాయకుడుగా ఉండే ఆ పరమాత్ముని మీద విశ్వాసం లేనిదే నేను సఫలుణ్ణి కాలేను. ఆ దివ్య సహాయంతో నేను తప్పక జయిస్తాను. ఆ భగవంతుని స్మరిస్తూ, అతడు నా వెంట ఉన్నాడనీ, మీవద్ద కూడా ఉంటాడనీ, సర్వ వ్యాపకుడనీ విశ్వసిస్తూ ఆయన దయవల్ల అంతా సక్రమంగా జరుగు గాక అని ఆశిద్దాం! ఆ పరమపిత దయ మీకు లభించుగాక, ఆ దయే

నాకూ లభించేట్టు మీరు నన్ను దీవించండి. ప్రేమ పురస్సరంగా మీవద్ద సెలవు తీసుకుంటున్నాను.

చిన్న ఇంజన్ కూత కూసింది. గంట గణ గణ మ్రోగింది. రైలు మెల్లి మెల్లిగా పొగమంచులో కలిసిపోయింది. దూరంలో ఉన్న ఉద్రిక్తపరిజలతో కూడిన రాజధానివైపు సాగిపోయింది.

లింకన్ జీవితంలో 'మధ్యపశ్చిమ' యుగాన్ని మాత్రమే వర్ణించ బూనుకున్న ఈ పుస్తకంలో అధ్యక్షపదవీ కాలంలో ఏం జరిగిందో చెప్ప బూనడం వింతగానే ఉంటుంది. అయితే మరి అతని జీవితానికి పూర్తి అర్థాన్ని ఇంకొకలా మేమెలా చూపగలం?

మనం ఇదివరకే తెలుసుకున్నాం-అమితదయా దక్షిణ్యాలకీ, క్రూరత్వాన్నీ, అన్యాయాన్నీ, యుద్ధాన్నీ ప్రతిఘటించడానికీ లింకన్ పేరుమ్రోగాడు. అయినా యుద్ధం తప్పనిసరి అయింది. ఫోర్టు సమ్‌టర్ మీద కాన్‌ఫెడరేట్ల ఫిరంగులు పేలడంతో దక్షిణ ఉత్తరాలకు సంబంధించిన వ్యతిరేక పక్ష సైన్యాలు తమ తమ సైన్యాధిపతుల ఆధిపత్యంలో నాలుగేళ్ళు సాగిన దారుణ రక్తపాతానికి సన్నద్ధమయాయి.

ఇరుపక్షాలకూ చెందిన ఈ యుద్ధ సన్నద్ధులైన స్వచ్ఛంద సైనికులు ఆదర్శాలలోనూ, సాహసంలోనూ సమానమైన ఉజ్జీలు. ఒడ్డూ పొడుగుల్లోనూ, జుట్టూ, చర్మం, కళ్ళ రంగులలోనూ, కుటుంబ ప్రేమలోనూ, దేశభక్తిలోనూ, వీళ్ళకేం తేడా లేదు. ఏడుస్తూన్న తల్లుల్నీ, అభిమానవంతులైన తండ్రుల్నీ, తాము ప్రేమించే యువతుల్నీ వాళ్ళు వదలి వచ్చారు. ఉత్తర దక్షిణ ప్రాంతాల్ని ఏకం చేయడానికి కృషి చెయ్యవలసిన ఈ నూనూగు మీసాల నవ యువకులు, మీసకట్లు రాని కుర్రవాళ్ళు ఒకళ్ళనొకళ్ళు చంపుకోడంకోసం కదనరంగం

లో కదను త్రొక్కుతున్నారు. అప్పుడప్పుడు తమ ప్రతి కక్షుల అద్భుత ధైర్య సాహసాల్ని వీళ్ళు మెచ్చుకున్న ఘట్టాలు కూడా ఉన్నాయి.

ముందుకు చొచ్చుకుని ఒకరిమీదికి ఒకరు దూకుతూన్న నలుపు నీలపు సైన్యాలమీదికి గుళ్ళ వర్షం కురిపిస్తూ మర ఫిరంగులు గర్జించాయి. రాతి గోడల వెనుక నుంచీ, మట్టి గట్టుల మాటునుంచీ తుపాకీ పేల్పులు ప్రతిధ్వనించాయి. తుపాకి మడమల దెబ్బలకు తాళలేక మూల్గుతూ పడిపోయిన వాళ్ళూ, చనిపోయిన వాళ్ళూ లెక్కలేదు. గాయపడిన వాళ్ళని సైన్యం వెనుక వేపుకి తీసుకు పోతున్నారు. అంతూ పొంతూ లేని యుద్ధం అలా సాగుతూనే ఉంది.

కాంగ్రెస్ సభ్యులూ, వాళ్ళ భార్యలూ పిక్‌నిక్ పార్టీ (వన భోజనం) కి వచ్చినట్టు బుల్ రన్ వద్ద జరిగిన మొదటి యుద్ధం చూడడానికి వచ్చారు. కాని దక్షిణ జనరల్ జాక్‌సన్ రాతి గోడలా చలించకుండా నిలిచాడు. యూనియన్ దాడి మొదట వెనక్కి తగ్గడం, తరువాత చెల్లా చెదరవడం చూసి, ఈ పెద్ద మనుష్యులూ, వాళ్ళ భార్యలూ వాషింగ్‌టన్ వైపు పారిపోతూన్న భయాందోళిత జనంలోనుంచి వాళ్ళు తమ అందమైన వాహనాల మీద తప్పించుకు వెళ్ళడం బ్రహ్మాండమైంది. యుద్ధం పిక్‌నిక్ కాదన్న విషయం కొంచెంగా దేశానికి అర్థం కాజొచ్చింది.

1862 వ సంవత్సరం వచ్చేటప్పటికి ఇరు పక్షాలవారి భ్రమలు తొలగి పోయాయి. ద్వీపకల్ప మంతటా వ్యాపించిన ఈ యుద్ధంలో షెనండోలోయ దగ్గిర సాగిన యుద్ధంలోనూ, సెకండ్ బుల్ రన్, ఆన్టీటం, ఫ్రెడెరిక్స్ బర్గ్ మొదలైన రంగాలలో నడిచిన రక్తపాతాలలోనూ చనిపోయిన వాళ్ళ సంఖ్య చాలా ఎక్కువ!

1863 వచ్చేటప్పటికి యుద్ధం కాన్ ఫెడరసీకి వ్యతిరేకంగా పరిణమించింది. వాళ్ల బానిసలకు లింకన్ "అప్పటి నుంచి శాశ్వతంగా స్వాతంత్ర్యం కలిగించాడు." కొంత కాలం ముట్టడించిన తరువాత విక్స్‌బర్గ్ యూనియన్ సైన్యాల వశమైంది. ఎంతో ధైర్య సాహసాలతో యుద్ధం చేసిన లీ సైన్యాలు గెట్టిస్‌బర్గ్ వద్ద ఓడి పోయాయి.

మెక్‌డోవెల్, మెక్‌లెల్లన్, బర్న్‌సైడ్, హూకర్, మీడ్ లను పరీక్షించిన తరువాత లింకన్ ఆఖరికి యులిసిస్ ఎస్. గ్రాంట్‌ని జనరల్ పదవిలో నియోగించాడు. పొగ త్రాగుడుకీ, త్రాగుడుకీ ప్రసిద్ధికెక్కిన ఈ నిర్దాక్షిణ్య యోధ్ధ విల్‌డర్‌నెస్‌లోనూ, స్పాట్సిల్‌వేనియా రంగంలోనూ, కోల్డు హార్బర్ వద్దనూ, రిచ్‌మాండ్ పీటర్స్‌బర్గ్ ప్రాంతాల్లోనూ దుర్దమ దాడులు చేశాడు. తరువాత కన్ఫెడరేట్ రాజధాని మీదికి దండెత్తాడు. ఈలోపుగా షెర్మన్ జార్జియా నుండి సముద్రంలోకి మార్గం చేసుకున్నాడు.

ఫిరంగి మోతల పైనుండి ఒక దయార్ద్ర కంఠం జ్ఞాన బోధ చేస్తూ తరుచు వినవచ్చేది. యుద్ధ తీవ్రతలో కూడా ద్వేషాగ్నిని చల్లార్చడానికి పాటుపడే అబ్రహాం లింకన్ కంఠస్వర మది.

'ఆ మహా కంఠస్వరం ఇలా వినిపించేది: "బానిసకి స్వాతంత్ర్యం ఇవ్వడం ద్వారా స్వతంత్రుల స్వాతంత్ర్యాన్ని మనం భద్ర పరుస్తున్నాం."

ఇంకా ఇలా కూడా వినిపించేది:

"ఎనభై సంవత్సరాల పూర్వం మన తండ్రులు స్వాతంత్ర్యంతో పుట్టి, సమస్త మానవులూ సమాన హక్కులతో సృష్టించ బడ్డారనే సిద్ధాంతానికి అంకిత మొనర్చబడ్డ ఒక కొత్త జాతిని ఈ ఖండంలో స్థాపించారు. మన మిప్పుడు ఒక గొప్ప అంతఃకలహంలో కొట్టుకుం



సృష్టికర్త దృష్టిలో మానవులంతా సమానులు

టున్నాం. ఆ విధంగా పుట్టి ఆ విధంగా అంకితమైన జాతి ఏజాతి అయినా శాశ్వతంగా నిలబడగలదా లేదా అన్నదే ఇప్పుడు పరీక్ష"

ఆఖరికి- ఆ స్వరం ఇక ఒక నెల రోజుల్లో శాశ్వతంగా మూకత వహిస్తుందనగా, అంతః కలహ సమయంలో ఏ ప్రభుత్వాధికారిచేతా ఎన్నడూ చెప్పబడని గొప్ప శీవితో గూడిన మాటలు వినిపించాయి;

"ఎవరి యెడలా ద్వేషం లేకుండా, అందరినీ ఆదర భావంతో చూస్తూ, భగవంతుడు న్యాయాన్యాయ విచక్షణబుద్ధి మన కిచ్చాడు కనుక న్యాయం మీద స్థిరంగా నిలుస్తూ మనం ప్రారంభించిన పని పూర్తి చేద్దాం; జాతి గాయాలు మాన్పుదాం; యుద్ధంలో చని పోయిన సైనికుణ్ణీ, అతని వితంతువునీ, దిక్కులేని అతని సంతానాన్నీ ఊరడిద్దాం; శాశ్వత శాంతిని స్థాపించేందుకు అవసరమైన దంతా చేద్దాం. మనలో మనకూ, ఇతర జాతులతోటీ న్యాయమైన శాశ్వత మైన శాంతిని స్థాపిద్దాం"

1865 మార్చి 4-వ తారీఖున గాలిలో, వానలో లింకన్ తన రెం డవ సంవత్సర ప్రారంభోపన్యాసంలో ఈ ఆదర సిద్ధాంతాన్ని ఉద్బో ధిస్తూ ఉండగా సూర్యుడు మేఘాల్ని చీల్చుకుని బయటికి వచ్చాడు. సూర్యకాంతి సూటిగా అతని ముఖం మీద ప్రసరించింది. సభికుల్లో కొందరికి ఇది ఒక శుభశకునంగా ఒక శుభ సూచనగా తోచింది వారి ఉద్దేశ్యంలో యుద్ధ మేఘాల్ని చీల్చుకుంటూ భగ్నమైన, బాధ పడు తూన్న ఒక జాతిపై ఆశా కిరణాలు ప్రసరించాయి.

వీరుడైన రోబర్ట్ ఇ. లీ, అలసిన అతని సైన్యమూ, ఆహారం లేక, 1865 ఏప్రిల్ 9 వ తేదీన ఎపోమ్యాటాక్స్ కోర్టుహౌసు దగ్గిర యులిస్సెస్ ఎస్. గ్రాంట్‌కి తప్పనిసరిగా లొంగి పోయాడు. ఆఖరికి యూనియన్ కాపాడబడింది. కాని ఎంత భయానక నష్టంతో! ఉత్తరాది అంతటా నగరాలలోనూ, గ్రామాల లోనూ, పొలాల లోనూ ఆనంద నిశ్వాసం వెలువడింది! పరాజయ బాధలో ఉన్న దక్షిణ ప్రాంతంలో కూడా కొంత ఉపశమనం కనిపించింది. యుద్ధం పూర్తి అయింది.

అయితే యుద్ధఫిరంగుల మ్రోతలు సద్దుమణిగా యన్న శుభ సమాచారాన్ని ప్రెసిడెంటు లింకన్ సరిగా ఇంకా గ్రహించాడో